

భాషాసేవకుడు తిరుమల రామచంద్ర శత జయంతి సంవత్సర వేడుకల ప్రారంభోత్సవం ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమిలో 2013,
జూన్ 22వ తేదిన జరిగినప్పటి చిత్రం. ఈ సందర్భంగా వయోధిక పాత్రికేయ సంఘం ప్రచురించిన
"పండిత పాత్రికేయులు - బహుభాషాకోవిదులు" పుస్తకం ఆవిష్కరించిన
ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ . సమాచార శాఖ సంచాలకులు శ్రీ సుభాష్ గౌడ్,
ప్రెస్ అకాడమి అధ్యక్షులు శ్రీ టి. సురేందర్, వయోధికపాత్రికేయ సంఘ అధ్యక్షులు శ్రీ జి.యస్. వరదాచారి
తిరుమల రామచంద్ర కుమార్తె శ్రీమతి టి. నీరజ లు చిత్రంలో ఉన్నారు.



తిరుమల రామచంద్ర శత జయంతి సందర్భంగా పొట్టిశ్రీరాములు తెలుగు యూనివర్సిటీ ఆవరణలోని
యన్.టి.ఆర్. ఆడిటోరియంలో 2013, డిశంబర్ 23 తేదిన కేంద్రసాహిత్య అకాడమి,
వయోధిక పాత్రికేయ సంఘ సంయుక్త నిర్వహణలో జరిగిన ఒక రోజు సదస్సులో వయోధిక పాత్రికేయ సంఘం ప్రచురించిన
"పలుకుబడి" గ్రంథం ఆవిష్కరణ చేసిన తెలుగు యూనివర్సిటీ పూర్వ వైస్ చాన్సలర్ ఆచార్య యన్. గోపి.
చిత్రంలో వయోధికపాత్రికేయ సంఘ అధ్యక్షులు శ్రీ జి.యస్. వరదాచారి, ఉపాధ్యక్షులు శ్రీ టి. ఉదయవర్లు,
కార్యదర్శి శ్రీ కె. లక్ష్మణరావు, ద్రావిడ విశ్వవిద్యాలయం పూర్వ వైస్ చాన్సలర్ ఆచార్య రవ్వా శ్రీహరి,
కేంద్రసాహిత్య అకాడమి బెంగుళూరు ప్రాంతీయ కార్యాలయం అధికారి యస్. పి. మహాలింగేశ్వర్ ఉన్నారు.

**_PALUKUBADI - 2 by Dr. Tirumala Ramachandra_**

| | | |
|---|---|---|
| Published by | : | **Veteran Journalists' Association** |
| Publication No | : | 09 |
| First Edition | : | December, 2014 |
| Copy Right | : | **Veteran Journalists' Association** |
| Price | : | Rs. 100 |
| For Copies2 | : | **Veteran Journalists' Association**<br>Plot No. 24, Journalists' Colony,<br>Road No. 3, Banjara Hills,<br>Hyderabad - 34<br>&<br>All leading Book sellers |
| For Correspondence | : | 80-B Journalist colony,<br>opp. to Appolo Hospital main entry gate,<br>Jubilee Hills Hyderabad-96<br>Mob 9394712208<br>lakshmanarao_konda@yahoo.co.in |
| Cover | : | **Pinisetty** |
| DTP | : | **L. RAMA KRISHNA** |
| Design | : | **EFFORTS DESIGN**<br>www.efforts.co.in |
| Printed at | : | **Sai Lakhita Printers**<br>Khairatabad, Hyderabad. |

# ముున్నుడి

తెలుగు భాషావికాస సంవత్సరంగా కొలువబడుతున్న 2013లో ముగ్గురు మహామనీషుల శతజయంతులు రావడం, తెలుగు భాషోన్నతికి వారు చేసిన మహత్తర కృషిని స్మరించుకునే ప్రత్యేక అవకాశాన్ని భాషాప్రియులకు కలిగించినది. ఆ మహనీయులు తిరుమల రామచంద్ర, పుట్టపర్తి నారాయణా చార్యులు, కాళోజీ నారాయణరావు. చివరి ఇద్దరు కవిత్వ ప్రక్రియలో సాటిలేనివారు. పుట్టపర్తివారు 'శివతాండవం' వంటి లయాత్మక పద్యకావ్యం రచించి అఖండ ఖ్యాతిని ఆర్జిస్తే. కాళోజీ ప్రజల గోడును తనగోడుగా అనితర సాధ్యమైన ఫణితిలో వచన కవిత్వంగా అందించి ప్రజాకవిగా కీర్తి గడించారు. రామచంద్ర ప్రధానంగా పత్రికా రచయిత గనుక వచనాన్నే కవిత్వమంత భావస్ఫోరకంగా, సర్వాంగ సుందరంగా అందించి వాసికెక్కారు.

రామచంద్ర గొప్ప పండితుడు, బహుభాషావేత్త. నిర్విరామ పరిశోధకుడు. విమర్శకుడు, సాహిత్యసమీక్షకుడు, అనువాదకుడు, బహుగ్రంథకర్త. వీటన్నిటినీ పత్రికా రచనా వ్యాసంగాన్ని ఆలంబనగా చేసుకునే సాధించగలిగాడు. ఆయన పాత్రికేయ జీవనయానం 1944లో కాన్పూరులో 'డెయిలీ టెలిగ్రాఫ్' ఆంగ్లపత్రికతో ఆరంభమైంది. తర్వాత 'తెలంగాణ పత్రిక', మళ్లీ 'ఆంధ్రపత్రిక', 'ఆంధ్రప్రభ' తానే స్థాపించి సంపాదకత్వం వహించిన 'పరిశోధన', 'ఆంధ్రభూమి' దినపత్రిక, 'హిందుస్తాన్ సమాచార్' వార్తా సంస్థలలో అర్ధ శతాబ్దికిపైగా దిగ్విజయంగా సాగింది. పలుపత్రికలలో ఆయన విశేష పాఠకాదరణ పొందిన శీర్షికా రచయితగా కూడా నిజ నామంతో, కలంపేర్లతో గొప్ప భాషాసేవ చేశారు. రామచంద్రకు ఎన్నో పురస్కారాలు, బిరుదులు లభించాయి. కాని ఆయన 'పత్రకార్ శిరోమణి' బిరుదును మాత్రమే తమపేరు ముందు వ్రాసుకోడానికి ఇష్టపడేవారు. 'భాషా సేవకుడు' అనే తనను తాను వర్ణించుకొనేవారు.

పత్రికారచనలో విషయపరిధి పెరిగిన కొద్దీ కొత్తపదజాలం అవసరమవుతుంది. శాస్త్ర, సాంకేతిక పరిభాష అవసరమవుతుంది. మనకు వైద్యం, శరీర నిర్మాణశాస్త్రం, రసాయనశాస్త్రం, లోహశాస్త్రం, గణితం, ఖగోళ విజ్ఞానంలో సంస్కృత గ్రంథాలలో కావలసినంత పరిభాష అందుబాటులో ఉంది. కాని లోపభూయిష్ఠమైన  విద్యావిధానం వల్ల సంస్కృతం నేర్చుకునే అవకాశం లేదు. కనుక గ్రంథస్థం అయి ఉన్న భాషాసంపద కూడా పూర్వికులు భూగర్భంలో దాచిన ధనసంపత్తిలాగ వాడుకోలేని దుస్థితి.

కొత్త శాస్త్రీయాంశాల ఆవిష్కరణలు జరిగినప్పుడు కొత్త పదసృష్టి అవసరమవుతుంది. ముందుగా ఈ సమస్య పత్రికారచయితల ముంగిట్లో వాలుతుంది. 175 ఏళ్లుగా తెలుగు పత్రికారచనలో ఇది అందరూ ఎదుర్కొన్న సమస్యే శక్తిమేరకు పరిష్కరించుకొంటూ వస్తున్నదే. వీరేశలింగం పంతులు నుంచి ప్రారంభించి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, నార్ల వెంకటేశ్వరరావు, ఆ తర్వాత మా తరం వరకు అందరి కృషి ఉంది. ఆ కృషిలో రామచంద్ర వంటి పాళీ, ప్రాకృత, సంస్కృత తదితర భాషలు క్షుణ్ణంగా తెలిసినవారి పాత్ర అవిస్మరణీయమైంది, ఆదర్శవంతమైంది.

తిరుమల రామచంద్ర శతజయంతి సభ జరిపి స్ఫూర్తి పొందాలని వయోధిక పాత్రికేయసంఘం సంకల్పించినప్పుడు ఆయన వదలివెళ్లిన అమూల్య భాషా సంపదను ఈ తరం భాషావ్యవహర్తలకు అందుబాటులోకి తెస్తే అదే ఆయనకు సముచిత నివాళి అవుతుందని భావించాము. ఆ ఆలోచనను ఆచరణలో పెట్టడానికి, సాధన సంపత్తిని సమకూర్చుకోడానికి తొలి అడుగుగా 'తిరుమల రామచంద్ర శతజయంతి సంస్మృతి' అనే చిన్న పుస్తకాన్ని వెలువరించాము. దాని ముందుమాటలో "భాషాభివృద్ధికి తోడ్పడటం ప్రభుత్వలక్ష్యాలలో ఒకటి గనుక అధికార భాషాసంఘమో, తెలుగు విశ్వవిద్యాలయమో, తెలుగు అకాడమీయో ఈ సాహితీకృషీవలుని రచనలన్నిటినీ సమగ్ర సాహిత్య సంపుటాలుగా ప్రచురించాలని" కోరాము. శతజయంతిని ఆయన విశిష్ట వ్యక్తిత్వానికి తగిన స్థాయిలో జరపాలని కేంద్రసాహిత్య అకాడమీని సంప్రదించగా, వారికీ ఆ ఆలోచన ఉండటంతో రామచంద్ర శతజయంతి సదస్సును నిర్వహించడానికి ముందుకు వచ్చారు. ఈ సదస్సు సందర్భంగా రామచంద్ర అముద్రిత రచనలలో 'పలుకుబడి' శీర్షికన వెలువడిన వ్యాసాలను గ్రంథస్థం చేసి మా అభిమానాన్ని చాటుకున్నాము. పలుకుబడి శీర్షిక క్రింద తిరుమల రామచంద్ర వ్రాసిన వ్యాసాలు దొరికినంత వరకు తొలి ప్రచురణగా ప్రచురించాము. ఆ తరువాత లభించిన ఇతర వ్యాసాలను పలకుబడి – 2 గా ప్రస్తుతం వెలుగులోకి తెస్తున్నాము. భాషాసేవలో ఇది ఇంకొక ముందడుగు అవుతుందని విశ్వసిస్తున్నాము. ఈ గ్రంథాన్ని భాషా ప్రియులు, ముఖ్యంగా నవతరం పత్రికా రచయితలు సద్వినియోగం చేసుకుంటారని ఆశిస్తున్నాము.

**డా॥జి.యస్.వరదాచారి**

హైదరాబాద్ — అధ్యక్షులు, వయోధిక పాత్రికేయ సంఘం

22–12–2014

# ఘోటక బ్రహ్మచారి

సుబ్బరామయ్య (ఇంటి పేరు కొత్తపల్లి లాగా నాకు అనిపించింది) బెనారస్ విశ్వవిద్యాలయంలో ఎం.ఎస్‌సి. (జీవశాస్త్రం) చదివారు. స్వాతంత్ర్య సమరయోధులు. కొన్నేళ్లు కారాగారక్లేశం అనుభవించారు. అప్పుడు ఏ మాత్రం ప్రయత్నం చేసినా ఏ విశ్వవిద్యాలయంలోనో ఉపన్యాసకులయి, ఆచార్యులుగా పదవీవిరమణ చేసి ఉండేవారు. కాని తరిమెల నాగిరెడ్డి మొదలయిన వారి సహాధ్యాయులు గనుక ఉద్యోగం తలపెట్టలేదు. మద్రాసులో ఒక ప్రచురణ సంస్థ స్థాపించి కొన్ని మంచి పుస్తకాలు ప్రచురించారు.

ఆయనను నేను ఒకసారి మద్రాసులోనే కలుసుకోవలసి వచ్చింది. ఉమ్మడి మిత్రులు ఒకరు నాకు ఆయనను పరిచయం చేశారు. ఆయన అర్హతలన్నీ చెప్పి చివరకు "బ్రహ్మచారి – ఘోటక బ్రహ్మచారి, ఏ బాదరబందీ లేదు" అని ముగించారు.

సుబ్బరామయ్య ఆ పరిచయవాక్యాలకు ముసిముసి నవ్వులు నవ్వుతూ నాతో మాట్లాడడం మొదలుపెట్టారు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఏమిటీ? ఇతడు ఘోటక బ్రహ్మచారి అని అంటూంటే ప్రశంసగా భావిస్తున్నాడే! ఏ మాత్రమూ అసంతృప్తి కనబరచకుండా సంతోషిస్తున్నాడే అనుకుంటూ, పరిచయం చేస్తున్న మిత్రుని వైపు కొంచెం తీవ్రంగా చూసి "ఏమిటి? ఘోటక బ్రహ్మచారి అంటున్నారు. తెలిసే అంటున్నారా?" అని పెద్ద గొంతుతో అన్నాను.

ఆయన నా వైపు తిరిగి "అదేమిటి? మా సుబ్బరామయ్య గారి సంగతి నాకు తెలియకపోవడమేమిటి? మేము బాల్యమిత్రులం. ఆయన పెళ్ళి మానుకున్నాడు. అప్పటి నుంచి ఘోటకం" అని మళ్ళీ అన్నారు.

ఇదేమిటి ఇతడు నా అభిప్రాయం గ్రహించినట్టులేదు అని అనుకుని, "మహానుభావా! ఘోటక బ్రహ్మచారి అనేది తిట్టండీ! దానిని ప్రశంసకు వాడరు, ఆక్షేపణకు వాడుతారు" అన్నాను.

"కొత్తగా నాకు చెప్పవచ్చారేమిటి? ఇంతకాలంగా వాడుతున్నాం. ఇతడు మాంచి ఘోటక బ్రహ్మచారి. ఎవర్నయినా కనుక్కోండి. తిట్టు ఎలా అవుతుంది? ఇంత వరకూ ఈయన విషయంలో అందరం వాడుతున్నాం. ఆదర్శ బ్రహ్మచర్యం. సంపూర్ణ కఠోర ఘోటకం. ఎంత బతిమాలినా పెండ్లి వద్దంటాడు" అంటూ ఏమిటేమిటో సుబ్బరామయ్య గుణగణాలను గురించి చెబుతూపోయాడు.

నాకు విసుగు పుట్టింది. "అయ్యా! ఈయన గొప్పదనం గురించి విన్నాను. ఇప్పుడు మీరు పరిచయం చేశారు. చాలా సంతోషించాను. ఈ విషయంలో నాకు ఎలాంటి ఆక్షేపణా లేదు. నా ఆక్షేపణంతా ఘోటక బ్రహ్మచారి అనే పదం అర్థం గురించే. మీరు అనుకుంటున్నట్టు అది ప్రశంస కాదు; అభిశంసనం, తిట్టు" అన్నాను.

ఆయన, సుబ్బరామయ్య కూడా "ఆ మాటలో తప్పేమిటండీ? చెబుదురూ! ఇంత కాలంగా వాడుతున్నాం. ఎవరూ ఆక్షేపించలేదు. మీరు తప్పంటున్నారు, వివరించండి" అన్నారు.

"తప్పని తెలిసినా కొందరు మనకెందుకు వాదం ఈ విషయంలో? ఘోటకమో, నైష్ఠికమో? ఎవడెక్కడ పోతే మనకేమిటీ? అని నవ్వుకుంటూ ఊరుకుండి పోయి ఉంటారు. ఈ పదం నిజమయిన అర్థం తెలియక పోతే ఈయనకు ఈ మాటే స్థిరమయిపోయి ఎప్పటికయినా అవమాన పడవచ్చు. కనుక వివరించడం, మీ అపార్థాలు పోగొట్టడం నా విధ్యుక్తధర్మం" అంటూ ఇలా అన్నాను.

"మన వ్యవస్థలో నాలుగు ఆశ్రమాలు ఉన్నాయి బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాలు అని. మన పూర్వులు జీవితం సవ్యమైన మార్గంలో సంఘానికి వినియోగపడడం కోసం కొన్ని కట్టుబాట్లు చేశారు. వాటిలో మొదటిది బ్రహ్మచర్యం, దీనిలో విద్య నేర్పి, రెండవదయిన గార్హస్థ్యంలో వివాహం, సంతానం, న్యాయధనార్జన సత్కర్మాదులు జరిపి, వీతరాగుడై వానప్రస్థంలో వనంలో అంటే ఇప్పుడు వనాలకు పోవడం సాధ్యం కాదు గనుక సంసార జంజాటాలకు దూరంగా ఉంటూ, చివరకు అంతా వదులుకుని సన్న్యాసం గ్రహించాలి అనేది ఈ జీవన పద్ధతి. నాల్గింటిలో మొదటిది తక్కిన మూడింటికీ మూలబంధం. పునాది మూలబంధం గట్టిగా ఉంటేనే ఎన్ని అంతస్తుల మేడనయినా కట్టడం సంభవం.

బ్రహ్మ అంటే విద్య. చిన్నతనం నుంచే నిష్ఠతో, శ్రద్ధతో చదువు నేర్వాలి. చదువుతుంటే పుస్తక పాఠం మాత్రమే కాదు. ఆయా వృత్తుల విద్య అని అర్థం. ఇది చిన్న నాటి నుంచే నేర్వాలి. 'బ్రహ్మ + చర్యం = వేద గ్రహార్థం చర్యం–వేదం నేర్వడం కోసం, విద్య నేర్వడం కోసం వ్రతం అనుష్ఠించడం. ప్రతి వేదాన్ని పన్నెండేండ్లుగాని, ఐదేళ్ళుగాని చదివి ఆయా వేదాల అధ్యయనం పూర్తి కాగానే శాంతి చేయాలి' అని కొందరు అంటారు. అంటే వేద గ్రహణార్థం వ్రతం ఆచరించడం బ్రహ్మచర్యం. వ్రతమంటే చేయదలచిన పనిని ఏకాగ్రంగా, శ్రద్ధతో చేయడం.

ఈ వేదగ్రహణ సమయంలో అనుసరించవలసిన నియమాలు కొన్ని ఉన్నాయి. వాటిలో ప్రధానమయినది స్త్రీ సహవాసం లేకపోవడం. స్త్రీ నిప్పు వంటిదని, పురుషుడు నేతికుండ వంటివాడని, నిప్పు సెగ తగిలి నేయి కరిగినట్టే పురుషుడు స్త్రీ సహవాసంతో ఇంద్రియనిగ్రహాన్ని కోల్పోతాడని మనువు హెచ్చరించాడు, స్త్రీ సద్యః ఫలమిచ్చే మహాబలయుక్తమైన ఆకర్షణ కనుక బ్రహ్మచారులు, విద్యార్జన పరాయణులు పాటించవలసిన ప్రధాన విషయం ఇంద్రియనిగ్రహం అయింది. క్రమంగా బ్రహ్మచర్యం అంటే ఇంద్రియనిగ్రహమనే భావం స్థిరపడడం వల్ల దానికిది పర్యాయపదమయింది. బ్రహ్మచారి అంటే స్త్రీ సహవాసం లేని ఇంద్రియనిగ్రహం గలవాడు అనే అర్థం రూఢి అయింది.

ఈ బ్రహ్మచర్యం ప్రధానంగా వైదికం, నైష్ఠికం, ప్రాజాపత్యమని మూడు విధాలు. నైష్ఠికమనేది యావజ్జీవం నిష్ఠతో చేసేది. వైదికం వైదికకర్మలు నిర్వహించేటప్పుడు కొంతకాలం పాటు స్త్రీ సహవాసం మానుకోవడం, ప్రాజాపత్యం అనేది ఒక వివాహపద్ధతి. ఈ పద్ధతిలో పెళ్ళాడి కాపురం చేస్తూ నిషిద్ధదినాలలో స్త్రీ సహవాసం లేకుండా ఉండడం. ఋతుకాలంలో మాత్రమే స్త్రీ సహవాసం కోరుతూ ఇతరసమయాలలో దూరంగా ఉండేవాడిని బ్రహ్మచారి అని అన్నారు.

మన పురాణాలలో నైష్ఠికబ్రహ్మచారులు భీష్ముడు, శుకుడు మొదలయిన వారు ఎంతో నిగ్రహంతో ఉన్నా 'రేతస్సు స్ఖలనం శరీర పరిస్థితిని బట్టి బ్రహ్మచారులు తమ వీర్యాన్ని రక్తంతో పాటు దేహమంతా ప్రసరించేటట్లు చేసి ఊర్ధ్వరేతస్కులవుతారని పురాణాలు చెబుతున్నాయి."

ఇదంతా విని వారు "ఘోటక బ్రహ్మచారి అంటే ఏమిటో వివరించమంటే బ్రహ్మచర్యం గురించి ఉపన్యాసమెందుకండీ?" అని విసుక్కున్నారు.

నేను అన్నాను – "అదే చెబుతున్నానండీ. అక్కడికే వస్తున్నాను. ఆహార నిద్రాభయమైథునాలు జీవులకు సర్వసామాన్యవిషయాలు. మానవుడు వివేక వంతుడు కనుక సంఘం బాగోగులు చూడవలసిన వాడు. తదనుగుణంగా నడవవలసిన వాడు గనుక నిగ్రహంతో ఉంటాడు. స్త్రీల యెడల కానీ, పశుపక్ష్యాదులు ఉండలేవు. ముఖ్యంగా గుర్రాలు ఉండలేవు. మగ గుర్రం ఆడ గుర్రం కనిపించే వరకే నిగ్రహంతో ఉంటుంది. ఆడ గుర్రం కనిపించగానే కట్లు తెంచుకుని దాని వద్దకు పారిపోవడానికి ప్రయత్నిస్తుంది. మానవుని అదుపులో లేని మగ గుర్రం, ఆడ గుర్రం కనిపించగానే సకిలిస్తూ

వెంటబడుతుంది. ఆడ గుర్రం వాసనకే దాని శరీరాంగాలలో మార్పు కలుగుతుంది. తక్కిన క్షీరపాయి జంతువులన్నింటికన్నా గుర్రానికి ఈ ఉద్రేకం ఎక్కువ. పక్షులలో పిచ్చుకలలో, పావురాలలోనూ ఈ స్వభావం కనిపిస్తుంది ఎక్కువగా.

"మగ గుర్రం ఆడ గుర్రాన్ని చూసీ చూడగానే నిగ్రహాన్ని కోల్పోయి సకిలిస్తూ ఒళ్ళు పొంగిపోయి వెంటబడుతుంది కనుకనే, ఘోటక బ్రహ్మచర్యం అనే పదబంధం సంస్కృతంలో ఏర్పడింది. అంటే స్త్రీ కనపడే వరకే నిగ్రహంగా ఉంటూ స్త్రీ కానరాగానే మనస్సు సంచలించి విషయాసక్తుడయ్యే బ్రహ్మచారిని ఘోటక బ్రహ్మచారి అంటారు. ఇది తిట్టు కాని ప్రశంస కాదు. సుబ్బరామయ్యను నైష్ఠికబ్రహ్మచారి అనండి, బాగుంటుంది. ఘోటక బ్రహ్మచారి అంటే స్త్రీ కనబడగానే సిగ్గు విడిచి వెంటబడే మనిషి అని తిట్టినట్టు.

"అయితే కొందరు కథల్లోనూ, నవలల్లోనూ ఈ మాటను వాడుతున్నారే!" అన్నారు వారిద్దరూ, ఒకే గొంతుకతో. "అయ్యా! ఘోటక బ్రహ్మచారి అనే పదాన్ని వాళ్ళు కూడా మీలాగే మంచి మాట అనుకుని ఉంటారు. ఎవరినీ అడగా పెట్టకుండా వాడి ఉంటారు. ఇది తప్పు అని పనిగట్టుకుని చెప్పే వాడెవడు? ఇప్పుడు ఈ సత్పురుషుడయిన సుబ్బరామయ్యను ఇలా పరిచయం చేస్తున్నారేమిటి అనే బాధతో నేను తెగించి చెప్పుకున్నానుగాని, మరొకరికి ఏమిపట్టిందీ? మీకు ఆ మాటకు అర్థం తెలియదనన్నా అనుకుంటాడు. సుబ్బరామయ్య స్వభావం ఇంతే అనయినా అనుకుని నవ్వుకుంటాడు" అని అన్నాను.

"భలే పాఠం చెప్పారండీ! 'భీష్మపితామహుని వంటి మా సుబ్బరామయ్యను, ఇంతకాలమూ అర్థం తెలీక అందరికీ ఘోటక బ్రహ్మచారి అని పరిచయం చేస్తూ అవమానిస్తున్నాను పాపం!" అని నా మిత్రుడంటూ, "మరి కుక్క కూడా ఆడ కుక్కను చూడగానే వెంటబడుతుంది కదా, శునక బ్రహ్మచారి అని అనవచ్చునే! ఘోటక బ్రహ్మచారి అనే ఎందుకు అనడం?" అని మరొక శంక విదిలించాడు.

"మంచి ప్రశ్నే– ఘోటకం అనడానికి కారణం ఉంది. మగ గుర్రానికి ఆడ వాసన తగలగానే ఒళ్ళు పొంగిపోయి ఆ వికారాలు మనకు స్పష్టంగా కనిపిస్తాయి. అది ఉండలేకపోతుంది. తెంచుకుని పోదామని గింజుకుంటుంది. అవయవాలు కొట్టుకోవడం ఆరంభమవుతుంది. కుక్క కంటే కనీసం పదింతల భారీ దేహంగలది కనుక అంగవికారాలు స్పష్టమవుతాయి. కనుక గుర్రాన్ని ఉదాహరణగా తీసుకున్నారు" అన్నాను.

*****

# పరకామణి అంటే...

"తిరుమల సన్నిధి పరకామణిలో దొంగతనం డబ్బుతో పట్టుబడ్డ దొంగ" అనే వార్త నెల క్రిందట పత్రికలలో చదివాను. అంత బందోబస్తుతో జరిగే పరకామణిలో దొంగతనం ఎలా జరుగుతుందా? అని ఆశ్చర్యం కలిగింది. నా చిన్నతనంలో ఇలాగే పరకామణిలో లెక్కలలో తభావతు రాగా అనుమానితుడు రక్తం కక్కుకొని చచ్చాడని, వేంకటేశ్వరుడు అలాంటి వారి తప్పిదాలు మన్నించడని, వెంటనే శిక్షిస్తాడని, అందువల్లనే ఆ దోషి రక్తం కక్కుకుని చచ్చాడని అన్నారు. ఇది నా పదవ ఏట జరగిన సంగతి. ఇప్పటికి డెబ్బయి మూడు సంవత్సరాల నాటి మాట. మరి మొన్నటి నిందితుడిని వేంకటేశ్వరుడు ఎందుకు శిక్షించలేదో! అలాంటివాళ్ళకు లాంగ్‌రోప్ ఇద్దామని భావించాడేమో ఆ భగవంతుడు! అది ఆయన సంగతి. మనకు ప్రశ్నించే, ఆలోచించే హక్కు లేదు.

కాని, ఈ ఆలోచనలు నన్ను విడనాడలేదు. ఇటీవల తిరుపతికి వెళ్ళినప్పుడు, శ్రీవారిని సేవించుకున్న మీదట, ఒకమారు శ్రీవారి హుండీ, దాని పరిసరాలు, కటకటాలు, తాళ్ళు కట్టిన పరకామణి ప్రాంతం పరిశీలనగా చూచాను. పరకామణిలో దొంగతనం చేసి పైకి పోవడానికి అవకాశం తక్కువ. జేబులోనో, బొడ్డులోనో యుక్తిగా దాచుకోవచ్చు. ఆధునిక యంత్రపరికరాలు వాడితే ఆ దొంగతనాలు త్రుటిలో పట్టుబడిపోతాయి.

ఇలాంటి దొంగతనాలు ఒకరి మేధాజనితాలు కావు. ఇద్దరుముగ్గురు పథకాలు పన్నితేగాని, ఇలాంటివి జరగవు ఇలా ఆలోచిస్తూ పరకామణి ప్రాంతంలో తిరిగాను.

పూర్వం– నా చిన్నతనంలో శ్రీవారి హుండీ నిండడానికి పది గంటలు పట్టేది. ఈ పరకామణి అపరాహ్ణంలోనో, సాయంకాలమో పేష్కారు సమక్షంలోనో, అతడు లేకపోతే పారు పత్తేదారు సమక్షంలోనో జరిగేది. ఇప్పుడు భక్తుల సంఖ్య కోట్లను సమీపిస్తున్నది, వారి ముడుపులతో శ్రీవారి హుండీ త్వరగా నిండిపోతున్నది గనుక, పరకామణి కూడా చాలాసార్లు జరుగవలసి వస్తున్నది.

ఇంతకూ పరకామణి అంటే ఏమిటో చెప్పకుండా, దానిని గురించే చెబుతున్నాను గదూ! ఇది కొత్త పరిశోధన పద్ధతి. అసలు సంగతి మాని తక్కినదాని గురించి చెప్పడం. గురించి విరించులు ఇప్పుడు ఎక్కువయ్యారు. దీనికొక కథ ఉంది. కొందరు మేధావులు సమావేశమయి గొర్రెలను గురించి చర్చిస్తున్నారట. ఆ గొర్రెలలో పర్షియా జాతి గొర్రె

ఒకటి. దీని తోక లావుగా ఉంటుంది. అది గొర్రె వయస్సు పెరిగినకొద్దీ పెరుగుతూ వెడల్పయి, లావయి మరొక దేహమంత అవుతుంది. వాటిని పంజాబులో దుంబా గొర్రెలంటారు. వాటి ఉన్ని మృదులం, మాంసం, ముఖ్యంగా తోక మాంసం మహా రుచ్యమట!

ఈ మేధావులు దుంబా గొర్రె తోక ఎంత లావు పెరుగుతుంది, ఎంత వెడల్పవుతుంది, ఎంత బరువుంటుంది – అనే విషయమై లెక్కలతో సహా హోరాహోరీగా వాదించుకుంటున్నారట. పక్కన కొంత దూరంలో గొర్రెలు కాస్తున్న ఒక గొర్రెలకాపరి ఆ మేధావులు వాదించుకుంటున్న విషయం ఎంత గంభీరమయిందో అని సమీపించి, కర్ర ఊని గడ్డం ఆనించి నిలబడి, విని, "హూష్! ఇంతేనా? అయ్య గార్లూ! దీనికింత చర్చ ఎందుకు? దుంబా గొర్రెలు నా మందలో చాలా ఉన్నాయి. రెండు గొర్రెలను తేనా?'' అన్నాడట. వారు వాడి మూర్ఖత్వానికి నవ్వి ''బాగుంది. అసలు గొర్లవాడనిపించుకొన్నావోయ్! గొర్రెను చూస్తే, ఇక వాదమేముంటుంది? మా తర్కమేముంటుంది? గురించిన చర్చ ఏముంటుంది?" అన్నారట.

మా సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు సేలం సుబ్బారావుగారు ఎవరినో ఎవరికో పరిచయం చేస్తూ "హీ నోజ్ శాన్స్క్రిట్– అతనికి సంస్కృతం తెలుసు, అదర్ జంటిల్‌మాన్ నోజ్ ఎబౌట్ శాన్స్క్రిట్– రెండవ పెద్దమనిషికి సంస్కృతం గురించి తెలుసు" అని అన్నారని చెబుతుండే వారు. ఇంతకూ పరకామణి అంటే....

కొన్ని హిందీ, మరాఠీ పదాలు మనకు పరిపాలన వాణిజ్యాదుల వల్ల పరిచితమయ్యాయి. అనంతపురం జిల్లాలో వరికోతలకు 'కటామణి పనులు' అని వ్యవహరిస్తారు. కట శబ్దం ప్రాకృత సంస్కృత పదం. అదీ ప్రాకృత జన్యభాషలలో కట్‌నా, కాట్‌నా, కటణా, కాటణా అని మారింది. దీని భావార్థకరూపం కటావన్– కటామణ్. ఇది కటామణి అని తెలుగులో చేరింది. హలంత పదాలను అకార ఇకార ఉకారాంతాలుగా చేసుకొని వాడుకోడం మన భాషాసంప్రదాయం.

ఇలాంటి భావార్థకపదమే పరకామణి. పరీక్షా అనే సంస్కృతపదం ప్రాకృతంలో పరీక్ఖా, పరీచ్ఛా అని మారింది. పరీక్షాపత్రం పర్చా అయింది. పత్ర శబ్దాన్ని కోల్పోయి, పరీక్ష కోసం ఇచ్చే పత్రం, పర్చాపత్రం = ప్రశ్నపత్రం. పరీక్షించేవాడు – పరీక్షక – పరీఖ్, పరేఖ్, పారిఖ్ అయింది. గుజరాతీలలో పరీఖ్, పరేఖ్, పారిఖ్ అనే ఇంటి పేర్లున్న వారున్నారు. వీరు పరీక్షకులు – రత్నాలు, వజ్రాలు పరీక్షించేవారు. ఇప్పటికీ ఈ ఇంటి పేర్ల వారు వ్యాపారులే చాలామంది. నిన్నటి ప్రముఖ హిందీనటి, అలనాటి కథక్ నాట్యగురువు గోపీకృష్ణ శిష్యురాలు ఆశాపరేఖ్‌ను

ఉదాహరణకు చెప్పుకోవచ్చు. కబీర్‌దాస్ అంటాడు:

నామరతనధన పాఇకే
గఠరీబాంధ్ నఖోలో,
నాహీ పణ నహి పారఖూ
నహి గాహక నహి మోత్

రామనామమనే రత్నసంపదను పొందావా? ఇక మూటకట్టి బిగించు. మూట విప్పకు సుమా! దానిని - అమూల్య రత్నసంపత్తిని కొనడానికి తగిన పణం - డబ్బు ఎవరి వద్దా లేదు. ఆ రత్నానికి ఇంత ధర కట్టవచ్చు అని చెప్పే పారఖూ - పరీక్షకుడూ లేడు. కొనేవాడూ లేడు. ధర ఎంతో తెలీదు. కనుక మూటకట్టి భద్రంగా దాచుకో- అంటే, నామమంత్రం మనస్సులో దాచుకో. మంత్రాన్ని బహిరంగపరచవద్దు.

గురుం ప్రకాశయేత్ ధీమాన్ నతు మంత్రం ప్రకాశయేత్ - గురువు ఫలానా అని చెప్పవచ్చు గాని, మంత్రం ఫలానా అని చెప్పరాదని మంత్రశాస్త్రజ్ఞుల కట్టడి. కనుక మంత్రాన్ని భద్రంగా దాచుకోమన్నాడు కబీర్‌దాస్.

పై దోహాలో గాహక అనే పదం ఉంది కదూ! అది గ్రాహక అనే సంస్కృతపదం నుంచి ర వర్ణాన్ని వదిలించుకున్న రూపం. ఇది జనం నోట్లో పడి - గ్రాహక - గ్రాహక్, గిర్హాక్ -గిరాక్ - గిరాకీ అయింది. "ఏం సెట్టిగారూ! ఎలా ఉంది బేరం?" అంటే, "గిరాకీ లేదండీ!" అంటాడు వ్యాపారి.

పరీక్ష అనే పదం పరీక్ఖ - పరక్ఖా - పారఖ - పారఖూ - అని మారింది. ఈ పరఖా పరకా పదాల భావార్థకం పరకావన - పరఖావణ - ఇది పరకామణి అయింది, కటామణిలాగ. పరఖామణి - పరకామణి అంటే పరీక్షించడం, పరిశీలించడం అని స్పష్టమయింది కదూ! దేవుని సొమ్ము!, జాగరూకతతో మెలగండి. చూచి చూచి చావుదెబ్బ కొడతాడు వెంకటప్ప - తిరుమలప్ప - తిమ్మప్ప.

శ్రీవారి హుండీలో రకరకాల వస్తువులు సమర్పిస్తారు భక్తులు, తమ మొక్కుబడులకు అనుగుణంగా. వెండి కాళ్ళు, వెండి చేతులు, పిల్లల బొమ్మలు, నగలు, నాణేలు, నోట్ల కట్టలు - ఇలా ఎన్నో! వాటిని విడదీసి, వింగడించి, వేరుచేసి, పరిశీలించి, వర్గీకరించిన మీదట డబ్బు లెక్కించడం, వెండి, బంగారు వస్తువులను తూచడం, రత్నాల నగలను ఎన్ని రీతులని పరీక్షించడం - ఇదీ పరకామణి.

పూర్వం మహంత్ హాథీరామ్‌జీ, ప్రయాగ్‌దాస్‌జీ గొప్ప రత్నపరీక్షకులని ప్రసిద్ధి. వారు ఆయా రత్నాలను చూచీ చూడగానే ఇన్ని రీతులు అని, ముత్యాలను చూడగానే దీని నీరు ఇంత అని చెప్పేవారు.

ముత్యాలలో కదలాడే వెలుగును సౌందర్యానికి, లావణ్యానికి పరమావధిగా చెప్పారు సౌందర్య శాస్త్రజ్ఞులు.

ముక్తాఫలేషుచ్ఛాయా యాః
తరలత్వమివాంతరా,
ప్రతిభాతియత్ అంగేషు
తల్లావణ్య మిహోచ్యతే.

ముత్యాలలో కదలాడే నీరులాంటిది శరీరాంగాలలో తొణికిసలాడితే, దానిని లావణ్యం అంటారు – అని ఈ శ్లోకం అర్థం. అలాంటి లోకోత్తరలావణ్యాన్ని, కాంతిని నేను పూర్వపు పాటియాలా సంస్థానం ముఖ్యమంత్రి రారేవాలా కుమార్తెలో చూచాను. ఆవిడ వస్తూంటే, సందర్శకులు విస్తుపోయి లేచి నిలబడి అప్రయత్నంగా చేతులెత్తేవారు.

*****

## సాత్తిన – సాత్తని

కొన్ని నెలల క్రిందట సాతాని శ్రీవైష్ణవశాఖకు చెందిన నా మిత్రులొకరు సాతిన, సాతని, ఛాత్తాద పదాలను వివరించమని కోరారు. అదిగో వ్రాద్దాం, ఇదిగో వ్రాద్దామంటూ ఆలోచించడంలోనే కాలయాపనమయింది. భక్తిప్రధానమయిన మతాలన్నీ కులవ్యవస్థను ఈసడించాయి. కులవ్యవస్థకు వృత్తే మూలమయినా, కాలక్రమాన వృత్తులు మారినా, కులవ్యవస్థ పోలేదు. పూర్వం గ్రీకురోమనులలోను, ఈజిప్ట్‌లోను, మన దేశంలో ఉన్నట్టి వర్ణవ్యవస్థ ఉండేది. కాని, అది అంతరించింది. మనదేశంలో మాత్రం ఇంకా నిలిచి ఉంది. ఉపనిషత్కాలం నుంచీ కూడ కులవ్యవస్థపై విమర్శలు జరుగుతున్నా, అది ఒకవైపునుంచి సడలుతూ, మరొకవైపు నుంచి బిగుసుకుంటూంది. భక్తిప్రధానమతాలయిన వీరశైవం, వైష్ణవం, శాక్తం మొదలయినవన్నీ కులాన్ని దుయ్యబట్టినట్టివే. ఈ వ్యవస్థ అంత త్వరగా కూలిపోదని గ్రహించిన శైవ, వైష్ణవ, శాక్తాచార్యులు భగవత్సన్నిధిలోనన్నా కులాన్ని పాటించడం మానుకుంటే, కాలక్రమంగా కులవ్యవస్థ సడలిపోతుందని భావించి

రామానుజకూటాలు, దాసరకూటాలు, శరణుకూటాలు ఏర్పాటు చేశారు. భగవంతుని సన్నిధిలో అందరూ సమానులు గనుక, ఈ రామానుజకూటాలలో కులాన్ని విస్మరించి అందరూ సహపంక్తిలో కూర్చుండి ప్రసాదం స్వీకరించవచ్చు.

ఈ రామానుజకూట, దాసరకూటాలతో మెలగడం వల్ల కింది కులాల వారు చాలా మంది మహాజ్ఞానులు, మహాభక్తులు అయ్యారు. దీనికి ఉదాహరణం కనకదాసు. ఇతడు విజయనగర సార్వభౌముడయిన కృష్ణదేవరాయలకు అత్యాప్తులయిన ద్వైతసన్యాసి వ్యాసరాయరవారి శిష్యుడు. గొర్రెలు, మేకలు కాచే కురబకులం వాడన్నారు కొందరు, అంతకన్నా తక్కువ వాడన్నారు మరికొందరు. ఇతడు మహాజ్ఞాని, పురందరదాసంతటి వాగ్గేయకారుడు.

ఒకమారు వ్యాసరాయరవారి గోష్ఠిలో ఎవరు మోక్షానికి పోతాడు? అనే ప్రశ్నపై పండితులు చర్చలు జరిపారు. కర్మఠులు త్వరగా మోక్షం పొందుతారని, జ్ఞానులు పోతారని, మహాభక్తులు పోతారని పలువురు పలు విధాలుగా సమాధానం చెప్పారు. చివరకు వ్యాసరాయుడు కనకదాసును అడిగారు, ఎవరు మోక్షానికి వెళ్ళుతారు అని. కనకదాసు వినయంగా "నేను పోతే పోతాను" – అని సమాధానమిచ్చాడట. అప్పుడు పండితులందరు ఈ సమాధానం విని "ఎంత పొగరు వీడికి? నేను పోతానంటున్నాడు, ఇలాంటి వాడిని వ్యాసరాయరు ప్రోత్సహించడం ఏమి బాగుంది?" – అని గుసగుసలు పోయారట. వారి మనోభావాలను పసిగట్టిన వ్యాసరాయరు "చూచారా, కనకదాసు ఎంత సులభంగా సంసార విచ్ఛేద రహస్యాన్ని తెలిపాడో? నేను అంటే అహంకారం. అహంకారం పోతే మోక్షార్హుడవుతాడు జీవుడు. సోహం అనేది పోయి, దాసోహం మిగలాలి", అని వివరించారట. భక్తి ప్రధానమయిన మతాలలో కులాల భేదాలను నిర్మూలించడానికి ప్రయత్నం జరిగింది అనడాన్ని ఇంతగా వివరించారు.

రామానుజమతంలో అన్ని వర్ణాల వారూ చేరారు. భగవత్సన్నిధానంలో రామానుజకూటాలలో ప్రసాద స్వీకరణ వంటివి భేదభావం లేకుండా జరుగుతూనే ఉన్నాయి. కాని, కొందరికి భేదభావం పోలేదు. బ్రాహ్మణ వైష్ణవులు, అబ్రాహ్మణ వైష్ణవులు అనే భేదం చూపడం ప్రారంభించారు. ఇది తమిళదేశంలో ప్రారంభమయింది. బ్రాహ్మణులనడానికి బాహ్యచిహ్నం, యజ్ఞోపవీత సూత్రానుమేయబ్రాహ్మణ భావం – యజ్ఞోపవీత మాత్రం చేతనే (తక్కిన గుణగణాలతో కాక) తెలుసుకోదగిన బ్రాహ్మణభావం గలవాడు, అని దండి దశకుమార చరిత్రలో చెప్పినట్టు జందెమే గనుక, జందెం వేసుకున్న వైష్ణవులు, జందెం వేసుకోని వైష్ణవులు అనే రెండు వర్గాలు ఏర్పడ్డాయి.

తమిళంలో చాత్తు అనే ధాతువుకు వేయు, కప్పు, ధరించు, ధరింపజేయు అనే అర్థాలున్నాయి. చాత్తిన = వేసిన, చాత్తిన + అవర్= వేసుకున్నవారు, ధరించినవారు. యజ్ఞోపవీతాన్ని ధరించినవారు అనే పదానికి సంగ్రహరూపం చాత్తినవర్.

ఈ చాత్తినవర్ అనే పదం తక్కిన వైష్ణవపరిభాషతో పాటు తెలుగులోకి దిగింది. చాత్తినవారు, చాతినవారు అనే రూపాలు ఏర్పడ్డాయి. కాని, ఈ రూపాలు వ్యవహారచ్యుతమయ్యాయి. ఎందుకంటే, అదివరకే ఆ కులానికి కొన్ని పేర్లు ఉన్నాయి గనుక చాత్తిన – చాతిన – సాతిన అనే పదాలు అంతగా రూఢం కాలేదు. సూర్యరాయ నిఘంటువు సాతిన = జందెం వేసుకొనిన వైష్ణవుడు అనే అర్థం చెప్పి, చాత్తినవర్ అనే తమిళరూపమూ చూపింది. కమ్మరి వడ్రంగి కాసె కంచెర యగుసాలె పడసాలె సాతిన సాతని కటిక భట్టు జెట్టి జాండ్ర తొగటి గాండ్లవారును (హంసవిశంతి 3.29) అనే వాక్యం ఉదాహరించాడు.

ఈ నిఘంటువు (సూర్యరాయ నిఘంటువు) సాతని, సాతాని అనే రెండు పదాలనూ గ్రహించింది. సాతని = వి (తమిచత్తాదవన్) జందెము లేని వైష్ణవుడు అనే అర్థం చెప్పి, హంసవింశతిలోని పై ఉదాహరణ ఇచ్చింది. సాతాని అనే పదానికి సాతని అనే పర్యాయమిచ్చి, శూద్రజాతి విశేషము అని అర్థం చెప్పి, వీథినాటకం నుంచి, ప్రబంధ రాజవేంకటేశ్వర విలాసం నుంచి ఉదాహరణలు ఇచ్చింది.

కన్నడంలోను సాతాని పదం ఉంది. కిట్టెల్ సాతాని అనే పదానికి చాతాళదవ అని అర్థం చెప్పాడు. చాతాణి అనే పదమూ గ్రహించి చాతాళదవ అనే అర్థమిచ్చాడు. ఈ విధంగా సాతాని, చాతాణి, చాతాళదవ అనే మూడు రూపాలు ఏర్పడ్డాయి. A man of a caste of Sudras who worship Vishnu exclusively అని అర్థం చెప్పాడు. సాతాని అనే పదం తెలుగునుంచే కన్నడంలోకి పోయి ఉంటుంది.

ఇంతయునా సాతాని అనే పదానికి వ్యుత్పత్తి చెప్పలేదు గదా! చాత్తిన–చాతిన–సాతిన అనే రూపాలు వేసుకున్న – జందెం వేసుకున్న అనే అర్థంతో మొదట ఏర్పడ్డాయి. దానికి వ్యతిరేకం – చాత్తినకు వ్యతిరేకం చాత్తాద. తెలుగులో తమిళ చాత్తిన అలాగే దిగి సాతిన అయినట్టే, చాతాద సాతని అయింది – వేయని, వేసుకోని వాడు. జందెం వేసుకోనివాడు. సాతినకు వ్యతిరేకం సాతని. ఇది వ్యవహారంలో సాతాని అయింది దీర్ఘమధ్యంగా.

సూర్యరాయ నిఘంటువు సాతానికి పర్యాయమయిన చాతాని అనే పదాన్ని కూడ గ్రహించింది. చాతు అనే క్రియ తెలుగులోను ఉంది. ఇది తమిళ చాతు నుంచి వచ్చి ఉంటుంది. శైవ వైష్ణవ సంబంధంతో, చాతుని సూర్యరాయ నిఘంటువు గ్రహించి ధరించు, ధరింపజేయు, సమర్పించు అనే అర్థాలిచ్చి, బసవపురాణం నుంచి, పరమయోగి విలాసం నుంచి ఉదాహరణలిచ్చింది. 'ఒప్పు దివ్యాంబర యుగ్మంబు సాతి' (బసవపురాణం). సాతి అంటే సమర్పించి అని అర్థం. 'చాతిన వింత వాసన తట్టు పునుగు' (పరమయోగి). చాతిన సమర్పించిన. ఇవి తమిళ సంప్రదాయంతో చేరినవే. చాత్తాద అనే తమిళ పదాన్ని సంస్కృతమనే భ్రాంతితో 'ఛాత్తాది' అని మహాప్రాణంతో పలుకడం, వ్రాయడమూ ఉంది. ఈ సాతని, సాతాని పదాలు, మన సంఘసంస్కర్తలు సంఘాన్ని చక్కబరచడానికి ఎంత ప్రయత్నించినా తద్విరుద్ధ శక్తులు అంత బలంగాను అడ్డు తగులుతాయనడానికి నిదర్శనాలు. బసవేశ్వరుడు శివభక్తితో సంఘంలోని తారతమ్యాలను పోగొట్టడానికి ప్రయత్నించాడు పెద్ద ఉద్యమంతో. కాని, ఆయనను అనుసరించిన వారు ఒక వర్గమై, ఒక కులమై పోయారు. వైష్ణవమతానుయాయులు సాతానులనే ఒక కులమయ్యారు. ఉత్తర భారతంలో కబీర్ వంటి మహనీయుడు చేసిన ప్రయత్నం కబీర్‌పంథీ అనే తెగగా మిగిలిపోయింది. నానక్ చేసిన ప్రయత్నం శిఖ్ఖులనే ఒక తెగగా మార్చింది. వారిప్పుడు మేమొక వేరే తెగ, ఖలిస్తాన్ కావాలంటున్నారు. సంస్కర్తలు చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయని నిరాశ పొందనక్కరలేదు. క్రమంగా మార్పు వస్తూనే ఉంది. ఉప్పెనగా వచ్చిపడే దాని కంటే క్రమంగా వచ్చేదే స్థిరంగా ఉంటుంది.

*****

# కన్యత్వపరీక్ష కాదు కన్యాత్వపరీక్ష

"కన్యత్వం అంటే ఏమిటిసార్? ఈ మధ్య పత్రికల్లో ఈ పదం తెగ కనిపిస్తోంది" అని అడిగాడు నన్నొక జిజ్ఞాసువు.

దాని అర్థమేమిటో తెలియడానికి కన్యత్వమనే పదమే లేదు గదా! అర్థమెట్లా తెలుస్తుంది? ఈ సంగతే ఆయనతో అన్నాను.

ఆయన కళ్ళు ఇంత చేస్తూ "మరీ విడ్డూరమండీ మీరు! వారం పది రోజులుగా ఈ పదం పత్రికల్లో ప్రజల నోళ్ళలో నలుగుతోంది. మీరు రోజూ కొన్ని పత్రికలు చూస్తుంటారని నాకు తెలుసు. మరి కన్యత్వం అనే మాట తెలీదంటే ఎలా?" అని ఆయన నన్ను నిగ్గదీశాడు.

"బాబూ, నాకు నిజంగా కన్యత్వం అంటే ఏమిటో తెలీదు. పత్రికల్లో ఈ పదం చూస్తున్నాను. కన్యత్వపరీక్ష అనే శీర్షికలూ చదువుతున్నాను. ఏమిట్రా ఈ కన్యత్వపరీక్ష అని వార్తను చదివాను మొదటిసారిగా. వర్జినిటీ టెస్ట్ అనే ఆంగ్లపదానికి ఇది అనువాదమని గ్రహించాను. ఎవరో మహానుభావుడు కన్యత్వపరీక్ష అని దీనికో అనువాదం సృష్టించి ఉంటాడు. పదం బాగానే ఉంది. దీన్ని స్వీకరించి ప్రయోగించేవారో, ముద్రాపకులో కన్యాః శబ్దంలోని దీర్ఘాన్ని హ్రస్వం చేసి ఉంటారు" అని అన్నాను.

"మీది మరీ ఇదండీ! ప్రతి విషయానికీ మాటలు వాడే పత్రికారచయితలను, ముద్రించే వారినీ ఆడిపోసుకుంటుంటారు చాలా మంది. ఈ జాడ్యం మీకూ సోకింది" అన్నాడు అతడు విడ్డూరంగా – నేనేదో కసితో పత్రికల వాళ్ళను అంటున్నట్టు.

"అయ్యా! నేనూ అరవయ్యేళ్ళుగా పత్రికారచయితను. పత్రికలు – అవి ఏవయినా వార్తలు, వాఙ్మయమూ ప్రజలకు అందివ్వడం మాత్రమే కాక భాషను, సాధుప్రయోగాలను, శైలినీ కూడా అందించి ముందుకు నడపాల్సిందే. భావమనేదాన్ని ప్రకటించడానికి భాష ముఖ్య సాధనం. మన నిత్యకృత్యాలకు మాటలు కొన్ని నేర్చుకుంటే చాలు. అంతకన్నా పై మెట్టు వారికి మరి కొంత పదజాలం అవసరం. రచయితలకు, కవులకు, వివిధవిషయాలను బోధించే వారికి పదాలు, నుడికారం చాలా కావాలి. ఉన్న పదాలు మొదట వాడుకోవడం నేర్వాలి. ఇప్పుడు మన పరిధి విస్తీర్ణమవుతున్నది గనుక ఆవిష్కరణలు అసంఖ్యాకంగా జరిగి జ్ఞానం అపారంగా పెరుగుతున్నది. కనుక కొత్త పదాల సృష్టి భాషామర్యాదకు నిర్బాధకంగా జరగక తప్పదు. కానీ సామాన్యపదాలను పాడుచేయడం తప్పు కదా! కన్యత్వం కూడా అలాంటి పదమే. ఈ అర్థంలో భాషలో ఆ పదం నాకు కనిపించలేదు ఎక్కడా. కనుక నిజంగా తెలియనట్టే కదా! మరొక విషయం – సంస్కృత భాషలో దారాః అనే పదం ఉంది. ఇది నిత్య పుంలింగ బహువచనం. స్త్రీ వాచకమయిన దారాః అనే పదం పుంలింగంలో ఉండడం విచిత్రం కదా! అలాగే కన్య అనే శబ్దం పుంలింగంలోనో, నపుంసకలింగంలోనో ఉందేమోనని ఈ అర్థంలో నిఘంటువులన్నీ తెగ వెదికాను. కనిపించలేదు. దార శబ్దం పుంలింగమై మగ వేషం వేసుకున్నప్పుడు, 'కన్యా' శబ్దం పుంలింగమై, మగవేషమో, నపుంసకలింగమై మన రాజధాని సంస్కృతిని

తెలిపే కొజ్జా వేషమో వేసుకుందేమోనని జిజ్ఞాసతో వెదికాను సుమండీ, మరేంలేదు" అన్నాను.

"అదేమిటి గురువుగారూ! కన్యత్వంలో కొజ్జా లెందుకు వచ్చారు?" అని ప్రశ్నించాడు కనుబొమలు ఎగరవేస్తూ.

"కొజ్జాలు రాలేదు. భయపడకండి. ప్రతి భాషలోను కొన్ని విచిత్రాలుంటాయి. స్త్రీకి పుంలింగ పర్యాయపదాలు, నపుంసకలింగ పర్యాయాలు. సంస్కృతంలో భాషావాచకమైన దార శబ్దం పుంలింగం. కళత్ర శబ్దం నపుంసక లింగం. ఈ దార శబ్దాన్నే యథాతథంగా తీసుకున్నారు తమిళులు. మొదల్‌దారన్ (మొదటిపెళ్ళాం), రెండోదారన్ (రెండో పెళ్ళాం) అంటారు. కోట్టాన్ అంటే తమిళంలో గుడ్లగూబ. దీనికి తెలుగు కోటడు. వల్లభరాయడు క్రీడాభిరామంలో ప్రయోగించాడు. పెంటి గుడ్లగూబ ఏమవుతుందో!..."

ఆయన మధ్యలోనే అడ్డుకుని, "మనం ఎక్కడికో పోతున్నాం. కన్యత్వం తప్పేమిటో చెబుదురూ!" అన్నాడు విసుక్కుంటూ.

"వినండి– పెద్దలు చెప్పిన దానిని ఏకరువుపెడుతున్నాను" అన్నాను.

కన్యా శబ్దం పుట్టుపూర్వాలకు పోతే చాలా విషయాలు తెలుస్తాయి. ఇది కన్ అనే ధాతువు నుంచి ఏర్పడింది. దీనికి ప్రకాశించేదీ అని అర్థం. కక్–కన్ పదాలకు చిన్న అనే అర్థమూ ఉంది. కనుక చిన్నవాడు, చిన్నది, చిన్న పిల్ల అనే అర్థాలు దీనికి కలిగాయి. కన = చిన్న, యువ, అందమైన, కనయ = చిన్నదిగా చేయు, కనా = కన్యక, చిన్న పిల్ల. కనిష్ఠ–కనిష్ఠక–కానిష్ఠక = చిన్నవాడు, యువకులు. కనీ = కన్యక. కనీన = యువ, కంటిపాప. కనీనక = పిల్లవాడు, యువకుడు, కంటిపాప. కనీనికా = కొన్ని సాయి ఋక్కుల పేరు, కంటిపాప. కనీయస్ = చిన్నవాడు, తక్కువ, వీటన్నింటిలోనూ చిన్న అర్థం తెలిపే కన్ అనే పదం ఉండడం చిత్తగించారు కదా!

కన్య అనే పదం మూడు లింగాలలోనూ ఉంది. కాని అర్థభేదం కలుగుతుంది లింగాన్నిబట్టి. కన్య (పుంలింగ నపుంసకలింగాలలో) = చిన్నవాడు, చిన్నది, జెంద్ అవెస్థా భాషలో – దీనికి సమానవాచకం కైనిన్. దీని అర్థం – అనావిద్ధం, పవిత్రం, అనాహతం. హీబ్రూ భాషలో – క ఇన్. అర్థాలు అవే.

కన్యక-అన్ని లింగాలలోనూ ఉంది. పుంలింగ, నపుంసక లింగాలలో చిన్నవాడు, చిన్నది. స్త్రీలింగమయినప్పుడు పెళ్ళికాని పడుచు, కుమార్తె, కన్యారాశి, దుర్గాదేవి.

కన్యా శబ్దం ఈ విధంగా అకారాంత స్త్రీ లింగ శబ్దమయితే చిన్నవాడు, చిన్నది. స్త్రీ లింగ శబ్దమయినప్పుడు పెళ్ళికాని పడుచు, కుమార్తె, కన్యారాశి, దుర్గాదేవి.

కన్యా శబ్దం ఈ విధంగా ఆకారాంత స్త్రీలింగమయితే అక్షతయోని, పిల్ల, కూతురు అని అర్థాలే కాక మరికొన్ని ఉన్నాయి. పెళ్ళికాని పిల్ల, పిన్న గోరింట, పెద్దపలికి, కలబంద, నేలతాటిగడ్డ, ఒక వృత్తం, పంచ కన్యలు- అహల్య, ద్రౌపది, తార, కుంతి, మండోదరి. పొల్లు స్త్రీ సాధారణ వాచకం. ఇవన్నీ కన్యా శబ్దం ఆకారాంత స్త్రీ లింగమయినప్పుడు మాత్రమే.

కన్యా శబ్దం ఆకారాంత స్త్రీలింగం కనుక దీనికి ప్రత్యామ్నాయాలు చేరినప్పుడూ, అది సమాసఘటితమయినప్పుడు దీర్ఘం లుప్తం కాదు. కన్యా + కాల = కన్యాత్వం ఉన్న సమయం. కన్యా + కుబ్జ = "ఒక పట్టణం. పశ్చిమ భారతంలో ఉంది. ఇప్పుడు దీని వ్యవహారం కనౌజ్. కనౌజ్ బ్రాహ్మణులు చాలా ఆచారవంతులు. ఈ ఆచారాన్ని వెక్కిరిస్తూ హిందీలో ఎన్నో సామెతలున్నాయి. వాటిలో ఒకటి దో కనౌజ్, తీన్ చూల్హే. ఇద్దరు కనౌజీలు, మూడు పొయ్యిలు. కన్యా + కుమారి = భారతదేశపు దక్షిణాగ్రం. కన్యా + కూపం = ఒక తీర్థం. కన్యా + గత = కన్యకు చెందవలసిన ఆస్తి. కన్యా + గర్భ = కన్యకు (పెళ్ళి కాకుండా) వచ్చిన కడుపు. కన్యా + గ్రహణ = కన్యను పెళ్ళాడడం. కన్యా + జ-కన్యా+జాత =కన్యకు పుట్టిన సంతానం. కన్యా + తీర్థం = తీర్థ + దక్షిణ భారతంలోని ఒక తీర్థం. కన్యా - త్వ +అక్షతయోనిత్వం, కన్నెతనం.

కన్యా +దాన = కన్యా వివాహం చేయడం, కన్యా + దాతృ = కన్నెను ఇచ్చి పెళ్ళి చేసేవాడు. కన్యా + దూషక = కన్యను చెరిచేవాడు. కన్యా + దూషణ = కన్యను చెరచడం. కన్యా + దూషయిత్వా శ్రీకన్నెను చెరిచేవాడు. కన్యా + దోష = కన్యకు గల లోపం. వివాహాలలో చూసే కన్యా దోషం. కన్యా + ధాన = కన్నె ఆస్తి, అరణం-కన్య వివాహం కాకుండా మరణిస్తే ఆమె ఆస్తి వాటా సోదరునికి చెందుతుంది. కన్యా+పతి = కుమార్తె భర్త. కన్యా + పాల = కన్యను రక్షించే తండ్రి. కన్యా + పురం = కన్నెలు నివసించే భవనం. కన్యా + భావ =కన్యాత్వం. కన్యా+ భైక్ష = కన్యనిమ్మని ప్రార్థించడం. కన్యా + రామ = బుద్ధుని పేర్లలో ఒకటి. కన్యా + రాశి = నభో మండపంలోని ఒక రాశి. కన్య + అర్థికా = కన్యకోసం వేడడం, కన్నెను ఆశించడం. కన్యావేది = అల్లుడు. కన్యా + ప్రతస్థా = రజస్వల. కన్యా + శుల్క = కన్యకిచ్చే అరణం. కన్యా + ఆశ్రమ =

ఆశ్రమం పేరు. కన్యా + వేద్య-కన్యా + హ్రద = ఒక తీర్థం పేర్లు. కన్యా + స్వయంవర + కన్యను స్వయంవరానికి ఉంచడం. కన్యా + హరణ = కన్యను ఎత్తుకునిపోవడం. మన పురాణ, చరిత్ర పురుషులు చాలా మంది చేసిన పని.

కన్యా శబ్దంపై ఇలాంటి సమానపదాలు సాంఘికాచారాలు తెలిపేవి చాలా ఉన్నాయి. ఇన్ని సమాసాలు తెలుపడంలో ఉద్దేశం, సమాసంలో కన్యా శబ్దంలోని వకారం మీద దీర్ఘం మార్చడానికే. కనుక కన్యా + త్వం = కన్యాత్వం అనే రూపంలో ఉంటుంది కానీ కన్యత్వంకాదు. అందువల్ల కన్యాత్వ పరీక్ష (కన్యా + త్వ + పరీక్ష) అని ప్రయోగించారే కానీ కన్యత్వపరీక్ష అని కాదు. దయచేసి గమనించండి. కన్యత్వపరీక్ష అంటే చిన్న వస్తువు పరీక్ష అవుతుంది.

నేటి కథకులు, పత్రికారచయితలూ ఈ కాలంలో వాడవలసిన పాత మాట ఒకటి తెలుపుతాను. అది కన్యాట అనే పదం కన్యా + ఆట = కన్యల వెంట = ఆడ పిల్లల వెంటబడి తిరిగేవాడు, కన్యాటుడు. ఆడ పిల్లలు కాలేజీ వదలగానే వారి వెంటబడి వాళ్ళను ఇంటి వరకూ సాగనంపి ఊసూరుమంటూ ఇల్లు చేరుకునేవారు. ఈ కన్యాటులను వాడుకోండి.

కన్యాత్వ పదానికి తెలుగులో కన్నెరికం అనేది సరైన పర్యాయం. కాని దానికి అపార్థం దురదృష్టవశాత్తూ ఏర్పడింది గనుక, దానిని వాడరు.

*****

# ఇలువేల్పు - ఇలవేల్పు

ఇటీవల ఒక పుస్తకావిష్కరణ సభకు వెళ్ళాను. ఒకరు మరొకరిని గురించి పొగుడుతున్నారు. "ఆయన మాకు ఇలవేలుపువంటివారు" అంటున్నారు. సభ ముగిసిన తర్వాత, ఆ వక్త నాకు పరిచితులే గనుక, అడిగాను ఆయనను "ఇలవేలుపు ఏమిటండీ?" అని. "ఏముంది? ఇలవేలుపంటే తెలీదా. ఇంటి దేవత, కులదేవత. దానిలో అర్థంకానిది ఏముంది?" అని ప్రశ్నతో సమాధానం ముగించాడు. "మహానుభావా! పదం అర్థం కాకకాదు. ఇలవేల్పు అనే పదస్వరూపం గురించి అడిగాను" అన్నాను. ఆయన 'పదస్వరూపమా? ఇలవేల్పు = ఇంటిదేవుడు. ఏముంది దీంట్లో?' అన్నాడు.

"ఉన్నదంతా దాంట్లోనేనండీ. ఇల అనే పదానికి ఇల్లు అనే అర్థం ఉందా? అన్నాను. "అదా మీరనేది? ఇలవేలుపు అని అందరూ అంటున్నారు. నేను అన్నాను. మరచానండోయ్. ముప్పై నలభయ్యేళ్ళ క్రితం ఇలవేలుపు అనే సినిమా కూడా వచ్చింది" అన్నాడు.

నేను కొంచెం ఆశ్చర్యం ప్రకటిస్తూ "సినిమా సరే సార్. భాషకు సినిమా ప్రమాణం కాదుగదా!" అన్నాను. "అయితే తప్పేమిటో సెలవియ్యండి" అని ఆయన వ్యంగ్యబాణం సంధించాడు. అప్పుడు నాకు చెప్పకతప్పింది కాదు. ఇలా అన్నాను. ఇల అనేది సంస్కృతపదం. దీనికి భూమి, బుధుని భార్య, ఆవు, మాట అనే అర్థాలున్నాయి. ఇది ఆకారాంత స్త్రీలింగశబ్దం. తెలుగులో తత్సమీకరణ ప్రక్రియ ప్రకారం ఇల అని హ్రస్వమయింది. దీనిపైన సమాసాలు ఏర్పడి ఇల+వేల్పు=కొండ, భూమిని ధరించేది గనుక, ఇల+వేలు=బ్రాహ్మణుడు అనేవి వచ్చాయి. ఇల అంటే లడలకు అ భేదం గనుక ఇడ అనే అర్థమూ వచ్చింది. ఇడ అంటే ఒకనాడి పేరు. ఇది పూర్తిగా సంస్కృతపదం. దీనికి ఇల్లు అనే అర్థం ఎక్కడా లేదు. కనుక ఇల+వేల్పు అంటే కులదేవత, ఇంటిదేవత అనే అర్థాలు ఏ విధంగానూ రావు.

ఇలు–ఇల్లు అనేవి తెలుగుపదాలు. దీనికి నివసించే స్థలం, గృహం అని అర్థం. ఇది ఇర్–ఇల్ అనే ధాతువు నుంచి పుట్టింది. ఇర్–ఇల్ అనే ధాతువులకు నివసించు, ఉండు, మను అని అర్థాలు. ఇల్ నుంచి ఇలు–ఇల్లు అనే పదాలు పుట్టాయి. ఇలు ఇల్లు సమాస ఘటితమయినప్పుడు ఇల్ అవుతుంది మూలస్వరూపంతో.

ఇలు అనే పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువు చాల ప్రయోగాలిచ్చింది. ఇలు వెలువరించి (భారతం, ఆది 6–18), లక్కయిలు గాలినది మొదలక్కట మా తల్లి– (భారతం, ఉద్యోగ 3–136); లక్కయిలు గాలిచి – (భారత ఉద్యోగ 3–366) ఇలు అనే దానికి గృహకృత్యము అనే అర్థమూ ఇచ్చింది ఈ నిఘంటువు.

"…. సఖులై తలిదండ్రులు గూడి దేవియుదేవరవోలె యుండి ఇలుదీర్పగ గాపుర మొప్పవానికిన్... (మనుచరిత్రము 1–52) ఇలా ఎన్నైనా ఉదాహరణలు చూపవచ్చు. ఇలు–ఇల్లు–ఇల్ అనే పదాలకు ఇలు పదం చేరి తర్వాత ఎన్నో పదాలు ఏర్పడ్డాయి. ఇలాంటివాటిలో ఒకటి ఇలువేల్పు అనేది ఇలు+వేలుపు = గృహదేవత, కులదేవత. ఇది ఇల్+వేలుపు = ఇల్వేలుపు అని ఇక్కడ రూపం పొందింది. దీనికి సూర్యారాయాంధ్ర నిఘంటువు మంచి ఉదాహరణ ఇచ్చింది.

ప్రమదవిలాసవర్తన.
విభాసురగోప కిశోరమూర్తితో
దమకిలువేలుపై వెలియు
తాండవకృష్ణ పదాబ్జ సేవ. (కళాపూర్ణోదయం 1-2)

ఇలువేల్పు - (హరివంశం - ఉత్తర 3-4) ఈ ఇలు-ఇల్లు-ఇల్ అనే మాటలతో ఏర్పడిన పదాలు తెలుసుకుంటే ఇల-ఇలు అనే పదాల అర్థం వేరువేరని స్పష్టమవుతుంది.

ఇల్లంట్రం-ఇల్లటం = ఇలటం = ఒక స్త్రీ తన పుట్టింట్లోనే మగనితో చేసే కాపురం లేక అల్లుడు తన అత్తమామల ఇంట్లో భార్యతో చేసే కాపురం. ఇల్-ఇల్లుపైన వచ్చిన పదం ఇది. ఇల్లడం-ఇల్లు+అరం = నివాసస్థలం ఇల్లరి - ఇల్లు + అరి + ఇంటిపన్ను, ఇల్ల + టికం = ఇల్లటం, ఇల్లు + ఆలు = ఇల్లాలు, భార్య, ఇలువరం, ఇలువారం = గుడిసె, ఇలు + విందు = ఇంటికి వచ్చిన అతిథి. ఇల్లు అనే పదానికి ఇంకా చాలా అర్థాలున్నాయి.

ఇల్లు = గృహం, ఉనికి పట్టు, చదరంగం మొదలయిన ఆటలలోని గది, స్థానము, రాశి, గృహకృత్యం, వంశం, కుటుంబం. కనుక మహానుభావా! ఇలవేల్పు = భూమిలో దేవుడు, ఇలువేల్పు = ఇంటిదేవుడు, కులదేవత అని ఇప్పటికైనా స్పష్టమయింది కదా! ఇకమీదనన్నా ఇలువేల్పు అనడానికి ఇలవేల్పు అని వాడకండి. మీబోటి పెద్దవారే ఇలాంటి అపప్రయోగాలు చేస్తే, తక్కినవారి గతి, సంగతి ఏమిటి? అని ఆయనను ప్రార్థించాను.

*****

# ధర్మ, ధర్మి వివేకం అవసరం

ద్రష్ట, దృక్కు, దృశ్యం - చూచేవాడు, చూపు, చూడదగింది - మూడూ చివరకు ఒకటేనంటారు అద్వైత వేదాంతులు. అంటే, చూచేవాడూ, చూచేది, చూపు అంతా పరమాత్మే గనుక ఒకటే. కాని ఉపాధి భేదంతో వ్యవహారం మాత్రం భిన్నం. "కనుకనే బ్రహ్మంగారి శిష్యులు శిష్యుడు గురువాయె, గురువు శిష్యుండాయె" అన్నారు. అంటే శిష్యుడయిన ఆత్మ, గురువయిన పరమాత్మ ఒకటేనన్నారు. అంతా ఒక్కటే అనేది ఉన్నతస్థాయి వేదాంతంలో ఒక్కటి కావచ్చునేమో కాని, వ్యవహారజగత్తులో - భాషాజగత్తులో గుణం వేరు, గుణి వేరు, గుణం కలవాడు గుణి, గుణిలో ఉన్నది గుణం. ఈ గుణాన్ని,

ప్రధానక్రియను, ప్రధానవిషయాన్ని ధర్మం అన్నారు. ఈ ధర్మం కలవాడు, కలది ధర్మి, ధర్మిలో ఉండేది ధర్మం.

ఇప్పటి యువ రచయితలు, పత్రికారచయితలు ధర్మ, ధర్మి వ్యత్యాసం తెలీకుండా, తెలిసినా ఏం కొంప మునిగిందిలే అనే ఉపేక్షతోను, విచ్చలవిడిగా భాషను వాడుతున్నారు. ఏమండీ! ఇది తప్పండీ! గుణాన్ని గుణికి వాడరాదండీ! అని అడిగితే, ఏం కొంప మునిగింది? ఎదుటివాడికి భావం అర్థమయిందిగదా! అన్నారు ఒక సంపాదకులు. ఆ మాటకు వస్తే భాష పూర్తిగా నాశనమయినా కొంపలు మునగవు, అంటుకోవు. మానవుని మనుగడకు అత్యవసరమైనది తిండి. అది ఉంటే చాలు. ఏది ఎక్కడ కొల్లబోయినా పరవాలేదు. కాని, భాష మానవజాతిని యుగయుగాలుగా సంస్కరించి, ఉన్నతికి తెస్తున్నది. దాని సవ్యమైన ప్రయోగం, భావాన్ని సవ్యంగా, సుందరంగా వ్యక్తీకరించి, మానవుణ్ని సంస్కారపథంలో, నాగరికపథంలో మరొక అడుగు ముందుకు తీసుకొని వెళ్లుతుంది. అందుకోసమే ఈ యాతన అంతా. ఎన్ని భాషలు అంతరించలేదు? కొంపలు మునిగాయా? అంటుకున్నాయా? కాని, శబ్దానికి ఉండే శక్తిని గ్రహించి, మానవుల మధ్య సత్సంబంధాలు పెంపొందించడంలో దానికి గల సంఘటనశక్తిని గుర్తించి, భాషకోసం, దాని ప్రయోగప్రావీణ్యం కోసం వెంపరలాడడం సహ స్రాబ్దాలుగా జరుగుతున్నట్లు చరిత్ర చెబుతున్నది. ఈ భాష సవ్యంగా, స్పష్టంగా, సుందర సహజంగా ఉండడానికి తోడ్పడే ప్రధాన, మూలవిషయాలలో ఒక్కటి ధర్మ ధర్మి జ్ఞానం.

ఈ మధ్య ధర్మ ధర్మి విచక్షణరహిత ప్రయోగాలు పత్రికలలో విపరీతంగా కనిపిస్తున్నాయి– దేశవిచ్ఛిన్నం, దృఢవంతురాలు, ఉదారపూరిత, కుత్సితం, దృశ్య శ్రవణ విధానం వంటిది.

ఈ దృఢవంతురాలు ఎవరో, ఎక్కడి నుంచి దిగారో, ఎలా దిగారో కనుక్కుందాం. దృఢ అనే పదం దృంహ్–దృహ్ అనే సంస్కృతధాతువు నుంచి ఏర్పడిన పదం. ఈ ధాతువుకు గట్టిపడేట్టు చేయడం, స్థిరపరచడం, బలపరచడం, శక్తిమంతం చేయడం అనే అర్థాలున్నాయి. దీని నుంచి ఏర్పడిన దృఢ శబ్దానికి స్థిరమైన గట్టి అయిన, కఠినమైన, ముద్దగా ఉన్న, గట్టిగా కట్టబడిన, గట్టి బంధనం, వంచరాని, వంగని, శక్తిమంతమైన, కదలని అనే అర్థాలున్నాయి. ఇది విశేషణం. విశేష్యమయిన మరొకదాని గుణాన్ని సూచిస్తుంది. ఈ దృఢ శబ్దం గుణం దార్ఢ్యం, దృఢస్వభావః – దృఢమైన దాని గుణం – దార్ఢ్యం. దీనికి దృఢత్వం, దృఢత అనేవి పర్యాయాలు. దారుఢ్య తప్పని ఇదివరకే చర్చితం.

ఇది దార్ఢ్య శబ్దానికి గట్టితనం, స్థిరత, శక్తి, గట్టిపరచు అనే అర్థాలున్నాయి. ఇది ధర్మం–గుణం, దృఢ అనే విశేషణ వాచకంలోని గుణాన్ని – ధర్మాన్ని తెలిపే పదం. ఇది విశేషణపదం కాదు. గుణ వాచక, ధర్మవాచకపదం. ఈ వ్యత్యాసం – దృఢ ధర్మివాచకమని, దార్ఢ్యం ధర్మవాచకమని స్పష్టమయినప్పుడు పొరపాటు ప్రయోగానికి ఆస్కారమే లేదు. ఈ రెండు పదాల వ్యత్యాసం తెలియనప్పుడు అపప్రయోగానికి ఆస్కారం ఉంది. అందువల్లనే దృఢవంతురాలు అనే అసాధుప్రయోగం కనిపిస్తుంది.

ధనం కలది. ధనవంతురాలు, గుణం కలది– గుణవంతురాలు, శీలం కలది – శీలవంతురాలు, ఈ మూడు సమస్త పదాలలోని ధన, గుణ, శీల పదాలు గుణవాచకాలు. ఆయా మహిళల గుణాన్ని, స్వభావాన్ని – ధర్మాన్ని తెలిపేవి. కనుక ఆ ధర్మాలు కలది అనే అర్థం వ్యక్తీకరించే బహువ్రీహి సమాస లక్షణమయిన వంతురాలు చేరి, గుణవంతురాలు, ధన + వంతురాలు, శీల + వంతురాలు అనే రూపాలు ఏర్పడ్డాయి.

కాని, దృఢవంతురాలు అనే సమాసం అలాంటిది కాదు. దృఢ శబ్దం ధర్మివాచకం, ధర్మవాచకం కాదు. కనుక ఆ మహిళ దృఢ అని కాని, దార్ఢ్యం కలది, దార్ఢ్యవతి, దార్ఢ్యవంతురాలు అని అనాలి. అప్పుడే సాధువు, దృఢ శబ్దం గుణవాచకం కాదు. గుణం గలదానిని తెలిపేది. కనుక దృఢవంతురాలు అని వాడకండి. కాని, ఆమెకు దృఢమయిన వాళ్లు చాలమందో, ఒకరో ఉంటే దృఢవంతురాలు అని వాడవచ్చు. అప్పుడు అర్థంలోను మార్పు వస్తుంది. ఆమె దృఢ–గట్టి మనిషికాదు. ఆమెకు వత్తాసుగా గట్టివాడో, గట్టివాళ్లో ఉన్నారన్న మాట. ఈ అర్థ వ్యత్యాసం గ్రహించి వాడండి.

ఇలాంటిదే ఉదారపూరిత అనే పదం. ఉదారశబ్దం ఉద్ + అర అనే రెండు పదాలతో ఏర్పడంది. దీనిని పాణిని బహ్వాది గణంలో చేర్చారు. ఉద్ అనే దానికి, అర అనే దానికి ఉన్నతమైన, పైకి ప్రసరించే మున్నగు అర్థాలున్నాయి. ఉదారపదానికి ఉన్నతమైన, గొప్ప, ఉత్తమమైన, కీర్తిమంతమైన, విస్తృతమైన మున్నగు అర్థాలున్నాయి.

ఈ ఉదారశబ్దం ధర్మివాచకం, ఉదారుని గుణం ఉదారత, ఉదారత్వం, ఔదార్యం. ఇవి ధర్మవాచకాలు–గుణవాచకాలు. ఔదార్యం కలవాడు అనే ప్రయోగం తప్పు. ఇది ఔదార్యంతో నిండినవాడు, ఔదార్యం కలవాడు అనే అర్థం ఇవ్వకపోగా, ఉదారులు ఉదారుడు కలవాడు అనే అర్థం ఇస్తుంది. ఉదారపూరిత అని వాడిన రచయిత ఉ ద్దేశమో, వక్త ఉద్దేశమో ఉదారులతో నిండిన, ఉదారులతో పూర్ణమయిన అని చెప్పడమే అయితే తప్పు కాదు. ఉదారత–ఔదార్యం నిండిన అని చెప్పడం ఉద్దేశం అయితే మాత్రం

తప్పు. ఉదార శబ్దం విశేషణమే గనుక ఉదారుడు, ఔదార్యవంతుడు. ఉదారతగలవాడు అని వాడడం సత్ప్రయోగం.

ఇలాంటి మరొక పదం కుత్సితం. "వాడా! ఒళ్లంతా కుత్సితం" అంటాడు ఒక వ్యక్తి, తనకు ఇష్టం లేని మరొకడిని గురించి. "ఒళ్లంతా వాడికి కుత్సితం. హెచ్చరికతో ఉండు" అని ఉపదేశిస్తాడు ఒకడు తన సన్నిహితుడిని. "అంతా బాగుంది గాని కుత్సితం ఎక్కువ వాడికి" అని వ్యాజనింద చేస్తాడు ఇంకొకడు ఈర్ష్యతో.

ఈ కుత్సిత శబ్దం కుత్స్ = నిందించు అనే ధాతువు నుంచి ఏర్పడింది. కుత్సితుడు = నీచుడు, నికృష్టుడు, నిందితుడు, కల్లరీడు, మోసగాడు అనే అర్థాలిస్తుంది. ఇది ధర్మివాచకం. కుత్సితత్వం, కుత్సితత అనేవి కుత్సితుని గుణాలు కనుక కుత్సితత్వం గుణవాచకం, ధర్మవాచకం. గుణం వేరు, గుణం కలవాడు వేరు. గుణం కలవాడు అని చెప్పే చోట గుణమని, గుణమనే చోట గుణం కలవాడని అనడంవల్ల అర్థబోధ సరిగా రాదు గదా! కనుక వాడికి కుత్సితం ఎక్కువ, వాడికి ఒళ్లంతా కుత్సితం అని వాడడం తప్పు.

ధర్మ ధర్మి జ్ఞానం లేకుండా రూపొందిన విచిత్రసమాసందృశ్యశ్రవణ విధానం అనేది. ఇది ఆడియో విజుయల్ అనే ఆంగ్లపదానికి పర్యాయంగా వాడుకలోకి వచ్చింది. నేడు వివిధ జ్ఞానవిస్తరణ సాధనాలతో వివిధ దేశభాషలు సన్నిహితమై భావాలనూ, పదాలనూ ఇచ్చిపుచ్చుకుంటున్నాయి. నూతనాంశాలు మనకు తెలిసినప్పుడు వాటి వ్యక్తీకరణకు నూతనపదాల ఆవిర్భావం తప్పదు. కాని, ఆ ఆవిర్భావం, సహజంగా భాషా సంప్రదాయానుగుణంగా, శ్రవణపేయంగా ఉంటే సర్వజనాంగీకృతమవుతుంది. లేకపోతే, దుష్టసమాస ఘటితమని, చెవికి ఇంపుగా లేదని మాటపడుతుంది. అలాంటి పదాలలోదే ఈ దృశ్యశ్రవణ విధానమనేది.

ఈ దృశ్యశ్రవణ విధానమనే సమాసంలో దృశ్యమనేది ధర్మి వాచకం, శ్రవణమనేది ధర్మవాచకం, దృశ్యం = దర్శించడానికి యోగ్యమయింది; చూడదగింది. ఇది విశేషణం. చూడదగిన తనం అనే గుణం– ధర్మం గలది. కనుక ధర్మి, దీని ధర్మం దర్శనం.

శ్రవణం అంటే వినడం. ఇది గుణం, ధర్మం. చూడదగింది దృశ్యమయినప్పుడు, వినదగింది శ్రవ్యం. ఇది ధర్మివాచకం, వినదగి ఉండడం అనే ధర్మం, గుణం గలది కనుక.

దృశ్యశ్రవణ విధానం అనే సమాసంలో మొదటిది ధర్మివాచకం. రెండవది శ్రవణ అనేది ధర్మవాచకం, కనుక ఏకరూపతగాని, అర్థవ్యక్తిలో సమానతగాని లేదు. కనుక అసాధుప్రయోగం.

చూడదగింది అనడానికి దృశ్య అనే పదం సరిగా వాడిన ఆ మహానుభావునికి శ్రవ్య అనే మాట తోచలేదు, శ్రవణ అనేపదం తగిలించాడు. దృశ్యశ్రవ్య విధానం అంటే ఎంత బాగుండేది! చూడదగిన, వినదగిన అనే అర్థాలు రెండూ సమానమైన అర్థాలలో ప్రయుక్తమై, ఏకరూపత కలిగేది. లేక, శ్రవణ అన్నపదానికి సమానంగా భావార్థకమయిన దర్శన అనే పదాన్ని వాడినా బాగుండేది. దర్శనమంటే చూడడం. అప్పుడు దర్శనశ్రవణ విధానం అనే సమాసం చక్కగా ఏర్పడేది. ఈ విధంగా దృశ్య శ్రవ్య విధానం అనిగాని, దర్శన శ్రవణ విధానం అనిగాని అనడంవల్ల రెండు విధాల–రెండు పదాలు దోషరహితమయినవి ఏర్పడేవి. ఇకమీద ఇలాంటి సందర్భాలలో దృశ్యశ్రవ్యణ విధానం అనిగాని, దర్శన శ్రవణ విధానమనిగాని వాడడం అలవరచుకోండి.

దేశం ముక్కలు కావడం అనే అర్థంలో దేశ విచ్ఛిన్నం అని వాడుతున్నారు తప్పుగా, విచ్ఛిన్న అనేది విశేషణం, ధర్మివాచకం, ధర్మవాచకం కాదు. విచ్ఛిన్నత అని వాడాలి. విచ్ఛిత్తి అని వాడవచ్చును గాని, ప్రాచీనాలంకారికులు విచ్ఛిత్తి పదాన్ని సౌందర్యాతిశయం అని వాడారు. విచ్ఛిత్తిని అలంకరించుకొనడం అని వాడారు కాళిదాసు. విచ్ఛిత్తి శేషైః సుర సందరీణాం అని (శాకుంతలం).

ధర్మ ధర్మి జ్ఞానం చాల అవసరం. దానివల్ల అపశబ్దాలు దొర్లవు. అపార్థాలు కలుగవు. పదార్థజ్ఞానమూ స్పష్టంగా ఏర్పడుతుంది.

*****

# నిగర్వి కాదు నిర్గర్వుడు

ఒక తరం కింద నేను విజయవాడలో ఉన్నప్పుడు వెలిదండ హనుమంతరాయ గ్రంథాలయం రజతోత్సవమో, స్వర్ణోత్సవమో జరిగింది. స్థాపకుల సన్మానపత్రాలు, దాతల సన్మానపత్రాలూ దాదాపు యాభై వ్రాయవలసి వచ్చింది. అందరూ గొప్పవారే. వారిని పొగడ్డానికి మాటలు దొరక్క చచ్చాను. పర్యాయపదాల కోసం కోశాలు తిరగవేయడానికి ఏ స్టేట్, సెంట్రల్ లైబ్రరీకో, ఉస్మానియా విశ్వవిద్యాలయానికో పరుగెత్తవచ్చు

హైదరాబాదులో అయితే. అక్కడ ఆ సౌకర్యం కలుగలేదు.

వారిలో ఒక మహనీయుని నిర్గర్వచూడామణీ!- అని సంబోధించాను. సన్మానపత్రం అచ్చుకాబోతున్నది. అది ఆయన కంటబడింది. తనను గురించి ఏమి వ్రాశానో అనే కుతూహలంతో చదివాడు. నిర్గర్వచూడామణీ అనే సంబోధన అతనికి తప్పునితోచి, అచ్చు ఆపి నా వద్దకు పరుగుతో వచ్చాడు. “ఇదేం పంతులుగారూ! కొంప ముంచేశారు” అన్నాడు సన్మానపత్రం వ్రాతప్రతి చూపుతూ; “ఏముంది? తప్పేమీ కనిపించలేదే నాకు” అన్నాను దానిని తిరగవేస్తూ. “తప్పు లేదంటారేమిటండీ? నిగర్విచూడామణికి మారు నిర్గర్వ అని కొత్త తప్పుమాట పెట్టారు?’ అన్నాడు ముఖం ఎర్రగా చేసుకొని.

ఆయన ధోరణి చూచాను. పాణిని స్వకీయశేషావతారంతో వచ్చినా అతనికి నచ్చజెప్పలేడని నాకు నమ్మకం కలిగింది. “అది తప్పు కాదు, నిగర్వి అనే పదమే తప్పు. మీకు నమ్మకం ఉన్న పండితులకు చూపించుకోండి. నాకు అభ్యంతరం లేదు” అన్నాను. ఆయన ఏమనుకున్నాడో వెళ్లిపోయాడు. “నిగర్వి చూడామణీ” అనే మార్పుతోనే అచ్చయింది.

నేను ఉత్సవ నిర్వాహక సంఘం అధ్యక్షుని వద్దకు వెళ్లి “నేను ఒప్పుగా వ్రాసినవన్నీ తప్పులుగా దిద్దివేస్తున్నారు. నాకు సెలవిప్పించండి. పని చేయలేను” అన్నాను. ఆయన నొచ్చుకొని “పంతులుగారూ! ఆయన, మేమూ వ్యాపారులం. భాష, వ్యాకరణం మాకేమీ వచ్చు చెప్పండి. అతడు ఏదో పదం విని వుంటాడు. అదే సరైందనే బుద్ధి కలిగివుంటుంది. ఆయన మాటలను ఎంతమాత్రమూ పట్టించుకోకండి, మీరు అన్నిటా పెద్దలు” అని దండం పెట్టాడు.

ఇంతకుముందు ఎన్నోసార్లన్నాను, విషమంత త్వరగా వ్యాపించేదీ, తప్పంత త్వరగా విస్తరించేదీ మరొకటి లేదని, మరి, తప్పేమిటని అడుగుతారు గదూ! వినండి.

నిగర్వి అనే పదాన్ని గర్వం లేనివాడు అనే అర్థంలో వాడుతున్నారు. ఇది తత్సమపదం. దీనిలో ని+గర్వి అనే రెండుపదాలున్నాయి. గర్వం కలవాడు గర్వి. ఈ పదానికి ఈ అర్థం ఉన్నా ని+గర్వి అనే పదానికి గర్వం లేనివాడు అనే అర్థంరాదు. ఎందుకంటే ని అనే ఉపసర్గకు లేమిని సూచించే అర్థంలేదు గనుక.

ని అనే పదానికి ఉన్న అర్థాలు శబ్దార్థ కల్పతరులో ఇలా ఉన్నాయి. ని – అవ్యయం. దర్శనే–చూపు; నివేశే– ప్రవేశము; భృశార్థే – మిక్కిలి; ఆదేశే – ఆజ్ఞ; క్షేపే – నింద; నిత్యార్థే – ఎల్లప్పుడు; నిత్యము; సంశయే – సంశయము; కౌశలే – నేర్పు; ఉపరమే – ఉపరతి, భావించుట; సామీప్యే – దగ్గర; ఆశ్రయే – ఆశ్రయము; దానే – ఈవి; మోక్షే – మోక్షము, విడుదల; అంతర్భాగే – ఇమిడియుండుట; బంధనే – కట్టు; రాశే – రాశి; అధోభాగే – క్రిందగుట, వంగు; విన్యాసే – ఉంచుట; నిశ్చయే – నిశ్చయము; నిషేధే – నిషేధించుట.

ఇన్ని అర్థాలున్నా లేదు, వద్దు అనే అర్థాలు లేవు. కనుక ని+గర్వి అనేమాటకు గర్వం లేనివాడు అనే అర్థం రాదు.

నిగర్వి అనేది పొరపాటు; అభావార్థ సూచకమయిన నిర్ అనే ఉపసర్గ చేరడం వల్ల ఏర్పడిన నిర్గర్వి అనే పదమే ప్రాకృతప్రభావం వల్ల నిగర్వి అని మారిందని సరిపెట్టుకుందామా? అప్పుడు నిర్ అనే ఉపసర్గకు తొలగిపోయిన అనే అర్థం ఉంది గనుక, తొలగిన గర్వం కలవాడు, పోయిన గర్వం కలవాడు, గర్వం పోయినవాడు, గర్వం తొలగిన వాడు అని అర్థం వచ్చి, నిర్గర్వి అని అయి – అది మొదటిరేఫం పోయి నిగర్వి అయింది – అని సంతృప్తి పడుదామా అంటే వ్యాకరణరీత్యా పొసగేట్లు కనిపించదు.

నిర్గర్వి అనే సమాసాన్ని విడదీసి నిర్గతః – తొలగని, గర్వః – గర్వం, యస్మాత్ సః – ఎవనినుంచో, వాడు – అని బహుర్వీహి సమాసం చెప్పుకోవలసి ఉంటుంది. బహుర్వీహి సమాసం చెబితే నిర్గర్వ అనే రూపమే ఏర్పడుతుంది గాని నిర్గర్వి అనే రూపం ఏర్పడదు.

ఒకవేళ నిర్గతః తొలగిపోయిన, వదలిపోయిన గర్వః – గర్వం అని మొదట కర్మధారయసమాసం చేసుకుని, దీనిమీద మత్వర్థంలో – కలవాడు అనే అర్థంలో ఇన్ ప్రత్యయం చేర్చుకుంటే నిర్గర్వి అనే రూపం ఏర్పడి అదే తర్వాత నిగర్వి అనే మారింది అని సర్దుకుందామా అంటే, నకర్మాధారయాత్ మత్వర్థీయః – కర్మధారయ సమాసం మీద మత్వర్థ ప్రత్యయం రాదు అనే నియమం పెద్ద అడ్డుగోడగా నిలిచింది. నిర్గతమైన గర్వం – నిర్గర్వం అనేది కర్మధారయం. దీనిమీద కలవాడు అనే అర్థమిచ్చే ఇన్ ప్రత్యయం రాకూడదు గనుక నిర్గర్వి అనే రూపం ఏర్పడదు.

ఈ చర్యవల్ల నిర్గర్వ అనే పదమూ, బహుశా దానివల్ల ఏర్పడి ఉండవచ్చుననే నిగర్వి అనే పదమూ తప్పని స్పష్టమయింది. పండితులనబడే వాళ్లూ దీనిని వాడుతుంటారు. షట్‌శాస్త్రాలూ ఆపోశన పట్టాడు. అయినా నిగర్వి సుమా! ఏ కోశానా గర్వంలేదు - అని, ఆవిడ అష్టైశ్వర్యవంతురాలు. అయినా నిగర్వి. మాటతీరులో గాని, ప్రవర్తనలో గాని గర్వం ఏమీ పిసరంతయినా లేదు - అనీ అంటుంటారు. వాళ్లు వాడినా, ఎవరు వాడినా తప్పే.

వాడవలసిన సరైన మాట నిర్గర్వుడు అని కాని, అగర్వుడు అని కాని, అధర్వి అని కాని, నిగర్వ అని వాడకండి సమా!

ఆ మధ్య ఒక యువకవి రచనలో గర్వం పెడసరం అనే అర్థంలో గీర్వాణం అనే మాట కనిపించింది. ఆశ్చర్యమనేది నాకు ఎన్నడో పోయింది గనుక చింతపడ్డాను. వారికి గీర్వాణం ఎక్కువ, అమ్మో! మహాగీర్వాణం లేండి! ఈ గీర్వాణం నా వద్ద చూపకు - అనో వ్యవహారంలో వినబడుతూంటుంది. ఇది విచిత్రంగా ఏర్పడిందనుకుంటాను.

గీర్వాణ అంటే దేవత, గీః=మాట, బాణ-వాణ=బాణంగా గలది. మాటలే దేవతల ఆయుధాలు. ఈ గీర్వాణ పదం తెలుగులోని గీర అనే పదానికి ధ్వనిసామ్యంతో దగ్గరగా ఉన్నందున ఎవరో తెలివిగలవారు గీరకు వాణం కలిపి గీర్వాణం అని చమత్కరించి ఉంటారు. పదం అందంగా ఉంది గనుక వ్యాపించి ఉంటుంది. గీర్వాణం అంటే గర్వం, తలబిరుసుతనం, పొగరు, పొట్టు అనే అర్థాలు ఏర్పడ్డాయి. ఇంక కొంతకాలానికి నిఘంటువులకు ఎక్కినా ఆశ్చర్యం లేదు. ఆక్స్‌ఫర్డ్ ఆంగ్ల నిఘంటు నిర్మాతలు ఎప్పటికప్పుడు విదేశ భాషల సంబంధంతో ఆంగ్లంలో చేరే పదాలను సమీక్షించి వాటికి ఆమోదముద్ర వేస్తుంటారు. అది పెద్ద వార్తగా వార్తాపత్రికలలో ప్రచురితమవుతూ ఉంటుంది.

మనం ఎంత అడ్డుపెట్టినా, ప్రవాహిని అయిన భాష మారుతూ ఉంటుంది. పూర్తిగా భ్రష్టు పట్టిపోకుండా ఈ ప్రయత్నమంతా. క్రమపరిణామాన్ని ప్రజలు అంగీకరిస్తారే గాని, అదాటుగా, పిడుగుపాటుగా పడేదాన్ని అంగీకరించరు.

*****

# సకుటుంబ సపరివార సమేతంగా...

పుష్యమాసం గడవగానే పెండ్లిండ్ల హడావుడి. వివాహశుభవేళలు కుప్పలు తిప్పలుగా వస్తుంటాయి.

మ.రా.రా. శ్రీ వారికి మాఘశుద్ధ పంచమి గురువారం మేషలగ్న శుభముహూర్తానికి సరైన జనవరి 15వ తేదీ ఉదయం పన్నెండు గంటలకు నా కుమార్తె వివాహం తమరు సకుటుంబ సపరివార సమేతంగా విచ్చేసి వధూవరులను ఆశీర్వదించి అస్మదర్పిత సత్కారాన్ని స్వీకరించి మమ్ములను ఆనందపరచి కృతార్థులను చేయగలరని మనవి. ఇత్యాదిగా సాగుతుంది, శుభలేఖ.

ఇక నూతన గృహప్రవేశాలూ, వడుగులూ మొదలయినవాటి లేఖలు చెప్పనక్కరలేదు. అన్నిటిలోను ఇదే వరుస. సకుటుంబ సపరివార సమేతంగా విచ్చేసి అనే ఈ సకుటుంబ సపరివార సమేతం అనే సమాసాన్ని ఏ మహానుభావుడు ఏ సుముహూర్తాన - కాదు కాదు దుర్ముహూర్తాన సృష్టించాడో, నా చిన్ననాటి నుంచి చూస్తున్నాను. నాకిప్పుడు ఎనభయి నాలుగు సంవత్సరాల వయస్సు. ఈ సమాసం నా కన్నా ముందే ఉంది గనుక, నూరేళ్ళూ, అంతకు పై బడిన కాలం నుంచి ఉండి ఉంటుంది.

ఈ సమాసం తప్పు అని శుభలేఖ రాసే వారికీ, అచ్చుగుద్దే వారికీ, ప్రూఫులు దిద్దేవారికీ తెలీదంటారా? తెలిసే ఉంటుంది. మరితప్పు ఎందుకు? అదేవింత. ఆనవాయితీగా వస్తున్న తప్పును దిద్దుకోడానికి కొంత మనోబలం కావాలి. అందరూ ఇలాగే రాస్తున్నారు. మనం ఎందుకు మార్చాలి? మార్చితే ఏం అశుభమో? అనే భావంతో గొర్రెదాటుగా పోతూంటారు.

ఇంతమంది శుభకార్యంలో వాడుతున్న మాటలో తప్పేమిటని అంటారుగదూ, వినండి.

సకుటుంబ సపరివార సమేత - అనే సమస్త పదంలో స+కుటుంబ+స+పరివార+సమేత అనే ఐదు పదాలున్నాయి. స+కుటుంబ అంటే కుటుంబంతో చేరిన అని అర్థం. అట్లే స+పరివార = పరివారంతో చేరిన అని అర్థం. సమేత అన్నా చేరిన, కూడిన అని అర్థం. ఈ వాక్యార్థం ఉన్నదున్నట్లు చెబితే కుటుంబంతోపాటు పరివారంతో పాటు, వీళ్ళందరితోపాటు అని అర్థమవుతుంది.

మనం ఇంగ్లీషులో ఇలాంటి ఆహ్వానం పంపుతామనుకోండి. ఏమని రాస్తాము? విత్ ఫ్యామిలీ అండ్ ఫ్రెండ్స్ అని రాస్తాము. విత్ ఫ్యామిలీ, విత్ ఫ్రెండ్స్, విత్ ఆల్ దీజ్ అని వ్రాయం. అక్కడ కనిపించిన వ్యాకరణ జ్ఞానం ఇక్కడ ఏమయింది? అది నిన్న మొన్నటి వరకు అధికార భాష – రాజభాష. దానిలో తప్పులు దొర్లితే అవమానం, ప్రమాదం. మాతృభాష నిన్న మొన్నటి వరకు స్వతంత్ర భాష. ఇప్పుడు అధికార భాష అయినా ఒరిగిందేమీ లేదు. తప్పులు పోలేదు, ఒప్పులు రాలేదు.

ఇప్పటికయినా, తప్పును తెలుసుకున్నాం గనుక ఇప్పటికయినా మేల్కొని ఒప్పే వ్రాద్దాం. సకుటుంబ సపరివార సమేతంగా అనే సమాసంలో మొదటి స చాలునని పరివార అనే పదంవెనుక ఉండే స చివర ఉన్న సమేత అనే ఆ పదం అవసరం లేదని తెలుసుకున్నాం.

సంస్కృత సమాసంలోని వైచిత్రి ఏమిటంటే సంక్షిప్తమయిన అర్థవ్యక్తి. స+కుటుంబ + పరివార అంటే చాలు. కుటుంబ పరివారంతోపాటు అని అర్థం. చివరి సమేత అనే పదమూ అవసరం లేదు. సమేత అనే పద బంధంలో సమ + ఇత అనే రెండు పదాలున్నాయి. కూడిన, చేరిన, కూడ, చేరి అని దీని అర్థం. అప్పుడు, సకుటుంబ సపరివార అనే దానిలోని రెండు సకారాలూ అవసరం లేదు. కుటుంబ పరివార సమేతంగా అని వ్రాస్తేచాలు. కుటుంబ పరివారంతోపాటు అని దీని అర్థం.

ఈ సమాసంలోని తప్పులేమిటో తెలిశాయి గనుక, మిత్రులారా, సకుటుంబ పరివారంగా అనిగాని, కుటుంబ పరివార సమేతంగా అనిగాని వ్రాయండి.

ఈ సందర్భంలో నాకు డాక్టర్ గిడుగు సీతాపతిగారితో జరిగిన చర్చ గుర్తుకు వస్తుంది. "ఇలాంటి విషయాలలో తెలుగు వాడి మనస్తత్వం మీకు తెలీదు. కొన్నిటికి అలవాటు పడ్డ మనస్సు త్వరగా మారడం కష్టం" అన్నారు నాతో. ఉదాహరణకు ఆయన కొన్ని భావార్థకాలు ఉదాహరించారు. "ఇదిగో చూడండీ. ఏక శబ్దానికి ఏకత్వం, ఏకత, ఐక్యం అనేవి భావార్థకాలు. ఈ పదాలకు ముందు సమ అనే శబ్దం చేరినప్పుడు సమ+ఏకత్వం = సమైక్యత్వం, సమ + ఏకతా = సమైకత, సమ + ఐక్యం = సమైక్యం కానీ తెలుగు వాడికి తకారం చివర ఉండేవి భావార్థకాలనే భావం మనస్సులో బాగా నాటింది. దుష్టత, ధూర్తత, సజ్జనత, దుర్జనత, ఆర్ద్రతలాగ. అందువల్ల తకారం ఉంటేనే గాని భావార్థకం అని అనుకోడు. అందువల్లనే సమైక్యత, దైన్యత, కారుణ్యత, కార్పణ్యత

అనే పదాలు  ఏర్పడ్డాయి. ఇవి వ్యాకరణం ప్రకారం తప్పే. కాని తెలుగు వాడి మనస్తత్వాన్ని మీరు పరిగణించాలి. అందువల్ల ఈ తప్పులను అంతగా పట్టించుకోరాదు" అని అంటూ వెంటనే "సకుటుంబ సపరివారం సమేతం కూడా ఇలాంటి మనస్తత్వంతో రూపొందిందే. తెలుగువాడికి చివర సమేత అనే పదం చేరిస్తే గాని, కూడ, కలిసి అనే అర్థం పూర్తిగా వచ్చినట్టు తృప్తి కలుగదు. అందువల్ల సకుటుంబ సపరివార సమేతం అనే అంటారు" అన్నారు.

సాదృశ్యం వల్ల కొత్తపదాలు ఏర్పడినట్టు మనస్తత్వం వల్ల కొత్త పదాలు పుట్టుకువస్తాయనడం భాషా పరిణామసహజమే. కాని స్పష్టంగా తప్పని తెలిసినప్పుడు, సరిదిద్దుకోడానికి అవకాశం ఉన్నప్పుడు, దానికి ప్రయత్నించడం వివేకం.

మనం సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః అని అంటున్నాము. ససీత సలక్ష్మణ, సభరత, సశత్రుఘ్న సహనుమత్సమేత అని ప్రతి దానికీ వెనుక సకారం చేర్చం గదా! అలాగే ఇక మీద కుటుంబ పరివార బంధుమిత్ర సమేతంగా అనే వ్రాద్దాము. సమేత అని చివర చేరితేగాని తృప్తి ఉండదన్నారు గదా సీతాపతి గారు!

*****

## చరిత్ర కారులు ఎవరు?

చరిత్ర అనే పదానికి ఇప్పుడు మనం హిస్టరీ అనే ఆంగ్ల పదంతో వ్యవహరిస్తున్న అర్థం పూర్వం ఉన్నట్టు కనిపించదు.

చరితం రఘునాథస్య<br>
శతకోటి ప్రవిస్తరమ్<br>
ఏకైక మక్షరం ప్రోక్తం<br>
మహాపాతక నాశనమ్

అనే శ్లోకాలలోగాని, హర్షచరితం వంటి కావ్య నామధేయాలోగాని ఉన్న చరితం

అనే పదానికి మొదట్లో నడవడి, చర్య అనే అర్థాలేగాని, ఇతిహాసం, కథ అనే అర్థాలు కానరావు.

చరిత... చరిత్ర పదానికి మోనియర్ విల్లియమ్స్ వెళ్ళిన, పొందిన, గతించిన, నడవడి, అభ్యాసం, అలవాటు, అనుష్ఠానం, కృత్యం, సాహసకృత్యం మొదలయిన అర్థాలిచ్చాడు. చరిత్ర అనే పదానికి కూడా దాదాపు అవే అర్థాలు ఇచ్చాడు. ఇతిహాస అనే పదానికి కథలు, సంప్రదాయం, హిస్టరీ, గడిచిన వృత్తాంతాల కథనం అనే అర్థాలిచ్చాడు. 'చరిత్ర కారుడు' అనే పదమే లేదు. ఐతిహాసిక అనే పదానికి సాంప్రదాయికమైన పరంపరాగతమైన ప్రాచీనకథలకు సంబంధించిన, హిస్టారికల్, హిస్టోరియన్. ఐతిహాసికుడు అనే అర్థాలిచ్చాడు.

గొప్ప వ్యక్తుల నడవడి, కృత్యాలు, పద్ధతులు, అనుష్ఠానమూ క్రమంగా సంఘం కథ, దేశం కథ అవుతాయి. గనుక శ్రీ మామిడి వెంకయ్య వంటి ఇటీవల సంస్కృత నిఘంటుకారులు, చరిత్ర... చరిత పదానికి ఇతిహాసం అనే అర్థమూ ఇచ్చారు.

కన్నడ నిఘంటుకారులు చరిత్ర అనే పదానికి హిస్టరీ అనే అర్థమిచ్చి, చరిత్రగా అనేదికూడా గ్రహించి, హిస్టోరియన్ అనే అర్థమిచ్చారు.

ఏమైనా చరిత... చరిత్ర పదానికి హిస్టరీ అనే అర్థం ఇటీవలిదే. కాలం మార్పుతో పాటు కొన్ని పదాలకు అర్థచ్ఛాయలు ఏర్పడడం, నూతనార్థాలు రావడం భాషాలక్షణం గనుక, చరిత్ర అనే పదానికి హిస్టరీ అనే అర్థం కలగడం సంతోషించదగిందే. దానితో ఏర్పడిన చరిత్రగారలాగ చరిత్ర కారుడు కూడా తెలుగు నిఘంటువులు గ్రహించవలసింది. ఎందుకు మానుకున్నాయో!

ఈ చరిత్ర పదాన్నిబట్టి దీని తద్ధితరూపం చారిత్రకుడు, చారిత్రికుడు అని రెండు విధాలుగా వాడుతున్నారు. నేను 1947లో 'ఆంధ్రప్రభ'లో చేరినప్పుడు లీడర్‌రైటర్ శ్రీ చల్లా జగన్నాథంగారు చరిత్రకారుల మహాసభపై సంపాదకీయం వ్రాయదలచి, నన్ను పిలిచి చారిత్రకులు, చారిత్రికులు అనే వాటిలో ఏది సాధువు అని ప్రశ్నించారు. పాణినీయం ప్రకారం అయితే ఈ రెండు పదాలు కొత్తవండీ అన్నాను. ఇవి వాడుకలోకి వచ్చాయి. ఈ రెండింటిలో ఏది మనం వ్యాకరణానికి దగ్గరిదని నమ్మవచ్చును? అనడిగారు. ప్రస్తుతానికి చారిత్రికులు అని వాడండి. మీ సంపాదకీయం వ్రాసిన తర్వాత వివరిస్తాను అన్నాను.

ఆ సాయంత్రం దొరికిన కొద్దిపాటి తీరికలో వివరించడానికి పూనుకున్నాను. ఆయన వెంటనే నన్ను ఆపి, నాకు సూత్రాల పంచాయితీ వద్దు. సారాంశం చెప్పండి అన్నారు.

చరిత్ర పదాన్ని దేశ చరిత్రకు ఇటీవల తరచు వాడుతున్నారు. చరిత్ర పదం సంబంధంతో చరిత్ర చదువుకున్నవాడు, చరిత్రకు సంబంధించిన వారు అనే అర్థాలతో చరిత్ర శబ్దంపై తద్ధిత ప్రత్యయం చేర్చి అంటే అక అనే ప్రత్యయం చేర్చి చారిత్రిక, చారిత్రక అనే ప్రయోగాలు వాడుతున్నారు. పాణిని కాలంలో చరిత్రకు అర్థం ఇదివరకే వివరించాను. అప్పుడు ఇతిహాసం అనే వాడేవారు. దానికి ఇక ప్రత్యయం చేర్చితే ఐతిహాసికుడు అనే రూపం ఏర్పడుతుంది. దీనికి ఇతిహాసజ్ఞుడు, ఇతిహాసానికి సంబంధించినవాడు, ఇతిహాసానికి సంబంధించినది అనే అర్థాలు వస్తాయి. పాణిని సూత్రాలలోని తదధీతే తద్వేద అనే సూత్రం ప్రకారం ఫలానా విషయం చదువుతున్నాడు. వ్యాకరణం అధ్యయనం చేసినవాడు వైయాకరణుడు, ఛందస్సు చదివిన వాడు 'ఛాందసుడు' మొదలయిన రూపాలు ఏర్పడుతాయి. ఈ విధంగా చరిత్ర చదివినవాడు, తెలుసుకున్న వాడు అనే అర్థంలో చారిత్ర + అడ్ చారిత్ర – చారిత్రుడు అనే రూపం ఏర్పడుతుంది. చారిత్రకుడో, చారిత్రికుడో కాదు. చారిత్రడు అనే ప్రయోగం లేదు.

మరి చారిత్రకులు అనే రూపానికి గతి ఏమిటి? ఎలా పుట్టింది? చరిత్ర శబ్దంపై అక అనే ప్రత్యయం వస్తే చారిత్రక అనే రూపం ఏర్పడుతుంది. పాణిని కొన్ని పదాలను కలిపి గుంపులు గుంపులుగా చేసి వాటిని గుణాలు అని పేర్కొని గుణపాఠం గూడ రచించాడు. ఆయా గణాలలోని పదాలకు ఆయా ప్రత్యయాలు వస్తాయని నిర్ణయించాడు. చరిత్ర అనే పదం, పాణిని అక ప్రత్యయం విధించే ఏ గణంలోను లేదు. కనుక చారిత్రక అనే రూపం పుట్టదు. పాణినీయం ప్రకారం అక ప్రత్యయానికి ఆస్కారం లేదు.

అయితే ఈ పేచీకోరు చారిత్రికుడు మనకెందుకు? చారిత్రక అనే రూపమూ వాడుకలో ఉందిగదా. దానికే ప్రచారం ఇద్దాం అని అనుకుంటే, ఇందులోను ఒక పేచీ ఉంది. చరిత్ర శబ్దంపై ఇక ప్రత్యయమూ రాదు పాణిని ప్రకారం.

మన పూర్వ పత్రికాసంపాదకులు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారి వంటివారు మహా పండితులు; దేశ కాలానుగుణంగా వస్తున్న మార్పులకు అనుగుణంగా ఎన్నో నూతనపదాలను వ్యాకరణావిరోధంగా సృష్టించిన విద్వాంసులు. ఈ పదాలను తప్పని తెలిసి ఎలా వాడారు? అనే సంశయం కలుగుతుంది. వారు పొరబడలేదు.

పాణిని కాలం తర్వాత, సాదృశ్యంతో ఎన్నో కొత్త పదాలు పుట్టుకువచ్చాయి. కాత్యాయనుడు తనకాలంలో పౌరాణిక, ఐతిహాసిక వంటి పదాలు ప్రచారంలో ఉండడం చూచాడు. ఇతిహాసం చదివినవాడు, తెలిసినవాడు, పురాణం చదివినవాడు, తెలిసినవాడు అని అర్థం. ఆఖ్యానాఖ్యాయి కేతిహాస పురాణేభ్యః ఠక్ వక్తవ్యః అని ఒక వార్తికం సవరణ తెచ్చాడు. దానితో పౌరాణిక, ఐతిహాసిక వంటి చాలా పదాలు సాధువులు అయ్యాయి. ఠక్, ఠన్ అంటే ఇక ప్రత్యయం. ఈ వార్తికం ఆధారంగా, చరిత్ర పదం పాణిని చెప్పిన గణాలలో లేకపోయినా, పై శబ్దాల సాదృశ్యంతో చారిత్రక – చరిత్ర చదివినవాళ్ళు, చరిత్ర తెలిసినవాళ్ళు అనే శబ్దం సృష్టించుకున్నారు. సాదృశ్యమనేది భాషాభివృద్ధిలో పెద్ద సూత్రం. పైన చెప్పిన వార్తికానికి అర్థం ఏమిటంటే, ఆఖ్యాన, ఆఖ్యాయిక, ఇతిహాస, పురాణ శబ్దాలకు కూడా ఇర్ ప్రత్యయం చెప్పుకోవాలి అని. దీనితో చారిత్రిక అనే పదానికి ఒక దారి దొరికింది. ఈ 'చారిత్రిక' వెంట 'చారిత్రక' కూడా తోక వెంబడి నారాయణగా రంగప్రవేశం చేసింది. ఇలాగే చారిత్రికం అంటే చరిత్రకు సంబంధించిన అని అర్థం.

చారిత్రిక, చారిత్రక శబ్దాలలో చారిత్రికం వ్యాకరణానికి దగ్గరిదని స్పష్టమయిందికదా! చారిత్రకం అని వాడడాని కన్నా చారిత్రికం అని వాడడమే మేలు. చారిత్రక కూడా చాలా ప్రాచుర్యం పొందింది. గనుక, దానిని వదలలేని వారు తప్పు తెలుసుకోవడం మంచిది. ఏట్లో పారేసినా ఎంచి పారేయమన్నారు 'పైసలను' పెద్దలు. తప్పు తెలుసుకుంటే ఎప్పటికయినా సరిదిద్దుకునే అవకాశం ఉంటుంది.

*****

# నిర్దోషి – నిష్ణాత

ఇప్పుడు దేశమంతటా హవాలా కేసులూ, యూరియా స్కాములూ వినిపిస్తున్నాయి గనుక, తెలుగుపత్రికలలో 'నిర్దోషి' అనే పదం ప్రతిదినమూ కంటపడుతూంటుంది. "ఫలానావారు తమ నిర్దోషిత్వం నిరూపించుకోవాలి. తమ నిర్దోషిత్వం నిరూపించుకునే వరకూ నిర్వహిస్తున్న పదవులకు రాజీనామా ఇవ్వాలి. ఇన్ని ప్రతికూలసాక్ష్యాలు ఉన్నప్పుడు నిర్దోషిత్వం ఎలారుజువు చేసుకోగలుగుతారు? నా నిర్దోషిత్వం ధ్రువపడే వరకూ ఏ ఎన్నికలకూ నిలబడను. న్యాయస్థానం నిర్దోషి అని తీర్పుచెప్పినా ప్రజాన్యాయస్థానంలో నిర్దోషి ఎలా అవుతారు? దోషులు కూడా నిర్దోషులుగా చలామణీ అయ్యే న్యాయవ్యవస్థ మారాలి. తాను నిర్దోషి అయినప్పుడు ఇంతహంగామా ఎందుకు? ఇలా విధవిధాలయిన

వాక్యాలు పత్రికలలో కనిపిస్తుంటాయి.

కొన్నిదశాబ్దాల కిందనిర్దోషి అనే చలన చిత్రమొకటి వెలువడినట్టు కూడా గుర్తు.

ఈ అపప్రయోగం ఎలా వ్యాపించిందో తప్పుడు మాటలు, తప్పుడు వార్తలూ విషంలాగా త్వరగా వ్యాపిస్తాయని ఇదివరకే చాలాసార్లు అనుకున్నాము.

నిర్దోష – నిర్దోషి అనే పదంలో నిర్+దోష అనే రెండు పదాలున్నాయి. నిర్గత = పోయిన, దోష = దోషము గలవాడు అని దీని అర్థం. నిర్గతః దోషఃయస్మాత్ ఎవని నుంచి దోషం పోయిందో వాడు అని బహువ్రీహి సమాసం చెప్పుకోవాలి. ఆ బహువ్రీహి సమాసంలో నిర్దోషః అనే రూపమే ఏర్పడుతుంది గాని, నిర్దోషి అనే సహకారాంత రూపం ఏర్పడదు. కనుక నిర్దోషి అనే అపప్రయోగమే.

నిర్గతః తొలగినట్టే దోషః దోషం అని మొదట్లో కర్మధారయసమాసం చేసుకుని తొలగిన దోషం కల అని ఏర్పడిన ఈ సమాసంపైన కలవాడు అనే అర్థంలో మత్వర్థంలో చేర్చే ఇన్ ప్రత్యయం చేర్య – నిర్గత దోషవాన్ అనే అర్థం రావడానికి అవకాశం కలిగింది. గనుక నిర్దోష + ఇన్ = నిర్దోష అనే రూపం ఏర్పడవచ్చుగదా అని వాదించవచ్చు.

ఈ పద్ధతి లోకంలో ఎక్కడా శిష్టవ్యవహారంలో కనిపించలేదు కాబోలు. కర్మధారయ సమాసంపై మత్వర్థం తెలిపే ఇన్ ప్రత్యయం రాదని – నకర్మధారయాన్మత్వర్థీయః అని నిషేధించాడు. అందువల్ల నిర్దోషి అనే పదం ఏర్పడడానికి వీలులేదు. పాణిని అనాలోచితంగా నిషేధించడు కదా, లోకంలో ఈలాటి పదప్రయోగం కనిపించి ఉండదు.

నిర్దోషి అనే అపశబ్దంపై ఎందుకంత మక్కువ? నిర్దోషుడు, అదోషుడు, అదోషి అని వాడవచ్చుగా హాయిగా! అదోషి అన్నప్పుడు అ + దోషి + ఇన్ = అదోషిన్ –అదోషి. ఇక్కడ కర్మధారయం లేదు కనుక అదోషి అనేది సాధురూపం.

ఇక నిష్ణాత శబ్దానికి వద్దాం. ఇటీవల ఒక గొప్ప భాషాశాస్త్రవేత్త ఒక కవి ప్రత్యేక స్మారక సంచికలో 'నిష్ణాతృత్వం' అనే శబ్దం వాడాడు. నాకు కొంచెం ఆశ్చర్యమే కలిగింది. నిష్ణాతశబ్దం సంస్కృతంలో అకారాంతం కదా, నిష్ణాతృత్వం అనే పదం ఎలా వాడాడబ్బా అని అనుకున్నాను.

నిష్ణాత అనే పదాన్ని ని + స్నా + త అని విడదీయాలి. స్నా ధాతువు కు స్నానం చేసినవాడు అనే అర్థంలో క్త ప్రత్యయం వచ్చి స్నాత అనే పదం ఏర్పడింది. దీనికి వెనుక ఉపసర్గం చేర్చినప్పుడు స్నాన శబ్దంలోని స, ష, యి నకారం ణ అయి నిష్ణాతః అనే పదం ఏర్పడుతుంది. బాగా మునిగిన వాడు అంటే ఆరితేరినవాడు అని అర్థం. ప్రవీణే నిపురాభిజ్ఞ విజ్ఞనిష్ణాత శిక్షకాః అని అమర కోశం చెబుతున్నది. నిపుణ, అభిజ్ఞ, విజ్ఞ, నిష్ణాత, శిక్షక అనే పదాలు ప్రవీణ అనే అర్థంలో ఉన్నాయి. ప్రవీణ అన్న దానికి పర్యాయాలు అని అర్థం.

ఈ నిష్ణాత పదం తెలుగులో తత్సమంగా దిగినప్పుడు తెలుగు ప్రథమావిభక్తి ప్రత్యయమయిన డు చేరి నిష్ణాతుడు అని అవుతుంది. దీనిని ఈ విధంగానే ప్రయోగించాలి. మరి నిష్ణాతృ + త్వం = నిష్ణాతృత్వం అని ఆ భాషావేత్త ఎలా ప్రయోగించాడు? నేను సంస్కృత నిఘంటువులు, తెలుగు నిఘంటువులు తిరగ వేశాను. నిష్ణాతృ అని ఋకారాంతంగా ఎక్కడా కనబడలేదు. ఎక్కడన్నా ప్రయోగం ఉంటే కదా కోశాలు క్రోడీకరిస్తాయి! ఎన్నో మారుమూల పదాలను నిఘంటువులనుంచో, వివిధ సాహిత్య ప్రక్రియలనుంచో ఏరిన మోనియర్ విల్లియమ్స్ సంస్కృతాంగ్ల నిఘంటువు కూడా నిష్ణాఋ అని ఋకారాంతంగా ఇవ్వలేదు.

నిష్ణాతః అనే సంస్కృతపదం నిష్ణాతుడు అని అయినా, సామాన్యంగా సంస్కృతసమాలను మనం స్త్రీ సమంగా భావించి, ఆకర్షణ ఛేదన, ఖేదన, భాషణ అని వాడుతున్నాము గనుక, స్త్రీ సమంగా వాడిన నిష్ణాతపదం ఋకారాంత శబ్దమైన నిష్ణాతృ అనే శబ్దానికి ప్రథమావిభక్తి ఏకవచనమైన నిష్ణాతా అనే పదం నుంచి పుట్టిందయి వుంటుందనే భ్రాంతితో, ఆ నిష్ణాత శబ్దం భావార్థకం నిష్ణాతృత్వం అని భ్రాంతిపడి ప్రయోగించాడు కాబోలు అనుకున్నాను.

నిష్ణాతః అనేది ని ఉపసర్గతో ఉన్న స్నా ధాతువుపై కర్త్రర్థంలో క్త అనే ప్రత్యయం కలపడంతో ఏర్పడిందని ఇదివరకే అనుకున్నాం. ఈ ని ఉపసర్గ పూర్వకమైన స్నా ధాతువుకు అదే కర్త్రర్థంలో తృచ్ అనే ప్రత్యయం చేర్చితే ని + స్నా + ష్ణా + తృచ్ = నిష్ణాతృ అనే శబ్దం ఏర్పడుతుంది. దీని ప్రథమావిభక్తి ఏకవచనరూపం నిష్ణాతా. ఇది తెలుగులోకి ధాత, పిత, కర్త, నేత వంటి ఋకారాంతశబ్దాల ప్రథమావిభక్తి ఏకవచన రూపాలలాగే నిష్ణాత అని అవుతుంది. నిష్ణాతః అనే శబ్దానికి ప్రవీణుడు అనే అర్థం వచ్చినట్టే, నిష్ణాతృ శబ్దానికి కూడా ప్రవీణుడనే అర్థమే వస్తుంది. నిష్ణాతృ భావం నిష్ణాతృత్వం.

అందువల్ల నిష్ణాత, నిష్ణాతృత్వం అనే మాటలు వాడడంలో తప్పులేదు. కాని ప్రాచీన ప్రయోగాలు ఎక్కడా కనిపించడం లేదు గనుక వాడకపోవడమే మంచిది.

కన్నడం వారు, తెలుగువారు సంస్కృత తత్సమాలను స్త్రీ సమంగా వాడడం, ప్రాకృతప్రభావం వల్ల కలిగిన అలవాటు. సంస్కృతంలోని సకారాంత, నకారాంత శబ్దాలన్నీ ప్రాకృతంలో అకారాంతాలవుతాయి. అలాగే ఋకారాంతాలన్నీ అకారాంతాలవుతాయి. ధాతృ, పితృ, మాతృ, క్రోష్టృ, కర్తృ శబ్దాల ప్రథమావిభక్తి ఏకవచన రూపాలు. సంస్కృతప్రాకృతాలలోనీ సమాసాలు. ఈ పదాలు తత్సమీకరణంలో ధాత, మాత, పిత, కర్త, క్రోష్ట అని అవుతాయి. స్త్రీసమంగా ఈ భ్రాంతితో స్త్రీలింగసమంగా ప్రయోగించే నిష్ణాత పదం కూడా ఋకారాంతమనుకొని ఎవరో పొరపాటుతో దాని భావార్థకాన్ని నిష్ణాతృత్వం అని ప్రయోగించి ఉంటాడు.

దీనికి ప్రయోగం లేకపోయినా వ్యాకరణరీత్యా సాధుత్వం ఉందిగనుక సమర్థించడానికి అవకాశం ఉంది.

"నిష్ణాతః శబ్ద తంత్రే నిరుపమధిషణః కోమలే కామ్యమార్గే" అని నా మిత్రుడు పండితతల్లజుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ప్రయోగం.

*****

# అనుకూలుడు - అనుకూలత

చాలాకాలానికి కలుసుకున్నాడు ఒక మిత్రుడు. ఆయనతో మాటల సందర్భంలో ఇద్దరికీ పరిచితుడయిన ఒక పెద్ద మనిషిని గురించి అడిగాను "ఆయన ఎలా ఉన్నారు? ఇప్పుడు ఏమిటి హోదా?" అని.

"ఆయనకేమండీ? మంచి ఉద్యోగం. అనుకూలవంతుడయిన ఆఫీసర్. పదేళ్లలో మూడుమెట్లు ఎక్కాడు. ఇక ఇంటి సంగతి చూద్దామా. అనుకూలవతి అయిన ఇల్లాలు, అనుకూలవంతులైన పిల్లలు, వాహనం, అట్టహాసం" అని చెబుతూపోయాడు.

ఓపిగ్గా విన్నాను. చివరకు అడిగాను "అనుకూలవతి అయిన భార్య అని అన్నారే. ఆవిడకు ఎంతమంది అనుకూలురు? అంతమంది ఉంటే భర్త ఎలా ఊరుకున్నాడు?" అని ప్రశ్నించాను.

ఆయన కంగారుపడిపోయి "గురూ గారూ! ఆమె చాలా అనుకూలవతి అని అన్నానేగాని, ఆమెకు చాలామంది అనుకూలురు ఉన్నారనలేదండీ. మీ హాస్యోక్తి ఏమిటో అర్థం కావడం లేదు' అని అన్నాడు.

"నాకు మీవంటి వారితో పరాచికాలా? మీరు అనుకూలవతి అన్నారు. దానిని బట్టి నేను ప్రశ్నించానంతే" అని అన్నాను.

ఆయన మరింతనొచ్చుకొని, "అనుకూలవతి అనే మాట తప్పా సార్? అందరూ వాడుతున్నారుగదా అని నేనూ వాడాను. పాపం! ఆ ఇల్లాలు ఏ మచ్చాలేని పతివిధేయురాలు సార్. ఆ మాట తప్పంటే చెప్పండి, ఎన్ని క్షమాపణలయినా చెప్పుకుంటాను" అన్నాడు.

"అబ్బే! మీరు తప్పుగా వాడలేదు. గాభరా పడకండి, గతానుగతికంగా లోకులు వాడుతున్నారు, మీరూ వాడారు. మీ తప్పేమీ లేదు" అని అన్నాను.

"అయితే చెప్పండి గురూగారూ, తప్పేమిటో సవరించుకుంటాను. ఆ ఉత్తమ ఇల్లాలు నా వల్ల ఎలాంటి అపచారమూ జరగరాదు" అని అన్నాడు పూర్తిగా భయపడిపోయి.

నేనన్నాను– "మహానుభావా! మీరు ఆమె ఎడల ఎలాంటి అపచారమూ చేయలేదు, నమ్మండి నా మాట" అని అన్నాను.

"మరి తప్పేమిటో చెప్పండి స్వామీ! మనస్సు మహాయిదయిపోయింది" అన్నాడు ఆయన.

"అయితే, వినండి" అంటూ ఇలా అన్నాను–అనుకూలవతి అనే సమాసంలో అను + కూల + వత్ = ఈ అనే మాటలు, ప్రత్యయాలూ ఉన్నాయి. అనుకూలం అంటే అను + కూలం = గట్టును అనుసరించి ఉండేది– ఉండేవాడు, నిమ్నప్రదేశాన్ని అనుసరించేది ప్రవాహానుగుణంగా వెళ్లేది, హితంగా ఉన్నా, మైత్రితో ఉన్న విశ్వసనీయ, దయగల, మనసెరిగి ప్రవర్తించే భర్త, ఒక ఛందస్సు మొదలయిన అర్థాలు.

శబ్దార్థ కల్పతరువు మరికొన్ని విశేషార్థాలనూ ఇచ్చింది– ఒక్క నాయికయందే అనురాగము గలవాడు, విష్ణువు, ఒకరి ఇష్టానికి అనుకూలంగా ప్రవర్తించేవాడు. సహాయకుడు, ఒక అలంకారం.

శబ్దరత్నాకరం అనుకూలము = ఆనుకూల్యం గలది. అనుకూలించు = అనుకూలమగు, ఒదవు. అనుకూలుడు = ఒక నాయకుడు, ఆనుకూల్యముగలవాడు – అనే అర్థాలిచ్చింది.

సూర్యరాయాంధ్ర నిఘంటువు అనుకూలము = అనుగుణమైనది. హితము, ఇష్టము, అనుకూలుడు = ఒక నాయకుడు, దంతివృక్షము.

ఈ నిఘంటువుల అర్థాలను బట్టి అనుకూల అనే పదం గురువాచకమో, ధర్మవాచకమో కాదని, గుణం, ధర్మం గలది అనే అర్థమిచ్చే మాట అని స్పష్టమైంది గదా! అలాంటప్పుడు అనుకూలవతి అంటే అనుకూలమయిన వ్యక్తులు గలది – అనుకూల+మత్–వత్ = అనుకూలము అనే అర్థం వస్తుంది. ఆవిడకు ఎంతమంది అనుకూలురు ఉన్నారో? ఏమో అనే అపార్థం వస్తుంది. అనుకూలత్వం, అనుకూలత, ఆనుకూల్యం అనేవి భావార్థక వాక్యాలు. కనుక పతికి ఒదిగి మదిగి వర్తించే మహిళను అనుకూల, అనుకూల్యవతి అని వాడాలి. అప్పుడు వక్త ఉద్దేశించిన అర్థాలు వస్తాయి. లేనప్పుడు అనుకూలవతి తనకు అణగిమణగి ఉండే వ్యక్తో, వ్యక్తులో కలిగినట్టిది అనే అర్థం వస్తుంది. ఆనుకూల్యం అనేది ధర్మం, గుణం. ఆ గుణం కలిగిన వ్యక్తిగాని, వస్తువుగాని ధర్మి, ధర్మమేదో, ధర్మి ఏదో తెలుసుకొని వాడాలి.

ఇదంతా విన్నాడు ఆయన. "ప్రయోగ శరణాః వైయాకరణాః జనంలోగాని, సాహిత్యంలోగాని ఉన్న ప్రయోగాన్నిబట్టే వ్యాకర్తలు శబ్దాల సాధుత్వాసాధుత్వాలను నిర్ణయిస్తారు అంటారు గదా. మరి ఈ అనుకూలవతి అనే ప్రయోగాన్ని మనుచరిత్రకారుడు వాడాడు. ప్రవరుడు హిమాలయాలకు వెళ్లుతాడు. పాదాలకు పూసుకున్న పసరు ప్రభావంతో కొన్ని గంటల తర్వాత ఆ పసరు కరిగిపోతుంది. ఎలా తన పట్టణాన్ని చేరుకోవాలో తెలియక విచారించడం ప్రారంభిస్తాడు. అప్పుడు 'అనుకూలవతి నాదు మనసులో వర్తించు కుల కాంత మదినెంతకుందు నొక్కొ! అని చింతిస్తాడు. పెద్దన గారంతటి వాడు అనుకూలవతి అని ప్రయోగించాడు. అనుకూల అనిగాని, ఆనుకూల్యవతి అని గాని మీరన్నట్టు ప్రయోగించలేదు, ఏమంటారు మరి?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

నేను ఆలోచనలో పడ్డాను. "అయ్యా! జనంలో తప్పు ప్రయోగాలు ఉంటాయి. పెద్దనగారు దానినిబట్టి ప్రయోగించి ఉంటారు. ఈ పదం ఒప్పు, ఇది తప్పు అని చెప్పడం వ్యాకరణపరిచయమున్నవాడు చేసే పని. ఎక్కడో అరుదుగా, ఇలాంటి ప్రయోగం ఉందంటే, అది కవి స్వతంత్రించి చేసిన పని అని మనం భావించాలి. కొందరు ఈ

అనుకూలవతిని అనుకూలగతి అని కూడా అంటున్నారు. అప్పుడు అనుకూలమయిన ప్రవర్తన గలది అని అర్థం. అపప్రయోగ బాధ ఉండదు. మన తెలుగు ప్రాచీన నిఘంటువులు ఏవీ అనుకూల అనేచోట అనుకూలవతి అనే మనుచరిత్ర ప్రయోగాన్ని ఉదహరించలేదు. దానినిబట్టి అది సరైన పాఠం కాదనో, నిఘంటుకారులు ఉపేక్షించారనో అనుకోవలసి ఉంటుంది" అని అన్నాను.

"అనుకూలగతి అనే ప్రయోగం కంటె అనుకూలవతి అనేదే సహజంగా ఉన్నట్టు, ఆత్మీయంగాను మధురంగాను, శ్రవణసుఖంగాను ఉన్నట్టు తోచడం లేదా. అనుకూలవతి అనేది తప్పని భావించిన పండితులు అనుకూలగతి అని దిద్దివేసి ఉంటారేమో!" అని ఆయన సందేహం వెలిబుచ్చారు.

"స్వామీ! అనుకూలమనే పదంపైన అది కలది అని తెలిపే మతుప్-త రాదనడం ప్రస్తుతాంశం. ఎవరో క్వాచిత్కంగా ప్రయోగించినంతమాత్రాన శబ్దం సాధువైపోదు గదా! ఇంతకూ, మనం అసలు విషయం మిత్రుని యోగక్షేమాలు వదలి ఈ గొడవలో పడ్డాము" అని ఒక నవ్వు నవ్వాను.

ఆయన "ఈ అనుకూల ప్రతికూల విషయాల ప్రవాహమే కదండీ జీవితమంటే" అంటూ నవ్వాడు.

*****

## వార్తయందు జగము వర్తిల్లుచున్నది

"వార్తయందు జగము వర్తిల్లుచున్నది
యదియులేనినాడ యఖిలజనులు
అంధకార మగ్నులగుదురు గావున
వార్త నిర్వహింపవలయు పతికి"

అని నన్నయగారు భారతంలో అన్నారు (సభా. 1-51) రాజయినవాడు వార్తను బాగా నిర్వహించాలి. ఈ వార్తలోనే ప్రపంచమంతా ఉంది. వార్తగనుక లేకపోతే లోకంలోని జనమంతా చీకట్లో కొట్టుమిట్టాడవలసిందే అని ఈ పద్యం అర్థం.

వార్త అంటే ఏమిటి? ఈ పద్యానికి మూలమయిన సంస్కృతభారతంలో

'వార్తాయాం సంశ్రితః తాతలోకోయా' అని ఉంది. దీనికి నీలకంఠుడనే విద్వాంసుడు చేసిన వ్యాఖ్యలో "వార్తా కృషిః వాణిజ్యం పాశుపాల్యం కుసీదంచేతి చతుర్విధా" అని వివరించాడు. అంటే, వ్యవసాయం– భూమిని దున్నడం, వాణిజ్యం, పశువులను పాలించడం, వడ్డీకి డబ్బు తిప్పడం అనే వృత్తులు వార్త అనే మాటకు అర్థాలు అన్నమాట. ఈ వ్యాఖ్య వల్ల వార్త అంటే వృత్తేగాని సమాచారం కాదు అనేది స్పష్టమయినట్టేగదా!

అయినప్పుడు నేటి పత్రికలవారు వార్త అనే పదాన్ని సమాచారం అనే అర్థంలో వాడడం మాత్రమే కాక, ఒక దినపత్రిక నన్నయగారి పద్యంలోని పూర్వార్ధాన్ని తన సంపాదకీయానికి అలంకారంగా పెట్టుకుంది. పత్రికలవాళ్ళకు ఇంతమాత్రం తెలియదా? అన్నారు, ఒక పండితమిత్రులు నాతో. నేను పత్రికలవాడినని తెలుసు ఆయనకు. అయినా తగలాలనే అన్నాను.

పత్రికలవారినందరినీ ఆయన బోనులో నిలబెట్టినప్పుడు, నేను సమర్థించుకోవాలి గదా! అది నా కర్తవ్యం కదా!

"స్వామీ! పదాల అర్థాలు మారుతుంటాయండీ. మొదట ఒక పదానికి ఉన్న అర్థానికి ఛాయలు కొన్ని ఏర్పడుతాయి. క్రమంగా ముఖ్యార్థంపోయి ఛాయగా ఏర్పడిన అర్థమే వ్యాప్తిలోకి వస్తుంది. ఇది భాషాలక్షణం. వేదకాలం నుంచి ఈ పద్ధతి ప్రవహిస్తూనే ఉంది" అన్నాను. ఆయన కొంచెం ముఖం చిట్లించుకొని, "వేదం సంగతి మనకెందుకు? లౌకిక సాహిత్యం చెప్పండి" అన్నారు.

"అయితే వినండి" అన్నాను, చెప్పాను.

వార్త అనే పదానికి జీవనం, వ్యాపారం, వృత్తి అనే అర్థాలు పూర్వం ఉండడం నిజమే. వార్త అంటే వ్యవసాయం, వ్యాపారం, పశుపాలనం అని మనువూ చెప్పాడు. క్రమంగా అర్థంమారింది. "వార్తాయాం సంశ్రీతంతాత లోకోయం" అని మహాభారతమే వార్తను కర్షక అనే పదాన్ని వార్త తెచ్చేవాడు, గూఢచారి, ప్రతినిధి అనే అర్థాలలో ప్రయోగించింది. మరి మహాభారతకాలానికే వార్త అనే పదానికి నానార్థాలు ఉన్నాయన్నమాట. నీలకంఠాచార్యులు ఈ సందర్భంలో ఏమి వ్యాఖ్యానించాడు?

కొంతకాలానికి వార్త అనే పదానికి పూర్వ అర్థంపోయి సమాచారం అనే అర్థమే రూఢమయి ఉంటుంది. కనుకనే నామలింగానుశాసనకర్త అయిన అమరసింహుడు 'వార్తాప్రవృత్తిః, వృత్తాంతః ఉదదంతః' అని వార్తా అనే పదాన్ని సమాచారానికి పర్యాయంగా పేర్కొన్నాడు.

కథాసరిత్సాగరకారుడయితే, వార్తా శబ్దాన్ని జరిగిన సంఘటన వివరాలు, రిపోర్ట్, వదంతీ, గుప్తధర్మ, కథ అనే అర్థాలలో వాడాడు.

మోనియర్ విల్లియమ్స్ నిఘంటువు మరికొన్ని మంచి ప్రయోగాలు ఉదాహరించింది. వార్తాకృత్ జరిగిన విషయాలు చెప్పడం. కా వార్తా? = ఏమిటి సంగతి? పనీపాటా లేనివారు పోచికోలు కబుర్లు చెప్పుకుంటూ, కాలం గడుపుతారని అవహేళనచేసే ఒక శ్లోకం ఉంది.

కాకస్య కతివా దంతాః<br>
మేషస్యాండం కియత్పలమ్,<br>
కంబలౌ కతిరోమాణి<br>
కావార్తా చోళమండలే

కాకికి ఎన్ని పళ్ళు? గొర్రె పొట్టేలు అండం ఎన్ని పలాలు? ఈ కంబడిలో ఎన్ని రోమాలు ఉన్నాయి? చోళ దేశంలో ఏమిటి సమాచారం? అని ఈ శ్లోకం తాత్పర్యం. సోమరులు ఇలా వ్యర్థప్రలాపం చేస్తుంటారట.

"అవయా వార్తయాకింకార్యమ్?" ఈ వార్తతో ఏమిటి ప్రయోజనమ్? అని వార్త వృత్తాంతమనే అర్థంలో సంస్కృతంలో చాలాచోట్ల ప్రయుక్తమయింది. ఘటన, జరిగిన సంగతి అనే అర్థాలూ ఉన్నాయి.

వార్తాను యోగం = కుశలప్రశ్న చేయడం, వార్తలు అడగడం. వార్తా మాత్రం = కేవలం విషయాలు చెప్పడం.

వార్తా+అయనం = వార్తాయనం వార్తలకోసం వెళ్ళడం. వార్తాయనుడు =

రాయబారి, వార్తలకోసం వెళ్ళేవాడు, గూఢచారి, వార్తాయనం రామాయణంలాగా రామ + అయనం = రామాయణం అంటే రాముడి యాత్ర.

వార్తా + వహుడు, వార్తా + హరుడు. మనకు బాగా తెలుసు. వీళ్ళు రాజులకు, పెద్దలకు పరస్పరం వార్తలు అందించేవారు. ఈ వార్తాహరత్వమే క్రమంగా అంచెలంచెలుగా వార్తలను, వార్తలు గల ఉత్తరాలను ఒకచోటి నుంచి మరొకచోటికి అందించేది అయింది. మరీ జరూరు వార్తలను అందించడానికి ప్రత్యేక వార్తాహరులుండేవారు. వీరికి హర్కారాలు, బేగిరావులు అని పేరు. బేగిరావులు అనే మాట తమాషాగా ఉంది కదూ! వేగం బేగిగా మారింది. బేగిగా = తొందరగా, రావులు = వచ్చేవారు = బేగిరావులు, ఈ రావులు వేంకటరావు, సుబ్బారావు, రామారావులలోని రావులు కారు సుమండీ! ఆ రావులు రాజా–రాయ – రాఅ – రావ – రావ్ అయింది. కొందరు సంస్థానాధీశులకు పూర్వం రావ్, రాజా అనే రెండు బిరుదులూ ఉండేవి. రావ్ సాహెబులు, రావ్ బహదూర్‌లూ, ఉత్తరభారతంలోని రాయ్ సాహెబ్, రాయ్ బహదూర్‌లు రాయనుంచి వచ్చినవారే. బ్రిటిష్‌వారు తమకు ఇష్టులయిన భారతీయులకు ఈ బిరుదాలు ఇచ్చేవారు. రావ్ సాహెబ్, రావ్ బహదూర్, దివాన్ బహదూర్, సర్ అని. ఆ సంప్రదాయం అనే మన భారతీయ ప్రభుత్వం పద్మశ్రీ, పద్మభూషణ, పద్మ విభూషణ, భారతరత్న అనే బిరుదాలు ఇస్తున్నది. సంఘ సేవచేసేవారిని, విద్యావంతులను, శిల్పులు, సంగీతాది కళలలో నిపుణులను, గొప్ప పనులను చేసినవారిని గౌరవించడం కోసం మొదట ఏర్పడిన ఈ బిరుదులు, క్రమంగా ఆయా రాజకీయపక్షాల అభిమానులకు అందడం ప్రారంభమయింది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో బేగి అనే పదం ఉంది గాని, బేగిరావులు లేదు. రాజకీయ వ్యవహారంలో ప్రచురితమయిన ఈ పదం నిఘంటువుకు ఎక్కవలసిందే. వార్తాహర, వార్తాహర్త్రీ = వార్తలు తీసుకొనిపోయేవాడు, వార్తలు చేరవేసే స్త్రీ అనేవి మృచ్ఛకటికంలోనూ ఉన్నాయి.

*****

# ఓ నామసీవాయ

మిత్రులు డాక్టర్ బాలాంత్రపు రజనీ కాంతరావుగారు మన సంఘంలోని అక్షరాభ్యాస సంప్రదాయరీతులపై కొన్ని ప్రశ్నలు వేశారు. వాటికి జవాబివ్వడానికి ప్రయత్నిస్తాను.

అక్షరాభ్యాసమనేది జాతకర్మ నామకరణాదిగా అంత్యేష్టి వరకు ఉన్న షోడశకర్మలలోనిది కాదు. ఈ విషయం మిత్రులు, దైవజ్ఞశేఖరులు, ఆనువంశిక పురోధనులు శ్రీ బిజుమళ్ల సూర్యనారాయణ సిద్ధాంతిగారితో సంప్రదించి తెలుసుకొన్నాను.

మన ప్రాచీనసంప్రదాయం ప్రకారం విద్యాభ్యాసం ఉపనయనానంతరం గురుకులానికి వటువును పంపడంతో ప్రారంభమవుతుంది. ఉపనయనం గర్భాష్టమంలో జరపాలి గనుక బాలునికి ఏడవ ఏడు పడేవరకు మౌఖికంగా పెద్దలు ఏదైనా విషయాలు నేర్పడం ఉండేదేగాని శాస్త్రీయంగా కాదు. కనుక ఇది జాతకర్మ నామకరణాలలాగా వైదికంకాదు. ఉపనయనంతో విద్యాభ్యాసం ప్రారంభం.

ఇది షోడశకర్మలలో చేరకపోయినా, ప్రాచీనకాలంనుంచే అలవాటులో ఉన్నట్టు తెలుస్తున్నది. అశోకునికాలంలో సంకలితమయినట్టు ప్రథలో ఉన్న లలిత విస్తరంలో, బుద్ధుడు బాల్యంలో పలకాబలపాలతో బడికి వెళ్లి నానావిధలిపులూ నేర్చుకున్నట్టు ఉల్లేఖితం. లలిత విస్తరం మహాయాన సంప్రదాయ బౌద్ధులు రచించిన బుద్ధుని తొలిజీవిత చరిత్ర. దీనిలో బుద్ధుని జననం మొదలు సారనాథ్‌లో తొలి ఉపదేశం చేసేవరకు జరిగిన ఉదంతం వర్ణితమైంది.

సిద్ధార్థ కుమారుడు గ్రహణధారణ వటువు అయిన తర్వాత, తండ్రి శుద్ధోదన మహారాజు అతనిని లిపిశాలకు తీసుకొని వెళ్లాడు. తక్కిన పిల్లలతో పాటు వెళ్లాడు. చందనపు చెక్కతో చేసిన పలక, మణులు చెక్కిన బలపం పట్టుకున్నాడు. లిపిశాలలో ఆచార్యుడైన విశ్వామిత్రుడు అక్షరాలు దిద్దుకోమన్నాడు. అప్పుడు సిద్ధార్థుడు 'మీరు ఏ లిపిని చెప్పదలచారు? ఏది దిద్దమన్నారు?' అని అంటూ 64 లిపులూ తెలిపాడు. ఇలా నడుస్తుంది లిపిశాలా సందర్శనగాథ.

కాళిదాస మహాకవి రఘువంశంలోను అక్షరాభ్యాసం సంగతి చెప్పాడు ఇలా:-

"స వృత్త చూలం చలకాకపక్షకైః
అమాత్యపుత్రైః సవయోభిరన్వితః
లిపే ర్యథావ ద్గ్రహణేన వాఙ్మయం
నదీముఖేనేవ సముద్రమావి శత్"

రఘు కుమారుడు చూడాకర్మ తర్వాత, పంచశిఖలూ గాలికి ఎగురుతుండగా, తోటివయసు వారైన మంత్రిపుత్రులతో పాటు లిపినేర్చి, నదీముఖంద్వారా సముద్రాన్ని ప్రవేశించినట్టు అక్షరాలు నేర్చుకోడం ద్వారా వాఙ్మయంలో ప్రవేశించాడట. ఇక తెలుగుదేశంలో అక్షరాలు నేర్పడం, వ్రాత చక్కగా వ్రాయడం చరిత్ర తెలిసినప్పటి నుంచీ ఉంది.

ఈ అక్షరాభ్యాస సంప్రదాయం తెలుగునాట బౌద్ధుల ద్వారా, కన్నడ తమిళనాడులలో జైనులద్వారా వ్యాప్తిలోకి వచ్చినట్టు తోస్తుంది. జైనులు, బౌద్ధులు వైదికమతానికి పోటీగా మతప్రచారం చేసినవారు గనుక, ప్రజాసామాన్యంలో అక్షరాభ్యాసాన్ని తమగురువుల సంస్మరణతో జరిపించి ఉంటారు. జైనబౌద్ధాల ప్రాబల్యం తగ్గి వీర శైవమతం వ్యాపించిన పిదప, అక్షరాభ్యాసం శైవ సంప్రదాయంతో శివ పంచాక్షరితో ప్రారంభం కావడం ఆచారం అయింది. అయినా పాత జైన సంప్రదాయపు సిద్ధం నమః సిద్ధునికి నమస్కారం అనేది పోలేదు. “ఓం నమశ్శివాయ, సిద్ధం నమః” అనే రెండు వాక్యాలతో అక్షరాభ్యాసం ప్రారంభమయింది. బౌద్ధులు కూడా ఈ సిద్ధం నమః అనే పదాన్ని అంగీకరించినట్లు తోస్తుంది, వారి పూర్వులూ యోగసిద్ధులే గనుక.

సాతవాహన, ఇక్ష్వాకు సార్వభౌముల శాసనాలు సిద్ధంతో ప్రారంభమవుతాయి. ప్రాచీనులయిన సిద్ధపురుషులకు నమస్కారమని ఈ ప్రారంభం కాబోలు! తర్వాత ఇది ఇతరకార్యాల ప్రారంభంలోను, జీవితంలో ముఖ్యమయిన మొదటిదయిన అక్షరాభ్యాసంలోను చేరి ఉంటుంది. వీరశైవం ప్రబలినా, పాతసంప్రదాయం పోలేదు. ప్రతిమతంవారూ తమ మతవ్యాప్తికి చేసిన ప్రయత్నంలో మొదటి ఎత్తు, అప్పుడున్న మతాన్ని ఆత్మీయం చేసుకొని మొదట తమ మత సంప్రదాయాన్ని ప్రజల తృప్తికోసం వదలుకోకపోవడం. కొత్తది ప్రబలమయిన తర్వాత పాతది క్రమంగా మరుగైపోతుందని వారికి తెలుసు.

ఇప్పటికీ తెలుగుదేశంలో “ఓం నమః శివాయ – సిద్ధం నమః” అనేది అక్షరాభ్యాససంప్రదాయం. ఇది క్రమంగా పిల్లల నోటపడి ఓనామసీవాయ అని మారింది. చదువు నేర్పడమంటే ఓనమాలు నేర్పడం అని రూఢి అయింది. ఇది సాహిత్యానికి కూడా ఎక్కింది.

రాయని భాస్కరమూర్తి గొప్పదాత. దేనినీ కాదు, లేదు అని అనేవాడు కాడట, చిన్ననాటి నుంచే.

"చేకొని రాయని బాచడు
కాకాలు గుణించు పిదపకాలము నాడే,
లాకేత్వ మివ్వనేరడు
దాకును కొమ్మియ్యడిట్టి ధన్యుడుగలడే"

అని ఒక కవి అతని దాతృత్వాన్ని వర్ణించాడు. లేదు అనే వాడు కాడట.

"అక్షరాభ్యాసంబు శిక్షచేసేడునాడె
ఓ వ్రాసినా వ్రాయకుండినాడు,
గుణితవేళలయందు కోరిలాకేత్వంబు
దాకు కొమ్మియ్యక తర్లినాడు"

అని మరొక కవి వర్ణించాడు.

ఇదంతా శైవసంప్రదాయం. వైష్ణవసంప్రదాయంలో ఈ ఓన్నమశ్శివాయ లేదు. అక్షరాభ్యాసంనాడు అలికి ముగ్గులు తీర్చిన మండువాలో తల్లిదండ్రులు పీటల మీద కూర్చుని, పిల్లవాడిని ఒడిలో కూర్చోబెట్టుకొని అక్షరాలు దిద్దిస్తారు. పిల్లవాడు మాతామహుని ఇంట్లో ఉంటే అక్షరాభ్యాసం మేనమామ చేస్తాడు.

బంధుమిత్రులందరూ సమావేశమవుతారు. పురోహితుడు లాంఛనంగా సంకల్పం చెబుతాడు. ఇది వైదిక కర్మ కాదని మొదట్లోనే చెప్పాను. అయినా శుభకార్యం గనుక, లాంఛనంగా పురోహితుడు, పీటలమీద పిల్లవానితో పాటు కూర్చున్న తల్లిదండ్రుల ఎదుట ఒక పళ్ళెంలో గాని, వెడల్పాటి అరిటాకులోగాని పరచిన బియ్యంలో తండ్రిగాని, మేనమామగాని, లాంఛనమయిన సంకల్పానంతరం పిల్లవానితో–

"జ్ఞానానంద మయందేవం
నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానామ్
హయగ్రీవ ముపాస్మహే"

అని హయగ్రీవస్తోత్రం పలికించి, కుడిచేయి పట్టుకుని, అతని చిన్నచూపుడువేలితో బియ్యంలో శ్రీః అని వ్రాయిస్తాడుమొదట. తర్వాత అ ఆ లు వ్రాయిస్తాడు. వ్రాసేటప్పుడు ఓం నమో నారాయణాయ అని వైష్ణవులకు ప్రధానమయిన మూలమంత్రం తండ్రిగాని, మాతులుడుగాని పఠిస్తారు. అకారం విష్ణుస్వరూపం గనుక సంప్రదాయానుగుణమే.

తెలుగు నాయకరాజుల కాలపు వైష్ణవమత ప్రభావం వల్లనో ఏమో, దక్షిణదేశంలోని వైష్ణవులు ఇండ్ల అక్షరాభ్యాసోత్సవంలోను బియ్యంలో తెలుగులో శ్రీః అనే అక్షరం పిల్లవానితో వ్రాయించడం అరవై సంవత్సరాల క్రితం నేను తంజావూరులో చూచాను. ఒక వడమస్మార్తుల ఇంటి అక్షరాభ్యాసంలోను తెలుగు శ్రీ అనే అక్షరం వ్రాయడం చూచాను. ''ఏమిటీ తెలుగు పద్ధతి?'' అని ప్రశ్నించినప్పుడు ఒక వృద్ధుడు "సంస్కృతపుస్తకాలన్నీ తెలుగు లిపిలో మా పూర్వులు వ్రాసుకొన్నారు. సంస్కృతగ్రంథాలు వ్రాయడానికి గ్రంథలిపి అనేది పల్లవులకాలం నుంచి ఉంది. దానిలోను వ్రాస్తాము. కాని, తెలుగు లిపి సులభమనో, మరే కారణంగానో తమిళదేశంలోని బ్రాహ్మణులంతా సంస్కృతగ్రంథపఠనం కోసం తెలుగు లిపిని నేర్చుకుంటారు. అందువల్ల అక్షరాభ్యాసం తెలుగు శ్రీతో ప్రారంభం చేస్తాము" అన్నారు. ఇప్పటి పద్ధతి ఏమిటో తెలియదు.

ఇదీ అక్షరాభ్యాసం గురించి నాకు తెలిసిన విషయం.

*****

# ఎవరీ తపోప్రాయుడు?

నేను సాధారణంగా రెండుమూడు వారపత్రికలు – ముఖ్యంగా ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక చదువుతాను. ఈ అలవాటుకొద్దీ మొన్నటి మే 1వ తేదీ ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక సంచిక చదువుతూ 32వ పుట ఒకటవ కాలం పై భాగంలోని ఒక సంభాషణ వద్ద ఆగిపోయాను. అది 'ఒకసూర్యుడు' సీరియల్‌లోని భాగం.

మనం బస్సులోనో, కారులోనో, రైలులోనో పయనిస్తున్నప్పుడు హఠాత్తుగా బ్రేక్‌పడితే ఎలా తూలిపడుతామో అలా తూలిపడ్డాను ఆ వాక్యం చదివి. ఆ వాక్యం ఇది

''కృష్ణుడు ఇంకా అన్నాడు – యాదవ సేనానియైన అక్రూరుడు తపోప్రాయుడైనాడు?"

"కృష్ణా! అక్రూరుడేమీ మాట్లాడలేకపోయాడు. అతని హృదయంలో ఆవేదన నిండి ఉంది."

ఈ వాక్యాలు పదిసార్లు చదివాను. అక్రూరుడు తపోప్రాయుడైనాడు అనే వాక్యం ఎంతమాత్రమూ అర్థంకాలేదు. చదువుతున్నప్పుడు ఏది అర్థం కాకపోయినా చదువు ముందుకు సాగదు – ఇది నా స్వభావం. రచయిత ఏ ఉద్దేశంతో ఏ పదం ప్రయోగించాడో, అనువాదకులు ఏమి అర్థం చేసుకుని ఏమని అనువాదం చేశారో నా తలకు కొంచెమైనా ఎక్కలేదు.

హిందీవాళ్లకు సంస్కృత వ్యాకరణం అంతగా పట్టదు గనుక తపోప్రాయ అని వ్రాసినా, అనువాదకులు తెలుగు మర్యాదను అనుసరించాలి గదా! తపోప్రాయుడు అని అనువదించి ఉంటారా? అని సంశయం కలిగింది. అనువదించి ఉంటే అర్థం ఏమిటి?

ప్రాయః అనేది సంస్కృతంలో అవ్యయంగాను, అకారాంత పుంలింగంగాను ఉంది. ఏ నిఘంటువు తిరగవేసినా దీనికి ముందుకు వెళ్లు, కదలు, బయలుదేరు, పోటీ, జీవితంనుంచి విరమించు, ఉపవాసంతో మరణంకోరు, ప్రధానమైన ప్రధానభాగం, పెద్దభాగం, వయస్సు మొదలయిన అర్థాలు కనిపిస్తాయి. అవ్యయం అయినప్పుడు ప్రాచుర్యం తరచు అనే అర్థాలున్నాయి. ప్రాయోభూమ్న్యన్తనమనే – అని అమరకారుడన్నాడు. భూమ్ని అంటే బాహుళ్యం అంతగమనం. అంటే మరణార్థం ఆహారం మానివేయడం అన్నమాట.

ఈ ప్రాయశబ్దం సమాసంలో ఉత్తరపదం అయినప్పుడు అంటే చివరిదయినప్పుడు సదృశుడు, సమానుడు, సదృశం, సమానం అనే అర్థాలు వస్తాయి. గత + ప్రాయ = చాలవరకు పోయినట్టే. జిత + ప్రాయం = చాలవరకు గెలిచినట్టే. తృణ + ప్రాయం = గడ్డిపరకతో సమానం. సిద్ధి + ప్రాయం = శిక్షతో సమానం, శిక్షపడినంత అవమానం.

ఇక ప్రాయశ్శబ్దం పూర్వపదంగా ఉన్న సమాసాలు ఎన్నో. ప్రాయ + ఉపశమన = ప్రాయోపగమన – మృత్యువును కలుసుకోవడానికి వెళ్లడం, మరణాన్ని కోరుకోవడం, ప్రాయోపయోగిక = మరణాన్ని ఎదురుచూస్తూ ప్రశాంతంగా కూర్చోవడం, ప్రాయోపవిష్ట = మరణం కోసం ఎదురుచూస్తూ కూర్చున్నవాడు. ప్రాయోపకేశ – ప్రయోపవేశన = ఆహారంమాని మరణంకోసం ఎదురుచూడడం. ఇలా ఎన్నో పదాలు.

"నీ డబ్బు నాకు తృణప్రాయం. ఏమనుకొన్నావో!" అంటాడు పంతంతో మాట్లాడే పెద్దమనిషి. "ఈ ప్రపంచం బుద్బుదప్రాయం. ఎప్పుడు ఆరిపోతుందో ఎవరికి తెలుసు?"

అంటాడు వేదాంతవేత్త. "తిరువల్లిక్కేణిలో ఉన్న కోయంబత్తూరు కృష్ణయ్యర్ హోటల్ బాదాంహల్వా అమృతప్రాయం" అంటాడు నిరంతర హోటల్‌భోక్త. "గార్దభప్రాయుడండీ వాడు, వాడికేపనీ చెప్పకండి" అని శాసిస్తాడు, కోపగించిన యజమానుడు. "ఏమని గోడు పోసుకోమంటారు పిన్నిగారూ! గుట్టుగా పడి ఉన్నాను. ఆయన నపుంసకప్రాయుడు. ఎవరితో చెప్పుకోమంటారు?" అంటుంది పతి సుఖంలేని ఇల్లాలు.

పైన చెప్పిన వాక్యాలన్నింటా ప్రాయశబ్దానికి సదృశ, సమాన అని అర్థం.

ప్రాయశబ్దం ఉత్తరపదంలో ఉండడంవల్ల. మరి 'ఒకసూర్యుడు' సీరియల్‌లోని 'తపోప్రాయుడు' అనే పదానికి అర్థమేమిటో?

తపస్ + ప్రాయుడు = తపఃప్రాయుడు అని అవుతుంది. సకారాంత పదాలకు ప, ష, క, ఖ లు పరమయినప్పుడు తపస్ + పీఠం = తపఃపీఠం, తపస్ + ఫలం = తపఃఫలం, తపస్ + కాలం = తపఃకాలం, తపస్ + ఖండం = తపఃఖండం (తపస్సులో ఒకభాగం) అని రూపాలు ఏర్పడుతాయి.

తక్కిన వర్ణాలు పరమైనప్పుడు తపస్‌లోని సకారం ఓగా మారుతుంది. తపస్ + గతి = తపోగతి. తపస్ + జ = తపోజ– తపస్సుతో జన్మించినవాడు. తపస్ + దాన = తపోదాన – తపస్సును దానం చేయడం. తపస్ + ద్యుత = తపోద్యుత – తపస్సు వల్ల కలిగిన కాంత. తపస్ + ధన = తపోధన – తపస్సే ధనంగా గలవాడు – గొప్పతాపసి. ఇటువంటిదే తపోబలం.

శ, ష, స లు పరమైనప్పుడు దుతపస్‌లోని సకారం విచిత్రంగా మారుతుంది. తపస్ + శరీర = తపశ్శరీర – తపస్సే శరీరంగా గలవాడు – తపోమయుడు. తపస్ + సంపద = తపస్సంపద – తపస్సధనం. తపస్ + షట్కం = తపష్షట్కం– ఆరు తపస్సులు. శ షలు పరమయినప్పుడు ఉత్తర వర్ణాలయిన శ షల రూపం పొందుతుంది. తపస్‌లోని సకారం.

ఈ ప్రక్రియతో చూచినా – అర్థం సంగతి ఎలా ఉన్నా, తపస్ + ప్రాయుడు = తపఃప్రాయుడు అని ఉండాలి. తపస్సుతో సమానుడయ్యాడు అక్రూరుడు అని అర్థమా? రచయిత్రి ఉద్దేశం అక్రూరుడు తపోమయుడు – తపోమూర్తి, మూర్తీభవించిన తపస్సు అని చెప్పడమేమో – అని భావిస్తే అప్పుడు తపోప్రాయుడు అనకుండా తపోమయుడు, తపోమూర్తి అని ప్రయోగించేవారనుకుంటాను.

ఎంత ఆలోచించినా, తపో(ప్రాయుడు అనేది అర్థం కాలేదు. అక్రూరుడు తపస్సంపన్నుడు, లేక తపోమయుడు అని కృష్ణుని ఉద్దేశమయి ఉండాలి. ఇలాంటి మహానుభావుడు దివ్యలోకాలకు వెళ్లడానికి అర్హుడని భావమేమో!

ఏమైనా తపో(ప్రాయుడైనాడు అనేది శబ్దసాధుత్వ దృష్టితో చూచినా, అర్థానుగతితో చూచినా కచ్చితమైన అపశబ్దం. అనువాదకులు దీనిని సవరించి వ్రాస్తే పాఠకులకు రచయిత భావం సుబోధమయ్యేది. మూలం ఒక భాషలో ఉంటే, దానిని అనువదించేవారు తమ భాషామర్యాదకు అనుగుణంగా మార్చుకోవడం ఉచితం

సంస్కృతపదాలు వివిధ(ప్రాంతాలలో, వివిధరీతుల అర్థాలలో ప్రయుక్తమవుతున్నాయి. హిందీవాళ్లు సంస్కృతపదాలను మార్చడంలో సర్వస్వతంత్రులు. ఎందుకంటే, వారు రాముడు పుట్టిన దేశం వారు గనుక మచ్చుకు ఒక పదం - శ్రాప్. ఇది శాప అనే సంస్కృతపదంనుంచి వచ్చింది. మూలపదంలో లేని రేఫంచేరి శ్రాప్ అయింది. ఈ రేఫం ఎక్కడినుంచి, ఎప్పుడు, ఎందుకు, ఎలా వచ్చిందో, బహుశా వాళు దీనిని శ్రాద్ధం అనే పదంనుంచి తీసుకున్నారేమో!

శ్రాద్ధ శబ్దానికి వారి ఉచ్చారణ శ్రార్ధ. నా పంజాబీ మిత్రుడొకడు నన్ను "పండిత్‌జీ! కల్ హమారే పితాజీ కా శ్రార్ధహౌ హై. అప్‌కో నిమంత్రణ దేరహాహో( ఇష్టపంక్తి మే( భోజన్ కర్నే కేలియే (పండిత్‌జీ, రేపు మా నాయనగారి శ్రాద్ధం. మిమ్మల్ని ఇష్టపంక్తికి భోజనానికి పిలుస్తున్నాను) అన్నాడు.

ఆయనా పండితుడే. శ్రాద్ధంలోని ద్ధ కారంలో దకు బదులు ర ఎందుకు వచ్చింది? అనడిగాను. శ్రాద్ధం - శ్రార్ధం - అంతే. తప్పేమిటి? అని ఎదురుప్రశ్న వేశాడు. శ్రాద్ధమేగాని శ్రార్ధంకాదు గదయ్యా. ర వర్ణం ఎందుకు? అని మళ్లీ అడిగాను. హిందీలో అంతే అన్నాడు. నీ శ్రాద్ధం అని అనుకుని ఊరుకున్నాను. ఈ సందర్భంలో కబీర్‌దాస్ సూక్తి ఒకటి గుర్తుకువచ్చింది -

పానీకేరా బుల్బులా

ఇస్ మానవకీ జాతి

దేఖతహీ ఖపజాయగీ

జోతరా పరభాతి.

ఈ మానవజాతి– ప్రపంచం నీటిబుడగ వంటిది; చూస్తూచూస్తూ ఉండగానే తెల్లవారిన తర్వాత నక్షత్రాలలాగ మరుగయిపోతుంది. మానవజాతి బుద్బుదప్రాయమన్నమాట.

*****

## పేరులపేరులోన నెంత పెన్నిధి కలదయా?

"పేరులోన నేమి పెన్నిధి గలదయా" అని వేమన అన్నాడు గానీ ఇప్పుడు పేర్లను పలుకడంలో కలుగుతున్న పాట్లను చూస్తుంటే 'పేరులోన నెంతో పెన్నిధి గలదయా, అని సవరించుకోవలసి వున్నది.

మనిషి ఫలానా, ఫలానా సుబ్బయ్య కొడుకు వెంకయ్య అని తెలుసుకొనడానికి మనం పెట్టుకున్న సంకేతం పేరు. అది సరిగా ఉచ్చరించకపోతే వాడే వీడు అనే ప్రత్యభిజ్ఞ రాదు గదా! మట్టితో చేసిన ఒకరకమైన పాత్రను – కడుపు లావుగా ఉండి మూతి చిన్నగా ఉన్న మట్టిపాత్రను కడవ అంటున్నాము. కడవ అనడం వల్ల ఒకవిధమైన పాత్ర జ్ఞాపకం వస్తుంది. కుండ అంటేనో, కుడవ, కడువు అంటేనో అలా జరగదు గదా! కనుక ఒక వస్తువు ప్రతీతి కలుగడానికి దాని పేరును సరిగా ఉచ్చరించాలి. ఇప్పటి పత్రికల పుణ్యమా అని వ్యక్తుల పేర్లు సరిగా అచ్చుకాక, పత్రికారచయితలు సరిగా వ్రాయక జనం తికమకపడిపోతున్నది.

మన ప్రధాని దేవేగౌడగారి పేరే చూడండి. చాలా పత్రికలు దేవేగౌడ అనేది తప్పనుకొని దేవగౌడ అని వ్రాశాయి పాపం! ఇది ప్రాకృత సంప్రదాయంతో ఏర్పడిన పేరు.

ప్రాకృతం తెలుగును, తెలుగు తోబుట్టువులను ఎంతో ప్రభావితం చేసింది. ప్రాకృతంలో అకారాంత ప్రథమా విభక్తి ఏకారంగా మారుతుంది. ఓకారంతంగాను మారుతుంది. రామో, రామే అని శాకుంతులంలో సెంబడివాడు అంటాడు.

సహజేకిల ఏ విణింది ఏ<br>ణహు సే కమ్మ వివజ్జనీ ఆపీ,

పసుమాలణకమ్మ దాలుణే
అణుకంపామిదు ఎవ్వ సొత్తి ఏ

ఎవని సహజవృత్తిని వాడు చేయాలి. అది పాపం కాదు, ఆ పనిచేసేవాడు క్రూరుడు కాదు. శ్రోత్రియుడు – శ్రుతిని అనుసరించి యజ్ఞయాగాదులు చేసేవాడు – పశువులను చంపుతాడు గనుక క్రూరుడే. కాని, దయామయుడు, దయామృదువు – అని దీని అర్థం.

ఈ పద్యంలో దాలుణే, సొత్తి ఏ అనే పదాలు దారుణః, శ్రోత్రియః అనే అకారాంతాల చివరి అక్షరాలు ఏకారాంతాలయ్యాయి. ఈ పద్ధతి కన్నడంలోకి చొచ్చుకుపోయింది. దేవః అనేది దేవే అయింది. గౌడ అంటే రెడ్డి అని, పురప్రముఖుడు అని అర్థం. ఇది రాష్ట్ర – రఠ్ఠ అనే పదం నుంచి పుట్టి, రడ్డ – రడ్డి అయింది. ఇప్పటికీ తెలంగాణాలో రామరడ్డి అని వ్యవహారం ఉంది. పాత శాసనాలలో రడ్డి అని ఉంది.

గౌడ అనేది రెడ్డికి చాలా వరకు సమానార్థకం. తమిళంలో దీనికి సమానార్థకపదం కాండన్. దీనికి అర్థం భూమిని దున్ని బతికేవాడు, భూస్వామి అని. కర్షకుడు అని సారాంశం. గౌడకు బహువచనం గౌ(డరు. కవుండన్ – కౌండన్‌కు బహువచనం కవుండర్ – కౌండర్. ఇప్పటి కేంద్రమంత్రులలో తమిళవర్గంలో ఒక కౌండర్ కూడా ఉన్నారు. అందువల్ల దేవెగౌడ అని కాక దేవేగౌడ అనే అనాలి. రామేగౌడ, లింగేగౌడ ఇలా పేర్లు ఏకాంతంగానే ఉంటాయి. మనకు దేవెగౌడ అంటే విడ్డూరం. కన్నడులకు రామారావు, సుబ్బారావు, సుబ్బారెడ్డి, రామిరెడ్డి, సుబ్బిరెడ్డి అంటే విడ్డూరం.

సుప్రసిద్ధ దేశనాయకుల పేర్లనూ, మనం సరిగా వ్యవహరించడం లేదు. వల్లభభాయి పటేల్ అనేది సరైన పేరు. దీనిని వల్లభాయి పటేల్ అనేవారు. వల్లభుడంటే ప్రియుడు – అంటే గోపికావల్లభుడు – కృష్ణుడు. వల్లభ శబ్దం భకారం అంతంలో ఉండేది. మహాప్రాణభకారం. వల్లభ అని వ్రాయడానికి మారు వల్లబ అని అల్పప్రాణంతో వ్రాస్తున్నారు. ఏమందాం? తంజావూరులో 1938 – 39 ప్రాంతంలో ఇద్దరు ముస్లింసోదరులు ఉండేవారు. జాతీయవాదులు. ఒకరు నల్లనివారు, మరొకరు తెల్లనివారు. నల్లవారిని కరుప్పుభాయి, తెల్లవారిని వళ్ళభాయి అని పిలచేవారు. ఇది తెలియని నేను తెల్లటాయన వల్లభభాయి అని పేరుపెట్టుకున్నారేమోనని అనుకున్నాను. నా మిత్రులు వరదరాజన్ తెల్లనివాడు కావడం వల్ల వళ్ళభాయి అని అంటున్నారని, అది క్రమంగా వల్లభాయి అయిందని నా సందేహం పోగొట్టారు.

ఇలాంటిదే అమితాభ్ బచ్చన్ పేరు. దీనిని అమితాబ్ అని అల్పప్రాణంతో తప్పుగా వ్రాస్తున్నారు. ఇది అల్పప్రాణం కాదు, మహాప్రాణం. అమిత + ఆభ + కలవాడు అమితాభుడు గొప్ప కాంతిగలవాడు. విష్ణు సహస్రనామంలో ఉన్న పేర్లలో ఇదొకటి. అమితాభుడు బుధుని పేర్లలో ఒకటి. అమితాభ్ అతని ఇంటిపేరు చివరకలుపుకొని అమితాభ్ బచ్చన్ అయ్యాడు. ఈయన తండ్రి సుప్రసిద్ధ హిందీ రచయిత హరివంశరాయ్ బచ్చన్ విష్ణుబుద్ధుల పేర్లు కలుస్తాయని ఆలోచించే తన కుమారునికి ఈ పేరుపెట్టి ఉంటాడు. కనుక అమితాభ్ అనే వ్రాయాలిగాని అమితాబ్ అని వ్రాయరాదు.

శ్రీ కణ్ణబిరాన్ ప్రముఖ సంఘ సేవకుడు. ఈయన పేరును కణ్ణాభిరాన్ అని వ్రాస్తున్నారు. కణ్ణ + పిరాన్ = కణ్ణపిరాన్ – కణ్ణబిరాన్. కణ్ణాభిరాన్ కాదు. పిరాన్ అంటే రాజు, దొర, ఆయన భార్య పిరాట్టి అంటే పిరాన్‌కు స్త్రీ లింగం పిరాట్టి. లక్ష్మీ పిరాట్టి, పార్వతి పిరాట్టి వంటిపేర్లు వైష్ణవ మతానుయాయులలో తరచుగా కనిపిస్తాయి.

తెలుగువారికి, తమిళులకు వేల సంవత్సరాలుగా వివాహబాంధవ్యం ఉంది. చాళుక్యులకు – చోళులకూ ఇలాంటి సంబంధాలు ఉండేవి. రాజులు తమ కుమార్తెలను అత్తవారి ఊరికి పంపేటప్పుడు ఆమెతో అరణంతోపాటు దాసదాసీ జనాన్ని, బ్రాహ్మణ కుటుంబాలనూ (సంప్రదాయ పూజాపురస్కారాలకోసం) పంపేవారు. అలా చోళపిరాట్టి – చోళ రాణి – అంటే కాబోయే రాణి – వెంట వచ్చిన బ్రాహ్మణకుటుంబాలలో వాడే నన్నయ్య భట్టారకుడు – కులబ్రాహ్మణుడు. పిరాట్లవారూ అలాటివారే. పిరాట్టి వెంట వచ్చారు గనుక పిరాట్ల రాణుల అనేది ఇంటిపేరుగా మిగిలిపోయింది. ఇలాటిదే రాణీ అనే ఇంటిపేరు.

ఇలాగే మురారిజీ పేరును కూడా మొరార్జీ అని వ్రాసేవారు పూర్వం. ముర + అరి = మురారి. మురాసురుని శత్రువు విష్ణువు. ఇంత మంచి విష్ణువు పేరును మొరార్జీ అని మొర, అర్జీ అనే రోదనార్థం వచ్చేలాగ వ్రాసేవారు. ఆయనతో ఒకమారు ఇంటర్వ్యూ చేసినప్పుడు మురారి + జీ – మురార్జీ అని స్పష్టంగా చెప్పారు ఆయన.

*****

## దర్శకుడు – చూచేవాడా? చూపించేవాడా?

తెలుగు విశ్వవిద్యాలయానికి ఏదో పనిపడి వెళ్లవలసి వచ్చింది. ఒక మిత్రునితోపాటు వెళ్లాను. రిజిస్ట్రారు కార్యాలయంలో ప్రవేశించాను. సుఖాసనాలతో

నిండిన విశాలమయిన గదిలో ద్వారానికి ఎదుట దర్శకులు అని వ్రాసిన ఫలకం కనిపించింది. నా మిత్రుడు దానిని చూచాడు. ఆలోచనలో పడ్డాడు.

ఏం మిత్రమా! దర్శకుడు అనే పదాన్ని చూపించే వాడు అనే అర్థంలో వాడుతున్నారు – ఫలానా సినిమాకు దర్శకుడు (డైరెక్టర్) (మహా) పాపారావు ఇత్యాదిగా. మరి ఇక్కడ ప్రేక్షకులు అనే అర్థంలో వాడారు. సాధువేనా? అని ప్రశ్నించాడు నన్ను.

విశ్వవిద్యాలయం సకల విద్యాపీఠం. మహాపండితులున్నట్టిది. ఇక్కడి సంస్కృతపండితుడు వివిధ విద్వత్పరిషత్తులలో వాక్యార్థాలలో ఆరితేరిన జెట్టి. అలాంటప్పుడు తప్పులకు అవకాశం ఉంటుందా? కొంచెం విచక్షణాజ్ఞానం ఉపయోగించు అన్నాను నవ్వుతూ.

నాకు ఇంతకు ముందు ఈ పదం విషయంలో సందేహం వచ్చింది. శబ్దరత్నాకరం చూచాను. దానిలో దర్శకుడు. సం.వి.అ.పుం = ద్వారపాలకుడు, చూపించువాడు, నేర్పరి – అని అర్థం ఉంది. సంస్కృతవిశేష్యం అకారాంత పుంలింగం అని శబ్దస్వరూప వివరణ. ద్వారపాలకుడు రాజదర్శనానికి, ఇతరుల దర్శనానికీ వెళ్లే వారికి లోపలి దారి చూపేవాడు గనుక దర్శకుడు అయ్యాడు. చలనచిత్ర దర్శకులను గురించి మనకు తెలిసిందే అని నా మిత్రుడు తన వాదానికి నిఘంటుప్రమాణం విసిరాడు.

ఇంటికి తిరిగి వచ్చిన పిదప నా మిత్రుడు పట్టుదలగా శబ్దార్థకల్పతరుః అనే సంస్కృతాంధ్ర నిఘంటువును తిరగవేశాడు. దానిలో దర్శకః అనే మాటకు శబ్దరత్నాకరం చెప్పిన అర్థాలతోపాటు చూచువాడు, ముఖ్యుడు అనే అర్థాలు ఉన్నాయి. మోనియర్ సంస్కృతాంగ్ల నిఘంటువునూ తిరగవేశాడు. దానిలో చాలా అర్థాలున్నాయి.

దర్శక = చూచేవాడు, ఒకదానివైపు చూచేవాడు, ఎదురు చూచేవాడు, పరిశీలించేవాడు అనే కర్త్రర్థకాలతోపాటు ప్రేరణార్థకంలోని అర్థాలూ ఉన్నాయి చూపేవాడు, ఒకదానిని నిర్దేశించి చూపేవాడు, ద్వారపాలకుడు, ఒక రాజుపేరు, ఒక దేశప్రజల పేరు – అనే అర్థాలు ఉన్నాయి.

దర్శనం, దర్శనీయ ద్రష్టా మొదలయిన పదాలెన్నో దృశిర్ ప్రేక్షణే అనే ధాతువునుంచి పుట్టినట్టివే. దృశ్య = చూడదగింది. నాటకంలో చూడదగిన భాగం దర్శనీయం = చూడదగింది. దీనిపైన తమాషా సమాసాలున్నాయి. దర్శనీయ + కాంత

= చూడదగిన – అందమైన భార్యగాని, ప్రియురాలుగాని గలవాడు. దర్శనీయ + సమ = చూడదగిన అందమైన స్త్రీల పట్ల తటస్థంగా మూకీభావంతో – ఉపేక్షతో ఉండేవాడు. దర్శయితవ్య = చూపించదగినది. దర్శనీయం మన్య = తాను చూడదగినవాడినని అనుకొనేవాడు, పండితం మన్యుడిలాగ తాను చూడదగినవాడినని గాని, పండితుడినిగాని అనుకుంటే ఏమి ప్రయోజనం? ఇతరులు గుర్తించాలిగాని.

దర్శయితు + కామ = చూపదలచినవాడు. తనవద్ద మంచిదో, చెడ్డదో సరకో, పాండిత్యమో, కళో ఉంది. దానిని ఇతరులకు చూపాలి. అలాంటి వాడు – చూపదలచినవాడు. దర్శయితా = చూపేవాడు, ద్వారపాలకుడు. దర్శయిత్రీ = ద్వారపాలిక, చూచేమహిళ, దర్శాపిత = చూపించబడింది. ప్రదర్శింపజేయబడింది. దర్శిత = చూపబడింది, వెలుగుకు తేబడింది. దర్శితవత్ = చూపించిన, దర్శిన్ – దర్శీ = చూచేవాడు, చూపించేవాడు. మరొక అపూర్వపదం దార్శ్య = చూపదగింది. దర్శ శబ్దంపై సందేహం ఏ మాత్రమూ రాకుండా ఉండడానికి ఇంత వివరణ అవసరమైంది.

ద్రష్టా అనే మరొకపదం ఉంది. దీనికి కూడా చూచేవాడనే అర్థం. బాగాచూచేవాడు, పూర్వాపరాలు బాగా పరిశీలించి చూచేవాడు. న్యాయస్థానంలో పరిశీలించి నిర్ణయించేవాడు, న్యాయాధీశుడు అని అర్థం. ఈ ద్రష్టా అనే పదాన్ని ఎంతో దూరం ఆలోచించి, సంఘక్షేమాన్ని, ఆధ్యాత్మికచింతనను ప్రబోధించేవారికి మనం పవిత్రంగా వాడుతాం. వివేకానందుడు ఒక గొప్ప ద్రష్ట. అరవిందుడు గొప్పద్రష్ట. సంఘ క్షేమాన్ని ఎంతో భావించి, ఊహించి పథకాలు సూచించిన గాంధీజీనీ ద్రష్టగానే భావిస్తున్నాము.

ఈ సందర్భంలోనే నా మిత్రునికి మరొక సందేహం వచ్చింది – దర్శని అనే మాట సాధువా? దర్శిని అనే మాట సాధువా? అని రెండూ సాధువులే. ఎట్లా అని అంటారు గదూ!

ఈ రెండు పదాలనూ మనం చూపించేది అనే అర్థంలో వాడుతున్నాము. దృశ్ ధాతువుపై ప్రేరణార్థక కర్త్రర్థంలో ణిని అనే ప్రత్యయం అంటే ఇన్ అని మిగిలే ప్రత్యయం వస్తే దృశ్ + ఇన్ = దర్శిన్ – దర్శీ అని అవుతుంది. ఇది నకారాంత పుంలింగ శబ్దం ప్రథమా విభక్తి ఏకవచనం. దీని స్త్రీలింగరూపం దర్శినీ. చూపించేవాడు, దారి చూపించేది అని ఈ పదాల అర్థాలు.

కాని, ఈ రూపానికి పండిత వైయాకరణుల ఆక్షేపణ ఉంది. దృశ్ ధాతువును పాణిని గ్రహ్యాది ధాతువులలో చేర్చలేదు గనుక దృశ్ ధాతువుపై కర్త్రర్థంలో ఇన్ (ణిని) ప్రత్యయం రాదు గనుక దర్శిన్ – దర్శీ అనే రూపం ఏర్పడదు అని. కాని చూపించేవాడు, ప్రదర్శించేవాడు అనే అర్థాలతో దర్శిన్ – దర్శీ అనే రూపం వ్యవహారంలో ఉంది కనుక గ్రహ్యాదులలో దీనిని చేర్చుకుంటే ఇన్ ప్రత్యయం రావడం, దానితో దర్శిన్ దర్శీ అనే రూపం ఏర్పడడం, దానికి ఈ (ఙీప్) ప్రత్యయం వచ్చి దర్శినీ అనే రూపం ఏర్పడడం – గొలుసుగా అన్నీ సాధువులయిపోతాయి. పాణిని తన కాలానికి ఈ రూపం వ్యవహారంలో లేనందున గ్రహించకపోయి ఉంటాడు. అతని కాలంలో లేక, తర్వాత వ్యవహారంలో వచ్చిన వాటికి ధైర్యంగా, వినయంగా వార్తికాలనే పేరుతో కాత్యాయనుడు కొత్త రూపాల సాధుత్వానికి ప్రయత్నించలేదూ? అందువల్ల పండితులు దీనిని పాణిని చెప్పిన గ్రహ్యాదులలో చేర్చి, దర్శయతీతి దర్శినీ అని వ్యుత్పత్తి చెప్పి సాధువు చేశారు. చూపించేది దర్శినీ అయింది.

దర్శిని సాధువయింది. దర్శని ఎలా సాధువు అని ప్రశ్నిస్తారు గదూ! ఒక పాణిని సూత్రం ప్రకారం కరణార్థంలోనూ, అధికరణార్థంలోను ధాతువుపై అన (ల్యుట్) అనే ప్రత్యయం వస్తుంది. దీని చేత చూడబడుతుంది (దృశ్యతే అనేన) అనే అర్థంలో దృశ్ ధాతువుపై కరణార్థంలో అన ప్రత్యయం వస్తే దృశ్ – అన = దర్శన అనే రూపం ఏర్పడుతుంది.

ఈ దర్శన అనే పదానికి చూపడం, చూడడం, ఒకదానివైపు చూడడం, తెలుసుకొనడం, బోధించడం, పరిశీలించడం, గుర్తుంచుకోవడం, గ్రహించడం (మనస్సుతో), చూపు, పరిశీలన, పరీక్ష, ఒకరిని కలుసుకోడం, అనుభవించడం, భవిష్యత్తును చూడడం, ధ్యానించడం, అవగాహన, వివేకం, నిర్ణయం, ఇంద్రియగ్రాహ్యత, భయం, వివేకంతో స్పష్టంగా తెలుసుకొను, అభిప్రాయం, ఉద్దేశం, దృక్పథం, సిద్ధాంతం, ఆధ్యాత్మికపద్ధతి, కన్ను కనిపించడం, తెలియడం, ప్రత్యక్షం కావడం, పోలిక, రూపం, ఆకారం, గోచరించడం, స్వప్నం, రంగు, అద్దం మొదలయినవి ఎన్నో అర్థాలున్నాయి.

ఈ దర్శనం సమాసంలో చేరిన పదాలు ఎన్నో! దర్శన + గృహ = రాజులు గాని, గొప్పవారు గాని దర్శకులను చూచి సంభాషించడానికో, కలుసుకొనడానికో ప్రత్యేకించిన ఇల్లు గది. దర్శన + ప్రతిభూః = కనిపించడానికి – హాజరు కావడానికి బెయిలు. హామీ. దర్శన + ప్రతిభావ్య = కనిపించడానికి హామీ – హాజరు కావడానికి హామీ. దర్శన + భూమి = ఇంద్రియగోచర పరిధి. దర్శన + అగ్ని – దర్శనాగ్ని = చూపునకు కారణమైన దేశంలోని అగ్ని – వేడి. పాఠకుల దృష్టిలో ఈ పదాలు పడితే

ఎప్పటికైనా ప్రయోగావకాశం కలుగవచ్చునని వివరంగా తెలిపాను.

ఈ దర్శన శబ్దంపైన స్త్రీలింగ సూచకమైన ఈ (ఙ్షీప్) ప్రత్యయం వచ్చి దర్శనీ అనే రూపం ఏర్పడుతుంది. దృశ్ + అన = దర్శన + ఈ = దర్శనీ. దీనికీ చూపించేది అనే అర్థం.

కనుక విశాలాంధ్ర దర్శినీ, ఆంధ్రప్రదేశ్ దర్శనీ అనే ప్రయోగాలు రెండూ చూపేది, ప్రదర్శించేది అనే అర్థంలో సాధురూపాలే. కాని – చూచేవాడు దర్శీ. దానికి స్త్రీలింగరూపం దర్శినీ. కనుక చూచేది అనే అర్థంలో మాత్రం దర్శినీ అనే రూపమే వాడాలి. ఎందుకంటే దానికి రెండర్థాలూ ఉన్నా, దర్శనీ అనే శబ్దానికి చూపించేది అని మాత్రమే అర్థం గనుక.

స్పష్టతకోసం మరొకసారి చెప్పనా? చూచేవాడు దర్శీ, చూచేమహిళ దర్శినీ – దర్శిని తెలుగులో దర్శీ తెలుగులో దర్శి. దర్శనీ చూపించే మహిళ. స్త్రీలింగంలో ఉన్న మరొక పదం. చూచేది అనే అర్థం దర్శనికి లేదు. దర్శినికి చూచేది, చూపించేది అనే రెండర్థాలు ఉన్నా, చూచేది అనే అర్థంలో మాత్రం దర్శినీ – దర్శిని అనే వాడాలి.

తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రారుగారి కార్యాలయంలోని దర్శకులు అనే ఫలకం పుణ్యాన మనం చాలా విషయాలు చర్చించుకున్నాం.

*****

## వ్రాబడి అనవచ్చా?

“పలికేదాన్ని పలుకుబడి అంటున్నారు, రాసేదాన్ని ఏమని పిలవాలి? రా‘బడి’ అనాలా?” అని శ్రీ ముసునూరి రామచంద్రమూర్తిగారు, విజయవాడ నుంచి 1996 మే 21న మంగళవారం యువతలో ప్రశ్నించారు.

చాలా చిక్కయిన ప్రశ్న ఇది. పైకి ఏదో యథాలాపంగా, యాదృచ్ఛికంగా వేసినట్టు కనిపిస్తుందిగాని, చాలా గంభీరమయిన ప్రశ్న ఇది.

ప్రతి భాషలోను కృదంతాలు విచిత్రంగా రూపొందుతాయి. సంస్కృత ప్రాకృతాలలో కృదంతాల విషయమై ఉన్న నియమబద్ధత తక్కిన భాషలో కనిపించదు – కనిపించదు అనడంకన్నా మన అవగాహనకు రాలేదు అనడం సహేతుకం.

తెలుగులోను, తెలుగు తోబుట్టువులలోను కృదంతాలు ఏర్పడే ప్రత్యయాలు చాలావరకు సమానంగా కనిపిస్తాయి. బడి, బాటు అనేవి ఇలాంటి ప్రత్యయాలే. ఈ బడి క్రమంగా మతి, మదిగా మారింది. అలాగే బాటు పాటుగాను మారింది. ప్రత్యయాలనేవి ఒకప్పుడు సంపూర్ణపదాలుగా వుండి వాడుకలో అరిగిపోయి సంక్షిప్తరూపాలయినట్టివే.

బడి – పడి ప్రత్యయమూ అగు సంభవించు, యోగించు అనే అర్థాలున్నప్పుడు అనే ధాతువు నుంచి ఏర్పడిందే. దీనిని క్రమంగా భావార్థకంలోనూ, ధర్మార్థకంలోను ప్రయోగించడం సంభవించి ఉంటుంది.

నాకు తెలిసిన ప్రయోగాలను వర్ణక్రమంలో వివరించడానికి ప్రయత్నిస్తాను. ఉరవడి = వేగం, ఉరు వేగార్మికం, దాని ధర్మవాచకం, స్వభావవాచకం ఉరవడి, బడిలోని బవ అయింది. వేగము కలుగు, వేగం సంభవించు, వేగము పుంజుకొను అనే అర్థాలను ఈ బడి సూచిస్తుంది.

ఎగుమతి – దిగుమతి. ఇది కూడా బడి నుంచి రూపొందిందే. తమిళంలో ఏట్రుమతి – ఏట్రుమది – ఎరంగుమతి – ఎరంగుమది. ఏలుబడి = పరిపాలన, ఏలు = పాలించు, ఏలు+బడి = పరిపాలన అనే భావార్థక – ధర్మార్థకరూపం.

కట్టుబడి = నిర్ణయం. తమిళంలో దీనికి గిట్టుబాటు అనే అర్థం. కట్టుబడి ఆగాదు – అయ్యా గిట్టుబాటు కాదండయ్యా. దీనికి పర్యాయం కట్టు + బాటు కూడా తమిళులు వాడుతారు. కాని మనకు కట్టుబాటు = నిబంధన.

కిట్టుబడి – గిట్టుబడి, కిట్టుబాటు – గిట్టుబాటు అనే మాటలు మనకు వ్యాపారంలో లాభానికి సంబంధించినట్టివి. వ్యాపారి తన సరకు అమ్మేటప్పుడు పెట్టుబడి పైన తన ప్రవృత్తిని బట్టి ఎంతో కొంత లాభం నిర్ణయించుకొని అమ్ముతాడు. ఆ లాభం పరిమితికి అటూఇటూగా అమ్మకం ఉంటే గిట్టుబడి – గిట్టుబాటు. లేకపోతే అమ్మడు. గిట్టుబడి – గిట్టుబాటు కాదుబాబూ – అంటాడు. ఈ వ్యాపారంలో వ్యయమయ్యేది కొట్టుబడి – అంటే నష్టమన్నమాట.

చచ్చు + బడి = శరీరంలోని అవయవాలు అజ్ఞాతమైన వ్యాధితో నీరసించి శక్తిహీనం కావడం. ఒకప్పుడు అందరికీ ప్రత్యక్షంగా తెలిసిన వ్యాధితోను అవయవాలు చచ్చుబడిపోతుంటాయి. అతనికి పక్షవాతం వచ్చి కాళ్లు చచ్చుబడిపోయాయి. నడవలేడు

– అంటారు ఈ చచ్చుబడి పూర్తి మరణం కాదు – మరణసదృశం. చేతబడి = మనకు శత్రువులయిన వారికి అహితం కోరుతూ చేసే అభిచారక్రియ. మానవుడు పుట్టినప్పటి నుంచి ఇలాంటి ప్రతిక్రియాసాధన కృత్యాలు జరుగుతూనే ఉన్నాయి. ఇలాంటి మంత్రాలు ఉండడం వల్ల కొందరు అథర్వవేదాన్ని వేదంగా ఒప్పుకోరు. మనం ఇష్టం కానివి ఉన్నంతమాత్రాన అది వేదం కాకపోదు. వేదం అనేకకాలాల, అనేక సంఘాల, అనేకజాతుల, అనేకదేశాల, అనేకానేక ప్రాంతాల సాంఘికచరిత్ర, భౌగోళికచరిత్ర అని నా విశ్వాసం. అలాంటప్పుడు మనకు ఇష్టం ఉన్నవే వాటిలో ఉండాలని లేదు గదా.

చేరుబడి = సారూప్యం, చిక్కుబడి = చిక్కుకోడం, తీరుబడి = తీరిక ఏం సార్? తీరుబడిగా పేపరు చదువుతున్నారు. ఇవాళ ఆఫీసుకు సెలవా? – అంటూ ప్రశ్నిస్తారు సాటి ఉద్యోగిని మిత్రులు.

దిగుబడి – దిగుమతులకు మూలం ఒకటయినా, క్రియ అంటే పని కూడా ఒక్కటయినా అర్థం వేరు. దిగుమతి ఒక ప్రాంతం నుంచి వేరొక ప్రాంతానికి సరకులు రప్పించుకోవడం, దిగుబడి పంటలు ఎక్కువగా పండడం. మా ఎరువులు కొనండి. పంట దిగుబడి – ధాన్యం దిగుబడి ఇనుమడిస్తుంది – అనే వ్యాపారప్రకటనలను మనం ప్రతిదినమూ రేడియోలోను, టీవీలలోను వింటూనే ఉంటాము.

పట్టుబడి = ఒకదానిపై గట్టి అధికారం, పట్టు. పుట్టుబడి = పుట్టుకరూపరేఖా విలాసాలు, ఈ అబ్బాయిది మంచి పుట్టుబడోయ్! మంచి పుటక సుమా అతనిది అంటారు – శరీరసౌష్ఠవం గలవారిని చూసి. పుట్టుక పుటక అయింది.

పెట్టుబడి = మూలధనం, పరిపణం, నీవీ పరిపణో మూలధనం – అని అమరం పర్యాయపదాలిస్తున్నది. వేదాంతదేశికుల వారు ప్రజలు సన్మార్గులు కావడానికి సుభాషితనీవీ అనే గ్రంథం రచించారు. మానవుడు ఉత్తముడు కావడానికి పెట్టుబడి వంటిదన్నమాట ఈ సుభాషితపుంజం. వ్యాపారానికి డబ్బు ఎలా పెట్టుబడో, మానవుడు సన్మార్గగామి కావడానికి పెద్దల హితబోధలు పెట్టుబడి.

మొక్కుబడి = ప్రార్థన, నిజానికి ప్రార్థన చేయవలసింది. విధిగానే చేయవలసింది. కానీ, దీని అర్థం వ్యవహారంలో భ్రష్టుపట్టిపోయింది. ఏదో మొక్కుబడిగా కాపురం చేస్తున్నాడు, ఏదో చదువు, మొక్కుబడిగా అని ఈసడించుకుంటారు. విధిగా చేయవలసిన

పనిని విధిలేక ఎందుకు వచ్చిందా భగవంతుడా అని విసుక్కుంటూ చేయడం అనే అపార్థానికి గురయింది.

పోబడి = జాడ, రా+బడి = రాబడి ఆదాయం, పోబడికి వ్యయం అనే అర్థం ఉండాలి. కాని, పోయే పద్ధతి, పోయే తీరు అనే అర్థాలలో కనిపిస్తుంది, పోయే తీరే జాడ.

రాబడికి వచ్చుబడి అనేది పర్యాయం. దక్షిణ సరిహద్దులలో తమిళప్రభావంతో వరుమానం అనే వ్యవహారమూ ఉంది. ఈ వరుమానం కావ్యాలకు ఎక్కింది. వరుమానం సాదృశ్యంతో బిగుమానం లాంటి మాటలూ పుట్టాయి. బిగుమానం = బింకం. ఏదే నీ బిగుమానం, అంతగా అడుక్కుంటుంటే (బతిమాలుతుంటే) అల్లుడు – అంటుంది అలిగిన కూతుర్ని తల్లి.

రాలుబడి = ధాన్యం గింజలు ఎక్కువగా పండడం. ఈ సారి రాలుబడి తక్కువయిందండి. గుత్తపూర్తిగా ఇచ్చుకోలేమండి అంటాడు సాయకారీ భూస్వామి చేను సాగుచేస్తున్న రైతు. పట్నంలో ఉద్యోగం వెలగబెట్టాలి, పల్లెలో పంటా భోంచేయాలి అని సాయకార్ భూస్వామి అనుకోడం ఏం న్యాయమని రైతుల ఇంగితం.

ఇలా బడితో ఎన్నో మాటలు ఉన్నప్పుడు పలుకుబడిలాగ వ్రాయిబడి, వ్రాతబడి, వ్రాబడి అనే రూపాలు ఎందుకు ఉండరాదు అనడం సహేతుకమే. ఇప్పుడు రాగా మారిన లేఖనార్థకమయిన ధాతువు వ్రా ప్రాచీనరూపం వరయు అని అయివుంటుంది. ఎందుకంటే కన్నడంలో వర, బర వ్రాయికి సమానవాచకాలు. బరహ, బరపణికె, బరా = వ్రాత, బరప్రా అయింది. తెలుగులో అంటే దానినుంచి పుట్టిందని కాదు. కూరంగు = క్రోతి, మరం = మ్రాను, ఊరంగల్ = రోలు– రోకలి అనే తీరుగా బరవ్రా అయింది.

తెలుగు వ్రాతకు వ్రాయి, వ్రాయసం, వ్రాలు అనేవి పర్యాయాలు. వ్రాయసం ఇంటిపేరు గలవారు తెలుగుదేశంలో నేటికీ ఉన్నారు. వ్రాయసం, రాయసం అయింది. రాయసం వెంకటశివుడుగారి తెలుగు వాచకాలు నా చిన్నప్పుడు పాఠ్యపుస్తకాలుగా ఉండేవి. వ్రాలు కూడా వ్రాతకు పర్యాయమయినా, అర్థచ్ఛాయతో సంతకం అనడానికి వ్యవహారమయింది. వ్రాతకాదు, వ్రాయసకాడు = మంచిలేఖకుడు.

నా చిన్నప్పుడు నా దస్తూరీ చాల అందంగా ఉండేది. పత్రికలో చేరి వేగం ప్రధానం కావడం వల్ల బరబరబ బరకడం వల్ల చెడిపోయింది. నా ఓనమాలు గురువు చల్లా సుబ్బారాయుడుగారు "చిన్నస్వామి వ్రాయిబడి అందంగా ఉంది" అని మా పెద్దలవద్ద మెచ్చుకోడం నాకు గుర్తుంది. ఆయన వ్రాయిబడి అని ఏ ప్రమాణంతో అనేవాడో నాకు తెలీదు. వ్రాయిబడి. వ్రాలుబడి అని వ్యవహారంలో ఉండేదేమో! వ్రాయిబడి – వ్రాతబడి = వ్రాలుబడి అంటే వ్రాతతీరు అని అర్థం. దీనికి ప్రయోగం వ్యవహారంతో ఇతరప్రాంతాలలో ఉండేమో నాకు తెలీదు.

కాని, పైన చూపిన రూపాల సాదృశ్యంతో వ్రాలుబడి, వ్రాయిబడి, వ్రాతబడి అనే రూపాలు కావడానికే అవకాశం ఉంది. ప్రతి భాషలోను సాదృశ్యంతో రూపాలు ఏర్పడకపోవచ్చు, ఏర్పడి తీరాలనే నిర్బంధం లేదు. సంస్కృతవైయాకరణులైతే కొన్ని సూత్రాలవల్ల ప్రయోగంలో లేని సూత్రాలను సాధిస్తారు. కాని తెలుగుకు "సిద్ధిర్లోకాద్ధృశ్యా" కదా! ఇలాంటి ప్రయోగాలు వ్యవహారంలో ఏ ప్రాంతంలో, ఏ వర్గంలో ఉన్నా గ్రాహ్యాలే.

కృత్రిమంగా, వ్యాకరణ బలంతో రూపాలు సృష్టించబడమంటే మా ఉర్దూ హజరత్ గారు గుర్తుకు వస్తారు. ఆయన ఫారసీ వ్యాకరణాన్ని హిందీకీ అన్వయించి కొత్తరూపాలు సృష్టించేవారు. మందిర అంటే దేవాలయం. దానికి ఫార్సీ వ్యాకరణంతో ప్రథమపురుష బహువచనం మనాదిర్ అని వాడేవారు. ఇదేమిటి హజరత్, హిందీ వ్యాకరణం ప్రకారం మన్‌దిరే బహువచనమూ మన్‌దిరే అనే అంటే ఆయన మస్‌జిద్ (మసీదు) ఏకవచనం, మసాజీద్ బహువచనం అనేవారు. ఫార్సీవ్యాకరణం ప్రకారం మస్‌జిద్ అనే పదంలోని సకారానికి బహువచనంలో ఆకారం వచ్చి. మసాజిద్ అవుతుంది. అలాగే ఆ సాదృశ్యంతో మన్‌దిర్ అనే ఏకవచన పదంలోని నకారానికి దీర్ఘం వచ్చి మనాదిర్ అని అవుతుంది – అని వివరించేవారు.

సంస్కృత, ప్రాకృత, ఫార్సీల వంటి ప్రాచీనభాషలలో వ్యాకరణాన్ని బట్టి కృత్రిమపదాలు సృష్టించవచ్చును గాని, వ్యవహారభాషలలో అలా కాదు, అధికసంఖ్యాకులయిన వారి నోళ్ల నానినవే స్థిరపడుతాయి.

*****

# వివేకవర్ధని... వివేకవర్థిని...?

ఇటీవల నాకొక జిజ్ఞాసువు ఒక లేఖ వ్రాశాడు. సంతకం జిలుగు జిలుగుగా ఉన్నందున జిజ్ఞాసువు పేరు గుర్తించలేకపోయాను.

ఉత్తరంలోని విషయమిది. "అయ్యా వివేకవర్థినీ, వివేకవర్ధనీ అనే పదాలలో ఏది తప్పు, ఏది ఒప్పు? వీరేశలింగం పంతులు గారు ప్రారంభించిన పత్రికలలో ఒకదాని పేరు వివేకవర్ధని అని కొందరు, వివేకవర్థిని అని కొందరు వ్రాస్తున్నారు. కనుక ఏది వీరేశలింగంగారు పెట్టిన పేరో తెలియడం లేదు. అలాగే అర్ధశతాబ్ది క్రితం సురవరం ప్రతాపరెడ్డిగారు స్థాపించిన ఒకసాహిత్య సంస్థ పేరు విజ్ఞానవర్థినీ పరిషత్తు.

"ఇక జాతకాలు వ్రాసే సిద్ధాంతులు జాతకం మొదట్లో

జననీ సర్వసౌఖ్యానామ్
వర్ధనీ కుల సంపదామ్
పదవీ పూర్వ పుణ్యానాం
లిఖ్యతే జన్మపత్రికా

అనే శ్లోకం వ్రాస్తారు. ఈ జన్మపత్రిక – జాతకం వ్రాస్తున్నాము. ఇది సర్వసౌఖ్యాలకూ జనని. కులసంపదాం వర్ధనీ కులసంపదను వృద్ధిపొందించేది. పూర్వజన్మపుణ్యాలకు దారి అని ఈ శ్లోకం అర్థం. దీనిలో వర్ధన్ అనే మాట ఉంది. మరి ఏది సాధువు వర్ధనీయా? వర్థినీయా? వివరించగలరు."

రెండింటికీ ప్రయోగాలు కనిపిస్తున్నాయి కనుక రెండూ సాధువులేనని నాకు తోచింది. అయినా ఎందుకయినా మంచిది అని అడిగిన జిజ్ఞాసువు హృదయపూర్వకంగా అడిగాడని నమ్మకం కలిగి, మనస్సులోనే చర్చించుకున్నాను.

వివేకం+వర్ధయతిః వివేకాన్ని పెంపొందించేది అనే అర్థంలో వివేక వర్ధన అనే రూపం ఏర్పడుతుంది. ప్రేరణార్థకమయిన వృధ్ ధాతువుపై ల్యు అనే ప్రత్యయం వస్తే అది అన అని మిగులుతుంది. వృధ్ + ల్యు (అన)ః వర్ధన అనే రూపం ఏర్పడుతుంది. ఇది వివేకాన్ని వృద్ధి చేయవచ్చు. ఆనందాన్ని వృద్ధి చేయవచ్చు. రాముడు అరణ్యవాసం తర్వాత అయోధ్యకు తిరిగివచ్చినప్పుడు కైకేయ్యానందవర్ధనః అని ప్రయోగించాడు. రాముడు తిరిగి వస్తే కైకేయికి ఆనందమేమిటి? అని కొందరు శంకించగా, కైకేయి భరతుని ప్రవర్తన వల్ల పశ్చాత్తప్తురాలై రాముని యెడల వాత్సల్యం పెంచుకుంది అని

వ్యాఖ్యానించారు. కాని వృధ్‌ధాతువుకు ఛేదనం అనే అర్థం ఉంది కనుక కైకేయి ఆనందాన్ని పోగొడుతూ అని అర్థమని మరికొందరన్నారు. ఏమైతేనేం 'వర్ధన' అనే రూపం ఏర్పడింది. దీనికి స్త్రీ లింగరూపం వివేకవర్ధన + అ = వివేకవర్ధనా అని ఏర్పడుతుంది. తత్సమీకరణ పద్ధతి వల్ల తెలుగులో వివేకవర్ధన అవుతుంది. ఈ విధంగా వివేకవర్ధన అనే రూపం స్త్రీలింగంలో ఏర్పడుతుందే కాని వివేకవర్ధని కాదు.

ఇక వర్ధినీ అనే పదం సంగతి చూద్దాం. ప్రేరణార్థకమయిన వృధ్‌ధాతువుపై కర్త్రర్థంలో ణిమి (ఇన్) అనే ప్రత్యయం వచ్చినప్పుడు వృధ్ + ఇన్ వర్ధిన్ అనే రూపం ఏర్పడుతుంది. ఈ శబ్దం ప్రథమావిభక్తి ఏకవచనరూపం వర్ధీ. ఇది నకారాంత పుంలింగ వాచకం. దీనికీ స్త్రీవాచకసూచకమయిన ఙీప్ ఈ ప్రత్యయం చేరితే వర్ధిన్ + ఈ = వర్ధినీ అవుతుంది. దీనికి వివేకశబ్దంతో సమాసం చేసినప్పుడు వివేక్ + వర్ధినీ = వివేకవర్ధినీ అనే రూపం ఏర్పడుతుంది. హితకారిణీ, ఆనందవర్షిణీ లాగ. తెలుగులో వివేకవర్ధిని అని అవుతుంది.

ఈ చర్చవల్ల వివేకవర్ధన, వివేకవర్ధినీ అనే రూపాలేకాని, వివేకవర్ధనీ అనే రూపం ఏర్పడడానికి వీలులేదని స్పష్టం.

కాని, వర్ధనీ అనే మాట సాహిత్యంలో ప్రచురంగా ఉంది. సూర్యరాయ నిఘంటువు వర్ధనీ అనే పదాన్ని గ్రహించి దానికి చీపురుకట్ట, పాడె, శవదహనం, మూతి సన్నగా ఉండే పాత్ర – జారీ అనే అర్థాలు ఇచ్చింది. వర్ధన అనే స్త్రీలింగ పదాన్ని ఈయలేదు. వర్ధినీ అనే రూపాన్ని స్పృశించలేదు.

ఇంత ప్రచురంగా ఉన్న వర్ధని అనే పదం అసాధువు ఎలా అవుతుంది. దీని సాధుత్వానికి వైయాకరణులు మార్గం అన్వేషించారు. కరణానిధి కరణయోశ్చ కరణార్థంలోను, అధికరణార్థంలోను ధాతువుపై ల్యుట్ అనే ప్రత్యయం వస్తుంది– అని ఈ సూత్రానికి అర్థం. వర్ధ్యతే, వర్ధతే = దీనిచే వృద్ధి పొందింపబడుతుంది. దీనిచే వృద్ధిపొందుతుంది అనే అర్థాల్లో వృధ్ ధాతువుపై ల్యుట్ ప్రత్యయం వచ్చినప్పుడు వృధ్ + అన = వర్ధన అనే రూపం ఏర్పడుతుంది. ల్యుట్ ప్రత్యయంలో టకారం ఉండడం వల్ల స్త్రీలింగ రూపం కావడానికి చేరే ఙీప్. ఈ ప్రత్యయం చేరి వర్ధనీ అనే రూపం ఏర్పడుతుంది. వివేక్ + వర్ధనీ అని రూపం ఏర్పడుతుంది. వివేక్ + వర్ధనీ = వివేకాన్ని వృద్ధింపచేసేది అనే అర్థంలో సమాసమై వివేకవర్ధనీ అనే రూపం ఏర్పడి, తెలుగులో వివేకవర్ధని అని మిగిలింది అని నిర్ణయించారు. ఇప్పుడు వర్ధనీ కులసంపదాం = అనే

శ్లోక పాదంలోని వర్ధనీ పదమూ, వివేకవర్ధనీ అనే సమాసంలోని వర్ధనీ పదమూ ఒప్పే అని మనకు విశ్వాసం కలిగింది.

ఆ జిజ్ఞాసువు పుణ్యాన మనం వివేకవర్ధనీ, వివేకవర్ధనా అనే పదాలు రెండూ సాధువులేనని తెలుసుకున్నాము. వీటిని నిస్సంకోచంగా వాడుకోవచ్చు.

విచిత్రం ఏమిటంటే సంస్కృతనిఘంటువులలో వర్ధనీ పదమే గాని వర్ధిని లేకపోవడం, వర్ధనీ అనే దానికి మామిడి వెంకటార్యుని శబ్దార్థ కల్పతరువులో సమ్మార్జనీ చీపుర్చ, సనాలజలపాత్రే జారీ చెంబు ఖత్యామ్ బలపము అనే అర్థాలున్నాయి. వర్ధినీ అనే పదమే లేదు. వర్ధన శబ్దానికి ఉప్పొంగు, ఉరదించు, ఏచు, ఏపారు, మెండుకొను, రెచ్చు, నరకు, వృద్ధిపొందు అని ఎన్నో అర్థాలున్నాయి.

*****

## పానంకీ ఛల్లగా తండా కోకో కోలా!

రెండు వారాల క్రితం నేను రాయచూరు వెళ్ళాను, బంధువుల పెండ్లికి. వికారాబాద్ జంక్షన్ వచ్చింది. రైలు ఆగగానే దూసుకుని రైలు పెట్టెలోకి వచ్చారు ఫలహారాల వాళ్ళు, శీతల పానీయాల వాళ్ళు, పళ్ళు అమ్మేవాళ్ళూను. "పానంకీ ఛల్లగా తండా కోకోకోలా" అంటూ ఒకడు బకెట్ నిండా కోకోకోలా సీసాలతో ప్రత్యక్షమయ్యాడు. "పానంకీ ఛల్లగా" అని నిమిషానికి పదిసార్లు అరుస్తున్నాడు.

ఆ అరుపులు వింటూంటే ఇతడేనేమో నేటి పత్రికల వ్యాకరణానికి పాణిని అనిపించింది. చేతిలో తెలుగు పత్రికను యథాలాపంగా తిరగవేశాను. ధర్మభిక్షంకు 20 వేల మెజారిటీ. మరికొన్ని అసెంబ్లీ నియోజకవర్గాలలో ముందంజ – అనే శీర్షికలు కనిపించాయి. వాటిని చూసిన తర్వాత వికారాబాద్ శీతల పానీయ విక్రేతే పత్రికల వైయాకరణుడని నిశ్చయం కలిగింది – మునుపటి ఊగిసలాట పోయి.

శ్రీ ధర్మభిక్షం వార్త చదువుతుండగా ధర్మభిక్షం అనే ప్రయోగాంతరమూ కనిపించింది. ఇది అచ్చం పానంకీ చల్లగాకు సరిపోయింది.

కి కు యొక్క లో లోపల – అనే షష్ఠీ విభక్తి ప్రత్యయాలు. ఇవి ఒక నామవాచకానికీ – కర్తకు మరొక దానితో ఉన్న సంబంధాన్ని తెలుపుతాయి. పై ప్రత్యయాలలో యొక్క చాలా మందికి గిట్టదు. అది గొడ్డు గ్రాంథికమని వారి నమ్మకం. లో లోపల అనే ప్రత్యయాలను ఆధునికులు చాలావరకు సప్తమీ విభక్త్యర్థంలో వాడుతున్నారు. అందు, ఇందున అనేవి సప్తమీ విభక్తి ప్రత్యయాలు. ఇంటియందు అనే సప్తమీ విభక్తి సహిత పదానికి ఇంట్లో అని వ్యవహార భాషా ప్రయోగం. ఇక మిగిలినవి కి, కు అనే ప్రత్యయాలు.

ఈ కి, కు లను సరిగా ప్రయోగించవచ్చుగదా! ధర్మభిక్షంకు, ధర్మభిక్షానికి అని అవుతుంది. భిక్షానికి అనేది కొంచెం ఎబ్బెట్టుగా తోస్తే భిక్షంగారికి అని వాడవచ్చు. భిక్షంకు, భిక్షంకి కర్ణసుభగంగానూ లేవు, వ్యాకరణ విరుద్ధాలు అనే సంగతి గాలికి వదిలినా.

ఇలాంటివే రామంకు ఏమీ తోచలేదు. రామంకి చప్పున తోచింది మొదలయినవి గ్రాంథికమైతే రామునికి, రామునకు వ్యవహార భాష అయితే రామానికి– అని సులభంగా వ్రాయవచ్చు.

“ధర్మభిక్షంకు, రామంకి వంటివి వ్రాస్తున్నారు. వ్యాకరణవిరుద్ధం అని నేను ఒక పత్రికాప్రతినిధితో అన్నాను. “భలే చెప్పారు. ఇప్పటి జర్నలిజంలో సంక్షిప్తత, తద్వారా సమయం, పొదుపు ముఖ్యమండి. ధర్మభిక్షంకు అని వ్రాశామనుకోండి రెండక్షరాలు పొదుపు అవుతాయి. దీనివల్ల ఎంత సమయం కలిసివస్తుందో ఆలోచించారా? యంత్రయుగంలో సంక్షిప్తత, పొదుపు అతిముఖ్యమైనవి. వాటిని దృష్టిలో పెట్టుకుని ఆలోచించండి” అన్నారు. నేను ఆయనను చూస్తూ, ఆయన మాటలు వింటూ నిలబడ్డాను అవాక్కయి.

సప్తమీ విభక్తి ప్రత్యయాలు అందు, ఇందున అనే వాటిలో అందు, ఇందు అనేవి వ్యవహార భాషలో చాలావరకు మరుగైపోయాయి. న ప్రత్యయం లకారమయి మాయిండ్ల+లోన= యిండ్లల్ల అని వ్యవహారంలో కనిపిస్తుంది. కొన్ని ప్రాంతాలలో ఈ సప్తమీ విభక్తికి తావున చేరింది. మా యిందుకు మారుగా మా తావున అని ప్రయోగాలు కానవస్తున్నాయి. వ్యవహారంలో ఈ తావు క్రమంగా ఉచ్చారణ వేగంలో తాన అయింది మాతాన, మీతాన, ఎవరితాన ఇత్యాదిగా.

పంచమీ విభక్తి ప్రత్యయాలలో నుండి ఒకటి. దీనికి వ్యావహారిక పర్యాయం నుంచి ఎక్కడ నుంచి వచ్చినావు? ఎక్కడి నుంచి వచ్చావు? అనే వాక్యాలలోని ఎక్కడ

నుండిలో ఎక్కడ+ఉండి అనే రెండు మాటలున్నాయి. అలాగే ఎక్కడన్ + ఉంచి పూర్వపదమైన ఎక్కడన్‌లోని నకారం ఉత్తరపదంలోని ఉంచిలోని ఉ తో చేరిపోయి నుండిగా విడిపోయి ప్రత్యయరూపమయింది. నుంచి అనేది ఇలాగు విడిపోయినట్టిదే. ఎక్కడన్ + ఉండి ఉంచి = ఏ ప్రాంతాన ఉండి ఈ ప్రాంతానికి వచ్చావు? అని అర్థం. నిజానికి దీని మూలరూపం ఎక్కడి నుండి వెడలి = అని అయి ఉంటుంది. ఇది వ్యవహారవేగంలో (ఏడికి + వెళ్ళి + ఉండి) ఏడికి వెళ్లి – ఏడ నుండి అయింది. ఒక ప్రాంతం వాళ్ళు ఏడకు ఏడికిలోని చివరి కకారాన్ని వెళ్ళిలోని కకారం కోల్పోయిన నికారానికి చేర్చి ఏడి + కెళ్ళి – ఎళ్ళి = ఏడికెళ్ళి – యాడికెళ్ళి అని గ్రహించగా, మరొక ప్రాంతంవారు ఏడన్ + ఉండి – యాడ నుండి – యాడ నుంచి అని గ్రహించడం వల్ల కెళ్ళి, నుండి, నుంచి అనే ప్రత్యయాలు ఏర్పడ్డాయి. పంచమీ విభక్తి సూచకమైన కెళ్ళి ప్రత్యయాన్ని కవులు ఎందుకు ఆదరించలేదు? యాడికెళ్ళి వస్తున్నవ్? అక్కడికెళ్ళి వచ్చిన అని వ్యవహారంలో మాత్రమే మిగిలిపోయింది. వీటి మూలం ఏడ + వెడలి, ఏడన్ + ఉండి రెండవది. నుండి, నుంచి ఎలా మారిందో చ వర్గ త వర్గాల మార్పు సంస్కృతంలోనూ, జంపతీ – దంపతీ ఇత్యాదిగా కనిపిస్తుంది. తెలుగులో తరచుగా ఉంది. ట వర్గ చ వర్గాల మార్పు వింతే మరి! ఉండు అకర్మకం. ఉంచు సకర్మకం, ఒకడు ఉంటాడు, అతడే మరొక దానిని ఉంచుతాడు. ఒకచోట ఉండి లేక తన ఉనికిని ఒకచోట ఉంచి మరొకచోటికి కదలడం అనే భావప్రకటనలో ఈ ప్రత్యయం పుట్టుకువచ్చిందేమో! కొన్ని ప్రాంతాలలో కేసి అనే ప్రయోగం ఉంది. వాడికేసి చూశాడు. రాధ కృష్ణునికేసి చూసింది ఇత్యాదిగా ప్రయోగాలు. దీనికి వైపు అని అర్థం. కేసి అనే ఆరోపాన్ని తెలుగు అకాడమీ తెలుగు నిఘంటువులోనూ చేర్చామని నాతో ఒకసారి అన్నారు. “ఇది ప్రాంతీయం అయినా, ప్రతి ప్రాంతీయం, మాండలికం నిఘంటువులో చేరితేనే భాషకు సమగ్రత చేకూరుస్తుంది. మంచిపనే” అన్నాను నేను.

“కోటిన్నర మందికిపైగా వ్యవహరిస్తున్న వెళ్ళి అనే పంచమీ విభక్తిని మీ ఆరోపాలలో చేర్చారా?” అని అడిగాను. లేదు అన్నారాయన. “ఇది అన్యాయం కదా!” అన్నాను. “దానికి శిష్యులు ఒప్పుకోలేదు” అన్నారు ఆయన. “కేసిని కూడా మా వైపు శిష్యులు ఒప్పుకోరనుకుంటాను” అని అన్నాను. ఆయన దానికి ఏమి సమాధానమిచ్చేవారో గానీ ఇంతలో ఎవరో వచ్చారు – మా చర్చ ఆగిపోయింది.

భాషాసౌధ భావిస్తంభాలైన యువకుల్లారా! ‘ప్రాణంకి చల్లగా’ వంటి ప్రయోగాలు చేయకండి ప్లీజ్!

*****

# అన్నీ తప్పులేనా?

జాగర్త, జాగ్రత, జాగ్రత్త, జాగారం, జాగ్రదావస్థ అబ్బ! ఇన్ని తప్పుపదాలు ఎలా ప్రచారానికి వచ్చాయో! ఇదివరకే అన్నాను గదా! తప్పు, అసత్యం, అపవాదు వెయ్యి కాళ్లతో పరుగెత్తి అంతటా వ్యాపిస్తాయి. ఇది వాటి స్వభావం. నిజం నిలకడ మీదగాని తెలీదంటారు. చూచారా? నిజం తెలియాలంటే నిలకడ ఏర్పడాలి. నిలకడ అనేది సులభంగా, త్వరగా ఏర్పడేది కాదు.

ఆంధ్రప్రభ తొలినాళ్ల సంపాదకులు నారాయణమూర్తిగారు "జాగ్రతా భయం నాస్తి" అనే శీర్షికతో ఒక సంపాదకీయం వ్రాశారు. పండితులు విరుచుకుపడలేదుగాని చెవులు కొరుక్కున్నారు, గుసగుసలాడారు ఏమిటీ శీర్షిక – అని. ఎందుకంటే, ఈ వాక్యం తెలుగో, సంస్కృతమో, జైనులు ప్రవచించే సమసంస్కృతమో అర్థం కాలేదు.

ఈ విచిత్రశీర్షిక మూలం ఏమై ఉంటుందా అని ఆలోచించాను. ఒక నీతిశ్లోకం చతుర్థపాదం "నహి జాగరతోభయమ్" అనేది ఉంది. బహుశా ఇది అపభ్రష్టమై కొందరి నోళ్లలో పడి 'జాగ్రతా భయం నాస్తి' అని మారి ఉంటుంది. ఇది పై వర్గాలలో ప్రచారంలో లేకపోతే నారాయణమూర్తిగారంతటి సంపాదకులు సంపాదకీయానికి శీర్షికగా వాడరుగదా!

ఇంత వాడుకలో ఉన్నది తప్పెలా అవుతుందని అడుగుతారు గదూ! చిత్తగించండి. సంస్కృతంలో జాగృ అనే ధాతువు ఉంది. దానికి 'నిద్రాక్షయే' అని అర్థం. అంటే నిద్రలేకపోవడం, మేల్కొని ఉండడం అని అర్థం. ఈ జాగృ ధాతువు మీద కర్త్రర్థకంలో అత్ (శతృ) అనే ప్రత్యయం రాగా, జాగ్రత్ అనే రూపం ఏర్పడుతుంది. మేల్కొని ఉండేవాడి భావం అనే అర్థంలో జాగ్రత్ పదంపై తప్రత్యయం చేర్చితే జాగ్రత్+త = జాగ్రత్త అని ఏర్పడవచ్చు. కాని, జాగ్రత్, పఠత్, గచ్ఛత్, అనే శత్రర్థంపై భావార్థక–ప్రత్యయం రాదు. అలా వస్తే జాగ్రత్త, గుచ్ఛత్త, పఠత్త (మేల్కొని ఉండడం, వెళ్లుతుండడం, చదువుతూ ఉండడం) అనే రూపాలు లేవు. అవే భావార్థకంలో వచ్చే త్వ అనే ప్రత్యయంతో ఏర్పడే రూపాలూ లేవు– జాగ్రత్+త్వం = జాగ్రత్త్వం, గచ్ఛత్+త్వం = గచ్ఛత్త్వం, పఠత్+త్వం = పఠత్త్వం వంటి రూపాలు అంటే, శతృప్రత్యయం అత్‌తో ఏర్పడే జాగ్రత్, గచ్ఛత్, పఠత్ వంటి రూపాలకు త, త్వం అనే భావార్థకప్రత్యయాలు చేరడం వ్యాకరణసమ్మతం కాదన్నమాట. ఇలాంటి రూపాలు భాషలో ఉంటే, వ్యాకర్తలు వాటిని గ్రహించి, వాటి రూపనిష్పత్తి వివరించేవారే. మరి జాగ్రత్త అనేది అపశబ్దమని తెలుసుకొన్నాం గదా.

జాగ్రత్తరోయ్! బండికదిలేప్పుడు ఎక్కకు. దిగేప్పుడూ జాగ్రతగా దిగు. బండి పూర్తిగా ఆగేవరకు ఓపిక పట్టు అని హెచ్చరించే మాటలు తరచు మనం వింటూంటాం, పెద్దలు పిన్నలకు చెప్పేవి. జాగ్రత్త అనేమాటే తప్పయినప్పుడు చివరి అక్షరంలో త ఒత్తు లోపించి ఏర్పడే జాగ్రత అనేదీ తప్పే అని చెప్పనక్కరలేదు గదా.

ఈ అపశబ్దాలు ఏర్పడడానికి రెండు కారణాలు కనిపిస్తాయి. జాగ్ర ధాతువుకు లోట్‌లో – అంటే మేల్కొని ఉండు, మేల్కొని ఉండండి, వాడు మేల్కొని ఉండుగాక అని హెచ్చరించడానికి వాడేప్పుడు–మధ్యమ పురుష బహువచనంలో జాగ్రత అనే రూపం ఉంది. జాగృహి = మేల్కొని ఉండుము, జాగ్రతాత్, జాగ్రతమ్ = మీరిద్దరూ మేల్కొని ఉండండి, జాగ్రత = మీరు అందరూ మేల్కొని ఉండండి–అనేవి ఈ మధ్యమ పురుష ఏకవచన, ద్వివచన, బహువచనాల అర్థాలు. ఈ బహువచన క్రియారూపమే జాగ్రత = మేల్కొని ఉండండి, హెచ్చరికతో ఉండండి అనే అర్థంలో తెలుగులో ఉన్నది ఉన్నట్లుగా దిగిందా? – అని అనిపిస్తుంది. మేల్కోండి, మేల్కొని ఉండండి అని హెచ్చరించడం జాగ్రత, జాగర్త అనే మాట తరచుగా విని దానినే సంపూర్ణ భావార్థకపదంగా జనం భ్రాంతిపడిందేమో! అ భ్రాంతిమూలంగా అది జాగ్రత అనే నామవాచకమయిందేమో! మరింత ప్రేమతో, ఆదరంతో హెచ్చరించడానికి చివరి తకారాన్ని ఒత్తి పలకడానికి త ఒత్తు పెట్టి జాగ్రత్త అనే మరొకరూపం, వర్ణవ్యత్యయంతో జాగర్త అనే ఇంకొకరూపమూ ఏర్పడి ఉంటాయేమో! ఏమైనా జాగ్రత, జాగ్రత్త, జాగర్త అనే మూడు అపశబ్దాలూ బాగా వాడుకలోకి వచ్చాయి.

జాగ్రత్ అనే పదం సాధువే. మేల్కొని ఉన్నా అని అర్థం. దానిని అవస్థ అనే పదం చేరినప్పుడు జాగ్రత్ + అవస్థ = అనే జాగ్రదవస్థ అని అవుతుంది. కాని దీన్ని జనం జాగ్రదావస్థ అని పలుకుతున్నారు. దీనికి మునుపు చెప్పిన జగదాంబ సూత్రమే కారణమనుకుంటాను. జగత్+అంబ = జగదంబ అని అవుతుంది. కాని, జగదాంబ అని పలుకుతారు తప్పుగా. అలాగే ఇదీని. శైశవావస్థ, బాల్యావస్థ, వార్ధకావస్థ అనే రూపాలలోని దీర్ఘాన్నిబట్టి, అవస్థ అనే పదం సమానంగా ఉండడాన్ని బట్టి, జాగ్రదావస్థ అనే తప్పుడు రూపం ఏర్పడి ఉంటుంది. అందుకే జగదాంబ సూత్రం అన్నాను.

మరచాను. జాగ్రత, జాగ్రత్త, జాగర్త అనే రూపాలు ఏర్పడడానికి మరొక కారణమూ కనిపిస్తుంది. 'నహి జాగరతోభయమ్' అని మొదట్లోనే ఒక శ్లోకం చివరి పాదం ఉదాహరించాను గదా! జాగరతః అనే పదం జాగర+తస్ అనే రెండు మాటలతో ఏర్పడింది. జాగర అనేది అకారాంత రూపం. దానికి నుండి అనే పంచమీ విభక్తిని తెలిపే తసిల్–తస్ అనేది చేర్చడం వల్ల జాగరతః అని అవుతుంది. అంటే, మేల్కొని

ఉండడం వల్ల అని అర్థం. ఎప్పుడూ మేల్కొని ఉండేవానికి, అన్ని విషయాలూ ఆకళించుకొని, తన భద్రతలో, తన రక్షణలో, మానసికంగాను. శారీరకంగాను ఏమరక హెచ్చరికతో ఉన్నవానికి ఎలాంటి భయమూ ఉండదని అర్థం. ఈ జాగరతః అనే పదమే క్రమంగా జాగరత–జాగ్రత–జాగ్రత్త–జాగర్త అని మారిందనుకుంటాను.

రిజర్వేషన్ లేకుండా రైలెక్కాను. రాత్రల్లా జాగారమే–అంటాడు ఒక నిత్య ప్రయాణికుడు. శివరాత్రి జాగారం బాగా జరిగిందా? అని ప్రశ్నిస్తాడు ఒక వ్రతనిష్ఠుడు. జాగారం చేద్దామనుకున్నాను. నిద్ర ముంచుకువచ్చింది అంటాడు ఒక నిద్రాలోలుడు. ఈ జాగారం ఏమిటి?

జాగృధాతువుకు భావార్థకంలో అనే ప్రత్యయం అంటే ఆ చేరినప్పుడు జాగృ+అ = జాగర అనే రూపం ఏర్పడుతుంది. ఈ ధాతువుకు అచ్ అనే మరొక ప్రత్యయం చేరినా జాగరః అనే రూపం, జాగృ+ఆ = జాగరా అనే రూపం ఏర్పడుతాయి. అందుకే అమరసింహుడు "జాగరా జాగరా ద్వయోః" అని అమరకోశం సంకీర్ణవర్గంలో అన్నాడు. అంటే, మేల్కొని ఉండడం అనే అర్థంలో జాగర్యా, జాగరా అనే పదాలు ఉన్నాయి అని తాత్పర్యం, జాగరా అనే పదం పుంలింగంలోను ఉంది అన్నాడు గనుక, జాగరః అని మరొకరూపం ఏర్పడుతుంది. మూడు రూపాలు అయ్యాయి.

జాగృధాతువుకు భావార్థకంలో అన అనే ప్రత్యయంతో జాగృ+అన = జాగరన–జాగరణ అనే రూపం మరొకటి ఏర్పడుతుంది. యక్ ప్రత్యయం వస్తే జాగర్యా అని అవుతుంది. మొత్తానికి జాగర్యా, జాగరా, జాగరః జాగరణం అని నాలుగు రూపాలు ఉండగా, వీటిని సజావుగా వాడుకోక జాగరలోని గకారాన్ని పొడిగించి జాగారం అని ఎందుకు తప్పుగా వాడుతారో ఎంత తలబద్దలు కొట్టుకున్నా అర్థంకాదు.

పై చర్చవల్ల మనకు తేలిందేమిటంటే, జాగ్రత, జాగ్రత్త, జాగర్త, జాగారం, జాగ్రదావస్థ అనేవి తప్పని, తెలిసి తెలిసి తప్పులు వాడరాదని. పనిగట్టుకొని తప్పులు వాడేవారిని గురించి మనకు ప్రసక్తే లేదు. శబ్దసాధుత్వాన్ని ప్రయోగపారిశుద్ధ్యాన్ని తెలుసుకొని, వాడుదామనుకున్నవారికే ఈ చర్చంతా.

*****

# ఎన్నికల పుణ్యం

ఎన్నికల పుణ్యమా అని పత్రికలలో భాష విశృంఖలంగా ప్రవహించింది వర్షర్తువులో నదులు ప్రవహించినట్టు. వర్షర్తువులో వరదలు వచ్చినప్పుడు నదులు ఎంత అసహ్యంగా ఉంటాయో చెప్పనక్కరలేదు. ఎక్కడెక్కడి మురికీ కొట్టుకొని వస్తూంటుంది. అలాగే ఎన్నికల వంటి జనకోలాహలంలో లింగవచనాలు, విభక్తి సంబంధాలూ లేకుండా ప్రజానాయకులు చేసే ప్రసంగాలన్నీ చాలా వరకు యథాతథంగా పత్రికలలోనికి దిగుమతి అవుతున్నాయి. సంపాదకవర్గానికి వాటిని సవరించి, సంస్కరించి ప్రచురించే తీరికా, ఓపికా ఉండవు. అలాంటి వాక్యాలు నా దృష్టిలో చాలా పడ్డాయి. వాటిలో రెండుమాత్రం ఉదాహరిస్తున్నాను.

"కాంగ్రెస్ పటిష్టానికి..... ప్రశంసనీయం" ఒక అగ్రగణ్య దినపత్రికలోని ఒక వార్త శీర్షిక.
"కాంగ్రెస్ బలోపేతానికి..." మరొక దినపత్రికలోని వార్తాశీర్షిక.
కాంగ్రెస్ పటిష్ఠానికి ఏమిటి? కాంగ్రెస్ బలోపేతానికి.... ఏమిటి?
వీటికి తోడు పటిష్ఠవంతంగా అని మరొక సమాసం.

రాని సంస్కృతానికి ఆర్రులు చాచడమెందుకంట ఈపత్రికల వాళ్ళకు? హంస నడకల సామెతను ఈ సందర్భంలో ప్రస్తావించను. ఎందుకంటే, ప్రతి భాషా గొప్పదే! ప్రతి భాషా పవిత్రమైంది. భాషకు, సాహిత్యానికే గొప్పదనం. ఎప్పటికప్పుడు కాలానుగుణంగా వచ్చే మార్పులను గ్రహించి, తదనుగుణంగా పదాలను మూల సిద్ధాంత అవిరోధంగా పదాలు సృష్టించుకోడంలోనో, ఉన్నవాటిని అర్థచ్ఛాయానుగుణంగా కొద్ది మార్పులతో ప్రయోగించి ప్రాచుర్యం సంపాదించుకోడంలోనో ఉంది. తెలుగుకు ఉన్న పరభాషా పదగ్రహణశీలత ప్రపంచంలో మరే భాషకూ లేదని హాల్డేన్ వంటి గొప్ప విద్యావేత్త, విజ్ఞానశాస్త్రజ్ఞుడే అన్నాడు.

ఇతర భాషా, సంస్కృతుల సంపర్కంతో మనకు పదాలు కొత్తవి లభించడమో, ఉన్న పదాలు కొద్దిపాటి మార్పులతో అర్థాంతరాన్నో, అర్థాంతరచ్ఛాయనో తెలుపడమో జీవద్భాషా సహజం. దీనితోపాటే వాక్యప్రయోగ వైఖరి కూడా మారుతుంది. కనుక మనం కాలానుగుణంగా ప్రవర్తించక తప్పదు. కాని, ఆ ప్రవర్తించడం భాషా సంప్రదాయానికి అనుగుణంగా ఉండడం అవసరం. ఈ దృష్టితో "కాంగ్రెస్ పటిష్టానికి..." అనే వాక్యం పరిశీలించండి.

వక్త వివక్ష (చెప్పే ఉద్దేశం) కాంగ్రెస్‌ను పటిష్ఠం చేయడానికి అయి ఉంటుంది. మనం మన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పినప్పుడు గదా ఎదుటివాడు సరిగా గ్రహించగలుగుతాడు, తదనుగుణంగా పనిచేస్తాడు! ఈ కాంగ్రెస్ పటిష్ఠానికి అన్న వాక్యంలో స్పష్టత లేదు.

పటిష్ఠ అనేది విశేష్యవిఘ్నం. అంటే విశేషణపదం. విశేష్యపదం ప్రత్యేకతను తెలుపడమో, ప్రత్యేకతను ఆపాదించడమో చేయాలి. ఈ వాక్యంలో కాంగ్రెస్‌ను శక్తిమంతంగా, దృఢంగా చేయడం అని వక్త ఉద్దేశం. దానికి పటిష్ఠ అనే విశేషణపదాన్ని వాడాడు. కాని ఈ వాక్యంలో కాంగ్రెస్ అనే విశేష్య నామవాచకం పటిష్ఠానికి అనే విశేషణంతో అన్వయించదు. పటిష్ఠం చేయడానికి అని అన్నప్పుడే ఆ అర్థం వస్తుంది. పటిష్ఠీకరణం ఉద్దేశమయినప్పుడు పటిష్ఠం+చేయడం అనే అర్థం వచ్చే పదప్రయోగం ఉండాలి. కాంగ్రెస్ పటిష్ఠానికి అన్నప్పుడు ఆ అర్థం రాదు. కాంగ్రెస్‌ను పటిష్ఠం చేయడానికి అని గాని, కాంగ్రెస్ పటుత్వానికి అని గాని, కాంగ్రెస్ పటిష్ఠం కావడానికి అని గాని ప్రయోగించాలి. పటిష్ఠం విశేషణం గనుక పటిష్ఠమైన కాంగ్రెస్ ఏర్పడడానికి, రూపొందడానికి అని కూడా అనవచ్చు. కనుక కాంగ్రెస్ పటిష్ఠానికి అనే వాక్యం ఏ విధంగా చూచినా సాధువు కాదు. కాంగ్రెస్‌ను పటిష్ఠం చేయడానికి అని స్పష్టంగా వ్రాయవచ్చు గదా! లేనిపోని పాండిత్యాలకు పోవడం ఎందుకు?

"కాంగ్రెస్ బలోపేతానికి" అన్నది కూడా పై జాతిదే. బలోపేతానికి అన్న సమాసంలో బల+ఉపేత అనే రెండు పదాలున్నాయి. ఇవి చేరి బలోపేత అయింది. బలోపేతం అంటే బలంతో కూడిన అని అర్థం. బలోపేత అనేది కూడ పటిష్ఠ లాగా విశేషణం. విశేష్యమయిన నామవాచకం గుణగణాలు తెలిపేదో, తెలుపబోయేదో.

బలోపేతానికి అంటే బలోపేతం చేయడానికి అనే అర్థంలో వాడడానికి ఈ పదానికి శక్తి లేదు. బలోపేతం చేయడానికి– కాంగ్రెస్‌ను బలోపేతం చేయడానికి అనో, కాంగ్రెస్ బలోపేతం కావడానికి అనో వ్రాయాలి. కాంగ్రెస్ అనే పదం, బలోపేత అనే విశేషణంతో అన్వయిస్తుంది, దానితో దాని శక్తి పూర్తవుతుంది. బలోపేతం కావడానికి, బలోపేతం చేయడానికి అనే పనులు చేయడానికి సూచించే పదాలు బలోపేతంలో లేవు. కనుక బలోపేతం చేయడం, బలోపేతం కావడం అనే అర్థాన్ని బలోపేతానికి అనే పదం ఇవ్వజాలదు. మన భావాన్ని ఎదుటివాడికి తెలుపడానికే మన వాగ్వ్యాపార

ప్రయత్నమంతా గనుక, బలోపేతం కావడానికి, బలోపేతం చేయడానికి అని స్పష్టంగా ఉండాలి.

మరొక విచిత్రప్రయోగం "పార్టీని పటిష్ఠవంతంగా చేయడానికి" అనేది. వక్త ఉద్దేశం పార్టీని పటిష్ఠం చేయడం, శక్తిమంతం చేయడం అయితే ఈ వాక్యం తప్పు. పటిష్ఠం అంటే బలం కలది. బలం కలిగినవాడు. అలాంటి పటిష్ఠమైన – బలం కలిగిన – వ్యక్తులు గాని, వర్గాలు గాని పార్టీలో ఉండడం వక్త ఉద్దేశమైనప్పుడు తప్పుగాదు.

పటిష్ఠ అనే శబ్దంపై కలవాడు–కలది అనే అర్థంలో మాతుప్ అనే ప్రత్యయం వచ్చి, మకారం వకారమై పటిష్ఠవాన్– పటిష్ఠవత్ అనే రూపాలు ఏర్పడుతాయి. వీటికి పటిష్ఠులు – శక్తిమంతులు కలవాడు–కలది అని అర్థం. పటిష్ఠవత్ అనే పదాన్ని తత్సమీకరించుంటే, పటిష్ఠవంతం అని అవుతుంది. దీని అర్థం పటిష్ఠులు –బలవంతులు కలది, లేక బలవంతమైన వర్గాలు గలది అని.

కనుక పార్టీని శక్తిమంతంగా చేయడమే వక్త ఉద్దేశం గనుక పార్టీని పటిష్ఠంగా అని మాత్రమే వ్రాయాలి. పటిష్ఠవంతంగా అని ప్రయోగిస్తే, పటిష్ఠులయిన వారు కలదిగా చేయడం అనే అర్థం ఏర్పడి, వక్త ఉద్దేశాన్ని స్పష్టీకరించదు.

పటిష్ఠవంతం లాంటిదే సమర్థవంతం అనే పదమూను. ఈ సమర్థవంతాన్ని ఇది వరకే వ్రాశాను. కాని దాదాపు సంవత్సరం అయివుంటుంది గనుక మరొక మారు సంగ్రహంగా తెలుపుతాను.

సమర్థుడు, సమర్థవంతుడు, సమర్థంగా, సమర్థవంతంగా– ఈ పదాలు వ్యాకరణరీతిగా తప్పుకాదు. అన్నీ సాధుపదాలే. మనవారు వీటి అర్థభేదం తెలియకవాడడం వల్ల తప్పులు ఏర్పడుతున్నాయి. సమర్థ అంటే శక్తిగలవాడు, తగినవాడు, అర్హుడు అనే అర్థాలున్నాయి. ఇలాంటి వాళ్లు కొందరు ఒక వ్యక్తి దగ్గర ఉంటారనుకోండి. అతడు సమర్థవంతుడు అవుతాడు. సమర్థ అనే శబ్దం మీద కలవాడు, కలది అనే అర్థంలో మాతుప్ అనే ప్రత్యయం వచ్చి, అంటే మ వచ్చి అది వకారమై సమర్థమ – వ = సమర్థవాన్, సమర్థవత్ అనే రూపాలు ఏర్పడుతాయి. అంటే చాలా మంది సమర్థులను తన అధీనంలోనో, కొలువులోనో పెట్టుకొన్న వ్యక్తి, పెట్టుకొన్న సంస్థ – సమర్థవాన్ – సమర్థవత్. ఇది తత్సమీకరణ ప్రక్రియతో సమర్థవంతుడు, సమర్థవంతం అనీ అవుతుంది

తెలుగులో. వక్త ఉద్దేశం కేవలం సమర్థుడు అనో, సమర్థమైనది అనో, సమర్థంగా అనో చెప్పడం అయినప్పుడు, సమర్థవంతుడు, సమర్థవంతం, సమర్థవంతంగా అని వాడడం ఉచితం కాదు.

ప్రతిష్ఠం, బలోపేతం అనేవి విశేషణాలని, ప్రతిష్ఠత, ప్రతిష్ఠత్వం, బలోపేతత, బలోపేతత్వం అనేవి గుణవాచకాలని ఇప్పుడు తెలుసుకొన్నారు గదా! కాంగ్రెస్ ప్రతిష్ఠతకు, కాంగ్రెస్ ప్రతిష్ఠత్వానికి అని అనవచ్చు. కాంగ్రెస్ బలోపేతత్వానికి, కాంగ్రెస్ బలోపేతతకు అని అనవచ్చు. ఎందుకంటే కాంగ్రెస్ యొక్క ప్రతిష్ఠతకు, కాంగ్రెస్ యొక్క బలోపేతత్వానికి అని సరైన షష్ఠీతత్పురుష సమాసం అవుతుంది. గుణవాచకం వాడడానికి మారు విశేషణం వాడడం ఉచితం కాదు గదా!

*****

# నరకయాతనలో వచనాలు, విభక్తులు

ఇప్పటి తెలుగు దిన, వార పత్రికలలో యథాలాభంగా దేనినైనా తీసుకొని ఏ పుటనైనా తిరగవేయండి; వచనాలు, విభక్తులు పడుతున్న పడరానిపాట్లు చూచి కళ్లు చెమర్చుతాయి. వచనాలు సంఖ్య తెలియడంకోసం, విభక్తులు వాక్యంలో పదాల సంబంధం తెలుపడంకోసం మానవుడు పుట్టినప్పటి మంచి వ్యవహారంలో ఉన్నట్టివి. భాష వాడుకనుబట్టి, వ్యాప్తిని బట్టి కొందరు విజ్ఞులు, తమ సమకాలీనులూ, తమ తర్వాతివారి సౌలభ్యం కోసం ఏర్పరచుకొన్న నియమాలే వ్యాకరణం. అధికసంఖ్యాకుల ప్రయోగాలనుబట్టి, వాటిని పరిశీలించిన పెద్దలు కొన్ని నియమాలు చేశారు. వాటికి అపవాదాలు సకృత్తుగా ఉంటాయి. కాని, ఎక్కువగా ప్రయోగాలు చెల్లుబడిలో ఉంటాయి.

ఈ వచనాల్లో ఎక్కువగా ధక్కాలు తింటున్నది ప్రథమావిభక్తి బహువచనం, అకారాంతపదాలతోనే ప్రారంభిద్దాం. "విద్యార్థులకు పాఠ్యపుస్తకంల కొరత – ప్రభుత్వం హామీ". అని ఒక దినపత్రిక శీర్షిక. పుస్తకం అనే పదానికి గ్రాంథికభాష అయితే ప్రథమా విభక్తి బహువచనం పుస్తకములు; వ్యవహారభాష అయితే పుస్తకాలు. ద్వితీయా బహువచనమైతే పుస్తకములను గ్రాంథికం; పుస్తకాలను వ్యావహారికం. కాని, ఏ పత్రిక చూడండి పుస్తకంలు, పుస్తకంలను అనే అచ్చయి ఉంటుంది.

ఇకారాంత పదాలగతి మరీ ఘోరం. "చంద్రబాబు నాయుడు లక్ష్మీపార్వతిలు పరస్పర దూషణలు" ఒక పత్రికలో వాక్యం. "చంద్రబాబు నాయుడు మాధవరెడ్డిలు పాదయాత్ర" మరొక పత్రిక వార్త. ఇకారాంత శబ్దం హరికాని, పార్వతికాని, రెడ్డి కాని ప్రథమా బహువచనంలో బహువచన ప్రత్యయం చేరినప్పుడు చివరి ఇకారం ఉ గా మారుతుంది. హరిహరులు. పార్వతి – పార్వతులు. రెడ్డి – రెడ్లు, హరిలు, పార్వతిలు, రెడ్డిలు కాదు. ఇది ప్రాథమిక సూత్రం.

నా మిత్రుడు ఒక పెద్దరెడ్డి ఉన్నాడు. ఆయన "మా రెడ్డిలలో" అని సంభాషణ ప్రారంభిస్తాడు. "రెడ్లలో అను మహానుభావా! రెడ్డిలలో అని వద్దు" అని ఎన్నిసార్లు చెప్పినా వినడు. తప్పు అలవాటు వ్యసనం కన్నా శక్తిమంతం. వదల్చుకోడం చాలాకష్టం.

సంస్కృతంలో ఇకారాంతాలయిన లక్ష్మీ, గౌరీ, పార్వతీ వంటివి తత్సమీకరణ ప్రక్రియలో తెలుగులో లక్ష్మి, గౌరి, పార్వతి అని హ్రస్వాంతాలవుతాయి. వాటికి ప్రథమా బహువచన ప్రత్యయం చేరితే లక్ష్ములు, పార్వతులు, గౌరులు అవుతాయి గాని, లక్ష్మీలు, పార్వతీలు, గౌరీలు కావు.

వీటి ద్వితీయ బహువచనం హరులను, రెడ్లను, లక్ష్ములను, పార్వతులను, గౌరులను అని అవుతుంది కాని, హరిలను, రెడ్డిలను, లక్ష్మిలను, పార్వతీలను, గౌరీలను అని కాదు. ఇలా మారడానికి హిందీ, ఉరుదూల ప్రభావం కొంతకారణమయి ఉంటుంది.

సంస్కృతపదాలను తత్సమంగా చేసుకొని వాడడం మనసంప్రదాయం. క్రమంగా మనకు విదేశీయులతో సంబంధం ఏర్పడిన తర్వాత, వారి భాషాపదాలు ఇలాంటివి మన వ్యవహారంలో చేరాయి. వాటిని అపార్థం కానంతవరకు మనం తత్సమాలుగా చేసుకున్నాము. బ్యాంక్ అనే పదం తీసుకోండి. హలంత పదాలను ఇకారాంతాలుగానూ, ఉకారాంతాలుగాను వాడడం మన అలవాటు గనుక. బ్యాంక్ బ్యాంకి, బ్యాంకు అని రెండు రూపాలు పొందింది. దీనికి బహువచనం బ్యాంకులు. బ్యాంకీలు అనే పదం ఏ విధంగాను సాధువు కాదు. ఇది ఈకారాంతం కాదు గనుక.

ఇతరభాషలలోని వకారాంత, సరాంత పదాలను, తత్సాదృశ్యంతో హలంత పదాలన్నిటనీ అకారాంతాలుగా వాడడం సంస్కృతసంప్రదాయం. ఉదాహరణకు సుల్తాన్ సుల్తానః సురత్రాణః, మాక్స్ ముల్లర్ = మాక్స్ ముల్లరః, మోక్షమూలరః మనెండర్ = మనెందరః – మిళిందః.

ప్రాకృతంలో సంస్కృత వకారాంత సకారాంతాలు అకారాంతాలవుతాయి. ఈ ప్రభావం వల్ల కూడా తర్వాతి సంస్కృతజ్ఞులు అన్యభాషా పదాల విషయంలో ఈ పద్ధతిని అనుసరించారేమో!

కాని, అన్యభాషలలోని ఈకారాంత పదాలు మాత్రం మనకు అలాగే దిగుమతి అయ్యాయి. వాటిని మనం సంస్కృత తత్సమాన పద్ధతిలో హ్రస్వీకరించుకోలేదు. ఉదాహరణకు రౌడీ – రౌడీలు. రౌడీ శబ్దం రౌడి అని హ్రస్వం కాలేదు. బేడీ – బేడీలు, చాడీ – చాడీలు, మోడీ – మోడీలు. దీవటీ – దివిటీ – దీవటీలు, దివిటీలు. నిజానికి దీవటీ శబ్దం – దీపవర్తి అనే శబ్ద వికారం. ప్రాకృతంలో దీపవట్టీ. దీపవట్టీ – దీతి వట్టీ – దీవట్టీ – దీవటీ అని అయింది. దీపవర్తీ శబ్దం దీపవర్తి అని తత్సమమయింది. దీని ప్రథమా బహువచనం దీపవర్తులు. కాని దీవటీ వేషంలో వచ్చి దివిటీలు అయింది. ఇలాంటిదే వడ్డీ అనేపదం. ఇది వృద్ధి అనే సంస్కృతపదం నుంచి వచ్చింది, వడ్డీ – వడ్డి అయింది. దీనిని సామాన్యంగా ఏకవచనంలోనే వాడుతాము. ఎంతవడ్డీ అయిందయ్యా? ఇంతవడ్డీ అయిందా? అసలు కన్నా కడ్డీ ఎక్కువయిందే? ఇలా. వడ్డీలు అని బహువచనం కావచ్చునుకాని, వ్యవహారం తక్కువ.

సమాసం వాడేటప్పుడు ఈ బహువచన ప్రయోగం అవసరం గాని, వ్యస్తంగా వ్రాయదలిస్తే అవసరం లేదు. చంద్రబాబు నాయుడు లక్ష్మీపార్వతుల విమర్శ – అన్నప్పుడు చంద్రబాబు – లక్ష్మీపార్వతి అనే రెండు పదాలను కలుపుతున్నాము గనుక బహువచనం అవసరముంది. లక్ష్మీ పార్వతుల అని. విడిగా చంద్రబాబు నాయుడు, లక్ష్మీపార్వతి పాదయాత్రకు బయలుదేరారు అనే వాక్యంలో పార్వతుల అనే బహువచనం అక్కరలేదు. ఆ రెండు కర్తృవాచకాలూ విడివిడిగా ఉన్నాయి. వాటికి బయలుదేరారులో అన్వయం.

కొన్ని విభక్తి ప్రత్యయాలపై కొందరికి ఎందుకో కోపం. రాముని గూర్చి అని వ్రాస్తే నార్లగారు మండిపడేవారు. గూర్చి, గురించి రెండూ సమానార్థక ప్రత్యయాలండీ. వాటిపై మనకెందుకు కోపం? అనేవాడిని. గూర్చి గ్రాంథికమండీ, గురించి వ్యావహారికం – అనేవారు ఆయన. కొందరికి యొక్క పడదు. అది వారికి నమలరాని గోటువక్కలాగ అనిపిస్తుందేమో! అలాగే కొరకు కొందరికి గిట్టదు. కొరకేమిటండీ కొరకు వ్యాధిలాగా? అని ముఖం గంభీరంగా చేసుకున్న వారూ ఉన్నారు.

వైయాకరణులు చతుర్థీ విభక్తి ప్రత్యయాలు కొరకు, కై అని రెండే చెప్పినా, కోసరం, కోస్కరం, కోసం అనేవి వ్యవహారంలో ఉన్నాయి. హవాలా దొంగల కోసం

గాలింపు ఇత్యాదిగా. వానికి+అయి = వానికయి, వానికై అని విడదీయగలం. కోస్కరం, కోసరం, కోసం ఎలా పుట్టాయో! ప్రాకృతంలో చతుర్థీ విభక్తి లేదు. నిజానికి సంస్కృతంలోను తక్కువే అనవచ్చు. వానికి చెప్పు అనడం సహజం. వానికొరకు చెప్పు అనడం అంతసహజంగా కనిపించదు. చతుర్థిస్థానంలో షష్ఠీప్రయోగాలు సంస్కృతంలోను కోకొల్లలు. ఖ్యాహిభద్రే. ప్రియదర్శనస్యం నగంగదత్తః పునరేతి కూపమ్ – ప్రాకృతంలో ఒకవిధంగా నియంతలాగే చతుర్థికి షష్ఠీ ప్రయోగాలు. మన తెలుగు 'కై' ప్రాకృతంలో చేరి తస్సకఏ = వానికొరకు అనే ప్రయోగాలు ఏర్పడ్డాయి. సంస్కృత వైయాకరణులు కఏ అనేది కృతే అనే అన్వయం నుంచి వచ్చిందన్నారు. అది విషయాంతరం.

ప్రాకృతం అనుసరామః వాడికోస్కరం, వాడికోసరం, వాడిని గురించి అనే చతుర్థీ విభక్తి ప్రత్యయాలలో ఒకటి కోసం అనేది వాడితే సులువుగా ఉంటుంది వ్యావహారికంలో, కోస్కరం అనేది భాస్కరం, అహస్కరంలాగో ఆస్కార్‌లాగో ఉంటుంది. షష్ఠీ విభక్తి గోడూ ఇదే– లక్ష్మీపార్వతిల.

ప్రియ మిత్రులారా! ప్రథమావిభక్తి బహువచనం సరిగా వాడండి, వ్రాయండి. లక్ష్మిలు, పార్వతిలు, రెడ్డిలు, గంగిలు అని వ్రాయకండి. లక్ష్ములు, పార్వతులు, రెడ్లు, గంగులు అని వాడండి, సమాసవాక్యం అవసరమే లేదు. వచనాలు, విభక్తులు చిన్న విషయాలయినా, అత్యావశ్యకమయినవి; మొదటి మెట్టువి. వీటిని మెట్టకపోతే –పాటించకపోతే ఎట్లా?

*****

# సమ్మానితులు – సమ్మాన్యులు

ఇటీవల నాకొక సమ్మానం జరిగింది. ఆ సమ్మానం ఎలా జరిగింది అనే విషయాలు వద్దు, చాలామంది ఉగ్రులయిపోతారు.

ఆ సమ్మానం ఆహ్వానపత్రికలో సమ్మానితులు అని నాతోపాటు ఆరుగురి పేర్లున్నాయి. సమ్మానితులు అంటే, సమ్మానింపబడినవారు, ఆనర్డ్ అని అర్థం. ఇంకా సమ్మానం జరుగనిదే సమ్మానితులు అని ముద్రితమయి ఉంది. టు బి ఆనర్డ్ అనే అర్థంలో సమ్మానం పొందనున్నవారు అని కదా ఉండాలి?

ఈ సమ్మానాహ్వాన పత్రికలోనే వాదు, భాగ్యనగరంలో ఇలాంటి సమ్మానాలు పొందే అభాగ్యులందరూ ఈ కేటగిరిలోనే ఉండడం నాకు ప్రతిదినమూ టపాలులో వచ్చే ఆహ్వానపత్రికలన్నీ చాటుతుంటాయి.

సమ్మానితుడు–లేక సమ్మానితులు అంటే భూతకాలమయ్యా, మీరింకా ఆయననో, వారినో సమ్మానించలేదు, సమ్మానించబోతున్నారు. కనుక సమ్మానితులు అనడం తప్పయ్యా = మీరు జరిపే సమ్మానోత్సవం జరిపింతర్వాత పత్రికల వారు ప్రచురించే వార్తలలో సమ్మానితులు ఫలానా అని వ్రాసినప్పుడు, సమ్మానం జరిగిపోయింది గనుక, భూత కాలమయింది గనక సమ్మానితులు అనే పదం నప్పుతుంది. ఇంగ్లీషులో టు బి ఆనర్డ్ అనే చోట అనర్డ్ అని వ్రాస్తే తప్పని తెలుసుకొని శ్రద్ధగా ముద్రించే మీరు సమ్మానం పొందబోయేవారిని సమ్మానితులు అని ముందుగానే సమ్మానం పొందినట్టు వ్రాస్తే తప్పుగాదా? అని అడిగాను. మాకేం తెలుసు సార్? మేము కార్యకర్తలము. మా నాయకులను అడగండి అని అనే వారు చెప్పిన నాయకమ్మన్యులను అడిగాను, వారు మరొకరిని చూపారు. అలా పైకి పోయి "అల వైకుంఠ పురంబులో నగరిలో నామూలసౌధంబులో" లాగ పోయి, మూల విరాట్టును దర్శించాను. గురూ గారూ! ఇది చిన్న సంగతి. ఎలా వ్రాసినా, ముద్రించినా సమ్మానం సంగతి సమ్మానం పొందేవారికి విడిగా తెలియజేశాం గదా! వాళ్లు ఎలాగూ వస్తారు. బాధేముంది? అన్నారు ఆయన. అయితే పక్కనే ఉన్న ఇంగ్లీషు ఆహ్వానం పాఠంలో టు బి ఆనర్డ్ అని సరిగా ఉన్న దానినీ ఆనర్డ్ అని దిద్దలేకపోయారా? ఎలాగూ వారికి తెలుస్తుంది గదా? అన్నాను. అలా తప్పు ఎలా అచ్చుకొడతామండీ? అన్నారు. కొంత ఉద్రేకంతో, నేను నస నారాయణుడిని అని అనుకొని, మరి అది తప్పు అయినప్పుడు ఇదీ తప్పేనండీ. దీన్నీ ఇక మీదనన్నా సరిగా ముద్రించండి–అంటూ ఆయన నుంచి సెలవు పుచ్చుకున్నాను.

సంస్కృతంలో పూజింపదగినవారు, పూజింపబడబోయే వారు అనడానికి బోలెడు పదాలున్నాయి. వాటిని వదలి తప్పు పదాన్నే మనవారు తీసుకొని ఇంతకాలమూ వాడుకోవడం ఎవరూ చూడలేదంటారా? చూడకేం? చూచినా ఉపేక్ష! ఈ తప్పుడు సంస్కృతపదాలు వాడడం కన్నా, హాయిగా ఈ రోజు ఈ సమయంలో సమ్మానం పొందుతున్న వారు వీరు అని వ్రాస్తే సరిపోలే!

సమ్మానితులు అనే పదం దాని అర్థంలో సమ్మానింపబడినవారు అనే అర్థంలో – సాధు పదమే. దాన్ని భవిష్యత్కాలార్థంలో గాని, వర్తమానకాలార్థంలో గాని వాడడం తప్పు. అది ఎలా తప్పో వినండి.

సంస్కృతంలో అర్హ శక్యార్థాలలో - అంటే దీనికి అర్హుడు-తగినవాడు, దీనికి శక్తుడు-సమర్థుడు అని సూచించడానికి కొన్ని ప్రత్యయాలున్నాయి. అవి తవ్య, అనియ, య మొదలయినవి.

గౌరవించదగినవాడు, సమ్మానించదగినవాడు, సమ్మానానికి అర్హుడు అనే అర్థంలో మాన + అనీ య = మాననీయ, మాన+య = మాన్య, మాన+తవ్య = మానితవ్య = సమ్మానం పొందదగిన అని అర్థం-ఈ పదాలున్నాయి.

పూజ+య = పూజ్య, పూజ+అనీయ = పూజనీయ, పూజ+తవ్య = పూజితవ్య = పూజింపదగిన అని అర్థం. త్యాజ్య, త్యజనీయ=విడువదగిన, యాజ్య, యజనీయ = యజ్ఞం చేయదగిన, పూజింపదగిన.

కనుక, నేడు సమ్మాన్యులు, నేడు సమ్మాననీయులు, నేడు సమ్మానితవ్యులు అని వ్రాయడం ఉచితం. (టు బి ఆనర్డ్)

మానిత = సమ్మానింపబడిన, పూజిత = పూజింపబడిన, ఆమోదిత = ఆమోదం పొందిన, రంజిత = రంజింపబడిన, ఇది భూతకాలం.

కనుక మానిత, సమ్మానిత = సమ్మానింపబడినవారు, సమ్మానం పొందినవారు, పొందబోయేవారు కాదు సుమా! (ఆనర్డ్ మాత్రమే)

నేను గౌరవింపబడుతున్నవారు అని వర్తమానకాలంలో ఉన్నా తప్పు లేదు. అప్పుడు యమాన అనే ప్రత్యయం వస్తుంది.

భుజ్+యమాన = భుజ్యమాన = తినబడుతున్న. వ్యంజ్+యమాన = వ్యంజ్యమాన = వ్యంజింపబడుతున్న (సూచింపబడుతున్న). భజ్+యమాన = భజ్యమాన = విరువబడుతున్న. వచ్+యమాన = ఉచ్యమాన = చెప్పబడుతున్న. యజ్+యమాన = ఇజ్యమానం = యజ్ఞం చేయబడుతున్న (పూజింపబడుతున్న) మాన్ + యమాన = మాన్యమాన = సమ్మానింపబడుతున్న.

నేడు సమ్మానింపబడుతున్నవారు వేరు అనడానికి సమ్మాన్యమానులు అని వాడడం వర్తమానకాల వాచకం గనుక భవిష్యత్కాలానికి దగ్గరగా ఉంటుంది.

నిజానికి సమ్మానం జరుగబోయేది ముందే కదా! అది భవిష్యత్కాలం. కనుక మనం ఇంకా కచ్చితంగా వ్యాకరణాన్ని పాటించదలచుకుంటే, భవిష్యత్కాలం సూచించే

మాటలనే వాడవచ్చు. అప్పుడు ఎవ్వరు ఆక్షేపించడానికీ అవకాశం ఉండదు.

ఈ బాధలేవీ లేకుండా సమ్మానింపబడబోయే వారు అని స్పష్టంగా భవిష్యత్కాల వాచకంగానే చెబితే బాగుంటుంది. అప్పుడు మానయిష్యమాణులు అని అనాలి. ఈ పదం కొంచెం ఉచ్చారణ సులభం కాకపోవచ్చు. కనుక ఈ సభలో సమ్మాన్యమానులు సమ్మానింపబడుతున్న వారు వీరు అని వ్రాయడం ఉచితంగాను, ఉచ్చారణ సులభంగాను, శ్రవణసులభంగాను ఉంటుంది.

మిత్రులారా, ఇక నుంచైనా ఇలా వాడండి. సమ్మానానికి ఎంతో ఆడంబరంగా వెచ్చిస్తారు. శాలువలు తెస్తారు, దండలు తెస్తారు, పన్నీరు బుడ్లు తెస్తారు - పన్నీరు చిలకరించడానికి, ఎందరినో ఆహ్వానిస్తారు. మరి ఆహ్వాన పత్రికలలో తప్పులెందుకు చేయాలి? ఈ తప్పులు దిద్దుకోడానికి ధనవ్యయం లేదు, కాలవ్యయం లేదు, బుద్ధివ్యయం అంతకన్నా లేదు. జరిగేదల్లా శ్రద్ధావ్యయం-అంతే!

*****

# సంబంధీకులతో సపరివారసమేతంగా...

భాద్రపద మాసం గడచిపోగానే పెళ్లిళ్ల ఋతువు ప్రారంభమవుతుంది. వీటికి తోడు గృహప్రవేశాలు, శంకుస్థాపనలు వీటికి అనుబంధంగా - అనుబంధంగా కాదు, మహాబంధంగా సన్మానసభలూను. కనుక బంధువులు, మిత్రులు, అభిమానులు, అభిమానం లేకపోయినా వీడితో ముందు ముందు ఎలాంటి అవసరం వస్తుందో అని భావించే లోకజ్ఞులు పంపే ఆహ్వానపత్రికలు కోకొల్లలు. వీటన్నిటిలో చివర చేసే అభ్యర్థన మాత్రం చాలా వరకు ఒకే విధంగా ఉంటుంది. రోకటి పోటులాగా అభ్యర్థన వక్కణం వినండి.

'తమరు బంధుమిత్ర సకుటుంబ సపరివార సమేతంగాను, వారి వారి సంబంధీకులతోను విచ్చేసి నూతన వధూవరులను ఆశీర్వదించి అస్మదర్పిత సత్కారాన్ని స్వీకరించి మమ్ము కృతార్థులను చేయాలని అభ్యర్థన' ఇది వివాహ శుభపత్రికలలోని చివరి మాటలు. "ఆర్యా, మా కుమారుడు నెహ్రూనగర్‌లోని ఆమని అపార్ట్‌మెంట్స్‌లో ఒక కొత్త ఫ్లాట్ కొన్నాడు. దాని ప్రవేశోత్సవం కార్తిక శుద్ధ దశిమినాడు పెద్దలు నిర్ణయించినారు. తమరు సపరివారసమేతంగా వచ్చేసి, ఉత్సవాన్ని విజయవంతం చేయాలని కోరుతున్నాము." ఇది ఫ్లాట్ ప్రవేశ మహోత్సవాహ్వాన పత్రికలోని మాటలు.

"మేము సరూర్‌నగర్‌లో నూతనగృహం నిర్మించుకున్నాము. ఆ గృహ

ప్రవేశోత్సవం 26-12-1996న నిర్ణయించినాము. తమరు బంధుమిత్ర సపరివార సమేతంగా విచ్చేసి మమ్ము ఆనందింపచేయగోరినాము". ఇది నూతన గృహ ప్రవేశోత్సవ పత్రికలోని విషయం. "అనేక బహుమతి గ్రహీత, అనేక భాషాకోవిదుడు శ్రీ సూరయ్యగారిని అనేకసంస్థలు సన్మానించాలని నిశ్చయించినాయి. ప్రభుత్వ ప్రధానకార్యదర్శి అధ్యక్షత వహిస్తారు. ప్రముఖులు అనేకులు సూరయ్య గారి సేవను గురించి ప్రసంగిస్తారు. తమరు బంధుమిత్ర సపరివార సమేతంగా విచ్చేసి సభకు శోభచే కూర్చగలరని విశ్వసిస్తున్నాము." ఇది సన్మానసభ పిలుపులో భాగం.

ఈ పత్రికలన్నీ చదివితే ఉన్నమతి పోయేట్టు కనిపించింది. ఈ సపరివార సమేతులు, సంబంధీకులు ఎప్పుడు, ఏ సుముహూర్తంలో పట్టుకున్నారో ఒక పట్టాన వదలరని తోస్తుంది. బంధుమిత్ర సపరివార సమేత అనే సమాసంలో బంధు + మిత్ర + సపరివార + సమేత అనే నాలుగు పదాలున్నాయి. స+పరివార = సపరివార. అంటే పరివార సహితులై అని అర్థం. సపరివార + సమేత అనే సమాసంలో స+పరివార+సమేత అనే పదాలున్నాయి. దీని అర్థం - పరివార సహితులైనవారితో కూడి. అంటే "మీరు పరివార సహితులైన వారితో పాటు" అని అర్థం. ఈ సమాసంలో మొదటి స అనే వర్ణానికి చివర ఉన్న సమేత అనే పదానికీ కూడా చేరి, కూడి అనే ఒకే అర్థం. సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న సమేత శ్రీరామచంద్ర మూర్తి అంటే సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నులతో కూడిన శ్రీరామచంద్రమూర్తి అని అర్థం. సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న సమేత-అని మనం అనము. అక్కడ లేని స ను-సీతా లక్ష్మణ అనే సమాసం మొదట చేర్చడం ఎందుకు? తమరు బంధుమిత్ర పరివార సమేతంగా దయచేసి - అని గాని, తమరు సబంధ మిత్రపరివారంగా దయచేసి - అని గాని, రాస్తే చాలు. స అనే ఉపసర్గకు, సమేత అనే పదానికి అర్థం ఒకటే గనుక రెండూ వాడవలసిన అవసరం లేదు. ఒకటి చాలును. కాని, కొందరికి సమేత అనే పదం ఉంటేనే గాని నిండుగా కనిపించదు. అందువల్ల సబంధు మిత్ర పరివారంగా అని వ్రాసినా ఏదో వెలితి ఉన్నట్టు భావించి సమేత అనే మాటను చివర చేరుస్తారు. వారికి మొదట ఉన్న స అనే వర్ణం అవ్యయం సహితార్థమని తెలియక సమేత పదం కలుపుతారు. వారు స మొదటను, సమేత, సహిత అనే పదాలను చివరను - రెండింటినీ వాడడం తప్పని గ్రహించి, రెండింటిలో ఏదో ఒకటి చాలునని తెలుసుకోవాలి. కనుక ఇక మీదనన్నా సబంధు మిత్ర పరివారంగా అని గాని బంధుమిత్రపరివార సమేతంగా అని గాని ఆహ్వానపత్రికలలో వ్రాయండి, ముద్రించండి.

ఈ సంబంధీకులు - మహానుభావులు ఎప్పుడు జన్మించారో గాని - ప్రయాణీకులను, యాత్రీకులను, వైదీకులను, లౌకీకులను, వెంటబెట్టుకొని వచ్చారు.

వస్తూ వస్తూ ఈ బలగంతో వచ్చారో, వచ్చిన తర్వాత తమ బలగాన్ని పెంచుకున్నారో చెప్పలేము. ఈ ముఠావారే గోత్రీకులు. పూర్వీకులూను, సంబంధం అనేది వివిధం. దర్శనమాత్రంతో, పరిచయమాత్రంతో, సంభాషణమాత్రంతో, సిద్ధాంతమాత్రంతో, మతమాత్రంతో, నివాసమాత్రంతో, దేశమాత్రంతో, ఏకత్వ, ఏకగురు పఠనమాత్రంతో – ఇలా సంబంధం అనేకవిధం. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క సంబంధం ప్రబలమై కొంతకాలం సాగుతుంది. తర్వాత తెల్లబారిపోతుంది. మరల మరొకటి వస్తుంది. అది కొంత కాలం.

పూర్వం మతం వల్ల కలిగిన సంబంధం ప్రబలంగా ఉండేది. అది కొన్ని శతాబ్దాలు విజృంభించి మంచీ చేసింది, చెడుపూ చేసింది. వర్ణసంబంధం మొదట్లో మంచి కోసమే ఏర్పడినా, తర్వాత తర్వాత వెర్రితలలు వేసింది. సిద్ధాంతసంబంధం అర్ధశతాబ్ది పాటు ప్రపంచాన్ని ఉర్రూతలూపి, తదనుయాయుల దుశ్చర్యలతో నాశమైపోయింది. రాజకీయపక్షాల సంబంధం అధికారసంపాదనతో పర్యవసితమై లుకలుకలతో కుళ్లిపోయి చివరకు ఆ కుళ్లు పురుగులతోనే అంతమవుతున్నది. దేశసంబంధం, నివాససంబంధం ఇంకా తలయెత్తుకొని ఉన్నాయి. ఒక దేశంలో నివసించే వారు పరదేశానికి పోయినప్పుడయినా, ఒక దేశంవారమైన మనమంతా ఒకటేననే భావం విస్తరించి కొంచెం గర్వకారణమే అవుతున్నది. ఇక ఊరు సంబంధం – అంటే ఒక ఊరిలో నివసించేవారమనే సంబంధం మరి కొంత బలమైంది. ఇది పక్షపాతం, వ్యామోహం కానంత వరకు సవ్యంగానే ఉంటుంది.

ఈలాంటి సంబంధాలు కలవారు పరస్పరం సంబంధులు అవుతారు కాని సంబంధికులు సంబంధీకులు కారు. సంబంధం కలవారు అనడానికి సంబంధ శబ్దంపై ఇన్ ప్రత్యయం వస్తుంది. ఈ ఇన్ ప్రత్యయం వచ్చినప్పుడు సంబంధ + ఇన్ = సంబంధిన్ అనే రూపం ఏర్పడుతుంది. సంబంధం కలవాడు అని అర్థం. దీనికి నకారాంత పులింగ ప్రథమా విభక్తి ఏకవచనం సంబంధీ. సంబంధీ సంబంధికా – సంబంధినః మూల స్వరూపం సంబంధిన్. సంబంధీ అనేదాని తత్సమరూపం తెలుగులో సంబంధి. దీని బహువచనం సంబంధి + లు =సంబంధులు.

సంబంధ శబ్దంపై ఇక అనే ప్రత్యయం రాదు. కనుక సంబంధిక శబ్దం ఏర్పడడానికే అవకాశం లేదు. కనుక ఇక మీద బంధుమిత్ర పరివార సంబంధి సమేతంగా అని హాయిగా ఆహ్వానించండి.

నాకు ఆహ్వానాలు పంపే వారంతా ఇక మీద పంపే ఆహ్వానాలలో సపరివార సమేతంగా అనే తప్పు, సంబంధీక అనే తప్పులు లేకుండా వ్రాయిస్తారని ఆశిస్తున్నాను.

*****

# నిప్పా? నుప్పా?

ఇటీవల ఒక మహానిఖ్యాతుడూ, జన ప్రియుడూ అయిన ఒక చలనచిత్ర నటుడు నటించిన పాత చలనచిత్రం ఒకటి చూస్తున్నాను. ఆ చలనచిత్రంలో నాయకునికి మంటలన్నా, పొగన్నా భయం. కనుక మంటలను చూచి "నుప్పు! నుప్పు!" అని అరుస్తాడు. పతంజలి అంతటి శబ్దశాస్త్రజ్ఞుడే భయంతో 'కోభవాన్' అనడానికి 'కోర్భవాన్' అని అన్నాడంటారు విద్వాంసులు. ఆ కథ ఏమిటో వినాలని కుతూహలపడుతున్నారు గదూ! ఇది కేవలం కథే సుమా!

పతంజలికి తానొక గొప్ప శబ్దశాస్త్రవేత్తనని, తన నోటి నుంచి అపశబ్దం వెలువడదని గర్వం ఉండేదట. ఆదిశేషుడు అతని గర్వం అణచడానికి ఒక ఎత్తుగడ వేశాడట. పతంజలి ఒక ఉషఃకాలాన నదిలో స్నానం చేసి, దేవతలకు అర్ఘ్యమియ్యడానికి అంజలిలో నదీజలం తీసుకున్నాడట. దానిలో చిన్న పురుగులాగ కనిపిస్తే, ఏమిటా ఇది అని అనుకుంటూండగానే అది పెరగసాగిందట. దానిని చూచి పతంజలి గాభరాపడి చేయి విదిల్చాడట. అయిన అది కిందపడక పెద్ద పాముగా మారి పడగవిప్పి పైకి లేచిందట. ఆయనకు వణుకు పుట్టిందట. వణుకులో కోర్భవాన్? (నీవెవరు?) అని ప్రశ్నించాడట. ఆ పాము పడగ ఆడిస్తూ "సప్పోహం" (పామును నేను) అన్నదిట. ఆ భయంలోను పతంజలికి, అపశబ్దంపై దృష్టి పడిందట. సర్ప అనడానికి మారు 'సప్ప' అనడం అపశబ్దం కదా! ప్రాకృతంలో సప్ప సాధువు కావచ్చు కాని సంస్కృతంలో అపశబ్దమే. అందుకని "రేఫః క్వగతః?" (రేఫం–కవర్ణం మింగేశావే. ఎక్కడికి పోయింది?) అని ప్రశ్నించాడట. 'త్వయాపహృతః (నీవు దొంగిలించావు కదా!) అన్నదట. "నేనా? ఎక్కడ?" అన్నాడట, దొంగతనం ఆరోపణకు మరీ గాభరాపడి. "అవును. నీవే కోర్భవాన్ అని ప్రశ్నించావు. సర్ప అనే పదంలోని రవర్ణం కొట్టేసి కోభవాన్ అని అనవలసింది. నీవంటివాడే ఇలా తప్పుగా పలికితే ఎట్లా?" అని అన్నదట పాము.

పతంజలికి ఇదేదో సామాన్యమైన పాము గాదు. ఆదిశేషుడే సాక్షాత్తుగా అనిచప్పున తోచి నమస్కరించాడట.

అందువల్ల ఎవరికైనా భయాదిమనోవికారాలలో శబ్దాన్ని సక్రమంగా పలుకడం క్షంతవ్యం అని అనుకొని, ఊరుకున్నాను. కాని, ఆ పాత్రగారు భయాందోళనలు లేని పరిస్థితిలోను 'నుప్పు' అని ఉచ్చరించాడు. అటు తర్వాత కొన్నాళ్ళకు ఒక పత్రికాకార్యాలయానికి వెళ్ళాను. అక్కడ జిల్లాల వార్తలు చూస్తున్న ఒక ఉపసంపాదకులు "అగ్నిప్రమాదం జరిగిందటండీ ఎక్కడో. చాలా భయంకరమైంది. నుప్పు సెగలు ఇక్కడికి

తగులుతున్నాయి." అప్పుడు నాకు అనిపించింది. ఒక వర్గంవారు నిప్పును నుప్పుగా పలుకుతారేమోనని.

ఇంత పెద్దవాడు–బహిరంగసభలలో నోరు విప్పితే సంస్కృతి, భాష, సాహిత్యం, తాము 'అమెరికాలో' ఉన్నప్పటికి పరిస్థితి కుమ్మరించే మహానటుడు నుప్పు అని ఎలా పలుకుతాడు? అని ఆలోచించాను. తెలుగు పదకోశాలు తిరగవేశాను. నుప్పు కనిపించలేదు.

తెలుగుకు, తెలుగుతోబుట్టువులకు నిప్పు అనేది ప్రాచీన రూపం. తమిళులు నెరుప్పు. మలయాళంలోను నెరుప్పు. కన్నడంలో పెద్దమంటను నెప్పూరి అంటారు. నెప్పు + ఉరి = నెప్పూరి. ఉరి = మంట. కన్నడంలో బెంకి అనే పదం అగ్ని సామాన్యవాచకం. ఇది మనకు వెంకి, వేగి, వేంగి అని కనిపిస్తుంది. వేంగీ దేశం వేడి ఎక్కువగా ఉన్న దేశం. పులులు, పరాక్రమం ఎక్కువగా ఉన్న దేశం. వేంగి వేడి. ఇది క్రమంగా వెలుగు అనే అర్థచ్ఛాయ పొంది, వేకువ అయింది. అంటే వెలుగు రావడం, పొద్దుపొడవడం అన్నమాట.

మద్రాసులో మా పక్కవాటాలో మదురై వాసులయిన తెలుగువారుండేవారు. ఒక్కసారి ఆమె మూలుగుతూ ఉండడం చూచి, "ఏమిటి అవ్వగారూ, మూలుగుతున్నారు?" అని ప్రశ్నించాను. "ఏముంది? ప్రాయం వాటారింది చూడండి, వేగి తగిలింది మందుఘుంది" అన్నది. నేను ఒక్క గంతు వేసి వేగిని పట్టుకున్నాను. వేగి అంటే జ్వరం. ఎంత తియ్యని పాతమాట!

"అవ్వగారూ, ఏమిటి ఈ మధ్యాహ్నం మీ ఇంట్లో ఫలహారం?" అని అడిగేవాణ్ణి ఎప్పుడయినా. "నిన్న కుడుము చేస్తిమి. ఈ దినం నిప్పటి. ఏం తింఛారా?" అని ప్రశ్నించేది. "తినడానికి కాదు. ఉత్తినే అడిగాను" అనేవాడిని. కుడుము అంటే ఇడ్లీ. నిప్పటి అంటే దోశ. పిండికొద్దీ రొట్టె అనే సామెతకు సమానంగా అన్నమయ్య కీర్తనలలో "పిండంతె నిప్పటి" అనే ప్రయోగం ఉంది. ఎంత పిండో అంతే నిప్పటి. పెద్దది. అంతకుమించి ఎలా అవుతుంది?

మన ప్రాచీన భాషాస్వరూపానికి కులోత్తుంగుని కాలంలోను, విజయనగర సార్వభౌముని సోదరుడు కంపరాయలకాలంలోను తమిళ కేరళ ప్రాంతాలకు పోయిన తెలుగువారు, వెయ్యేళ్ళు కావచ్చినా అప్పటి భాషను చెక్కు చెదరకుండా కాపాడుకుంటున్న తెలుగువారు ప్రమాణమని నాసంపూర్ణ విశ్వాసం. మదుర, తంజావూరు ప్రాంతాల

అష్టాదశవర్ణాల తెలుగువారూ, రాజపాళెం రాజులు ముఖ్యంగా వారి అవరోధస్త్రీలు నన్నయ భారత భాష మాట్లాడుతారు. "సంకురాత్తిరి తొట్టి వేగి కాస్తుందంట. వద్రతినకే అన్నా. వినువా? కోపంతో మూతి ఎరబ్రారును..." ఇలా సాగుతుంది. తొట్ట = నుండి పంచమీ ప్రత్యయం ఇంకా బతికి ఉంది అక్కడ. దీనికి తమిళంలో సమానార్థకం తొట్రు (తొట్టు) అంటే దానిని తాకి, దానిని తాకినప్పటి నుండి. అప్పటి నుండి. అక్కడన్ + ఉండి = అక్కడ నుండి అయి, దానిలోని అక్కడ నుంచి అనుచితవిభాగంతో నుండి విడిపోయి పంచమీ విభక్తి ప్రత్యయంగా ప్రత్యేక ప్రతిపత్తి పొందింది.

*****

# శోభాయమానం - వేగవంతగతి

శోభాయమానంగా ఉంది హాలంతా - అని ప్రారంభమవుతుంది ఒక ప్రముఖ రచయిత కథ.

"ఏమిటి విశేషం ఈ రోజు ఇల్లంతా శోభాయమానంగా ఉందే ముగ్గులతో!" ముగ్గుల పోటీ కాదు గదా ప్రశ్నించాడు శంకరయ్య - అని ఒక రచయిత్రి కథలోని ఘట్టం.

ఈ శోభాయమానం ఎప్పుడు ప్రవేశించిందో గాని శోభి శరీరాన్ని వ్యాపించినట్టు కథల్లో అల్లుకొని పోతూంది నాగజముడులాగ.

రచయితల ఉద్దేశం శోభించేది, ప్రకాశించేది అని. కాని ఈ పదం ఆ అర్థం ఇవ్వదు.

నిజానికి శోభాయమానం అనే పదం తప్పు పదం కాదు. శోభ వలె ఆచరించేది, కనిపించేది. శోభాయతే దాని మీద మాన అనే ప్రత్యయం వచ్చి విశేషణ రూపం శోభాయమానం. శోభవలె ఉన్నట్టిది - అనే అర్థం వస్తుంది. ఒక మహిళగాని, బాలికగాని శోభ నే మహిళవలె ఉన్నప్పుడు గాని, ఆమె వలె ఆచరిస్తున్నప్పుడు గాని ఈ పదం వాడవచ్చు. తప్పు గాదు. రంభాయతే = రంభ వలె కనిపిస్తున్నది, ఆచరిస్తున్నది అని అర్థం. ఇది క్రియా రూపం. అంటే ఎవరో పుల్లమ్మో, ఎల్లమ్మో రంభవలె కనిపించినప్పుడో, రంభలాగ హావభావాలు ప్రదర్శిస్తున్నప్పుడో ఈ పదం వాడవచ్చు. దాని విశేషణ రూపం రంభాయమాన = రంభాయమానా తెలుగు తత్సమమయినప్పుడు రంభాయమాన.

రామాతురే = రాముని వలె ఆచరిస్తున్నాడు. రాముడు ఏయే పనులు చేస్తున్నాడో సోముడు కూడా ఆయా పనులు చేస్తున్నాడన్నమాట. రామాయమాన = రామాయమాన, తత్సమ రూపం రామాయమానుడు.

పై వాక్యాలలో శోభాయమానంగా ఉండేది హాలు. ఇది వెలుగుతో శోభాయమానం. ఇల్లు ముగ్గులతో శోభాయమానం. ఇవి శోభతో ఉన్నాయి అని గదా రచయిత ఉద్దేశం. హాలు శోభవలె ఉన్నదని చెప్పడం గాని, ఇల్లు శోభవలె ఉన్నదని అనడం గాని రచయిత ఉద్దేశం కాదు గదా. అందువల్ల అర్థస్ఫోరకం కాదు గనుక అచేతనమయిన హాలు ఇల్లు శోభవలె లేదు గనుక, శోభాయమానం అనేది తప్పు. హాలు శోభిస్తున్నది, ఇల్లు శోభిస్తున్నది, వెలిగిపోతున్నది అని వర్ణించడమే రచయిత ఉద్దేశం గనుక శోభ+మాన = శోభమాన అనేది నిర్దిష్టమైన, దోషరహితమయిన రూపం.

కనుక శోభాయమాన అని వాడకండి, శోభామాన అని వాడండి, అయితే, మీ ప్రియురాలు శోభా అనే సుందరి వలె ఉన్నదని వర్ణించడం మీ ఉద్దేశమయితే మాత్రం, శోభాయమాన అని వాడండి. మీ ఇష్టం.

ఈ శోభాయమాన పదం సాదృశ్యంతోనే ఆప్యాయమాన అనే అపప్రయోగం చేస్తున్నారు.

ఎండలు మండిపోతున్నప్పుడు చల్లని పంచదార పానకం ఎంత ఆప్యాయమానంగా ఉంటుందో అని లొట్టలు వేస్తాడు ఒక పగటి కలవాడు.

ఇదిగో! అక్కగారూ! మీ చేతి వంట తింటే అమృతతుల్యం కాదు కాదు అమృతమే సుమండీ! ఎంత ఆప్యాయమానమో అంటాడు, ఇంట్లో ఎప్పుడు బడితే అప్పుడు దిగుతూ ఆడవాళ్ళను ఉబ్బించి పనులు చేయించుకునే జిత్తులమారి.

ఈ ఆప్యాయమాన పదం నిఘంటువులలో కనిపించదు. సూర్యరాయ నిఘంటువులో తనివి, తనివి పొందినది అనే అర్థాలిచ్చే ఆప్యానాది శబ్దాలు చాలా ఉన్నాయి. ఆప్యానము = తనివి, బలుపు, తనివి పొందినది, బలిసినది, ఆప్యాయకుడు =తృప్తిపరచువాడు, తృప్తిపొందువాడు, ఆప్యాయనము = బలుపు, వృద్ధి, ప్రీతి, తనివి. ప్రీతి కలిగించేది, తనివి కలిగించేది. ఆప్యాయము = తనివి, వృద్ధి, తృప్తి, ఆప్యాయి = తనివి కలిగించేవాడు, ఆప్యాయకుడు. ఆప్యాయత = ఆప్యాయకుడు, ఆప్యాయతుడు= తృప్తినొందింపబడినవాడు. కాని ఆప్యాయమాన అనే పదం లేదు.

ఇక వేగవంతగతికి వద్దాము. జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారనే వారు ఉండేవారు. ఆయన గొప్ప వక్త, దేశభక్తుడు. దేశ దుఃస్థితికి వగస్తూ ప్రసంగాలలో రొమ్ముబాదుకునేవారు. నగారా మోతమోగేది. ఆయన ఆశుతోష ముఖర్జీ శిష్యుడు. వంగ హిందీ సంస్కృతాంగ్లాద్యనేక భాషావేత్త. ఆయన తెలుగు ప్రసంగాలలోను, రచనలోను హిందీ బెంగాలీ మర్యాదతో ఉన్న సంస్కృత నమూనాలు తెగా వాడేవారు. భాస్వంతాశయాలు, హనుమంతలంఘనాలు, పూర్వ ఉదయగిరి లాంటివి. గురుదేవులు (రవీంద్రకవి) వాడగా లేనిది నేను వాడితే తప్పా? అని ఎదురు ప్రశ్నవేసేవారు. హిందీ బెంగాలీ భాషావ్యాకరణ పరిభాష వేరండీ. మన భాషామర్యాదలు వేరు. మనం సంస్కృతపదాల విషయంలో సంస్కృతవ్యాకరణాన్ని అనుసరిస్తాము. తుచ తప్పకుండా అంటామనుకోండి. దేశాల సరిహద్దులు చెరిగిపోయి ఏకభాష, ఏకలిపి ఆవిర్భవించనున్న ఆదర్శవంతకాలంలో ఈ సంకోచాలేమిటి? ముడుచుకొని పోవడాలు ఏమిటి అని సుదీర్ఘపన్యాసం బాదేవారు.

ఆ భాస్వంతాశయాల చిన్నారి చెల్లెలే ఈ వేగవంత గతి. ఈ చిన్నారి చెల్లెలిని కొందరు రచయిత్రులూ ముద్దుచేశారు. రచయితల సంగతి చెప్పనే అక్కరలేదు. ఇలాంటి సంబంధాలు వారికి మరీ ఇష్టం. వేగం కలిగిన నడక అనే అర్థంలో ఈ వేగవంతగతి వాడుకలో ఉంది. మనం సంస్కృతపదాలను తత్సమాలు చేసుకున్న తర్వాత వాటితో సమాసం చేయం. వేగవంత సమాసం వేగం కలది అనే అర్థంలో వేగ + మత్ తత్ వేగవత్ అవుతుంది. దీని ప్రథమావిభక్తి ఏకవచనరూపం పుల్లింగ మయితే వేగవాన్. బహువచనం వేగవంతః నపుంసకలింగమయితే వేగవత్, వేగవంతి. స్త్రీలింగమైతే ఈకారాంతమై వేగవతీ వేగవత్యః

ఈ సమాసంలో మూలపదం వేగవత్. మూలపదాన్ని వైయాకరణులు ప్రాతిపదిక అంటారు. ఈ వేగవత్ అనే మాటతో సమాసం చేసేటప్పుడు వేగవత్ అనే మూలరూపాన్నే వాడాలి. విభక్తులతో మారిన రూపాలను వాడరాదు. మనం వేగవంత మయిన గతిని గాని ప్రవాహాన్ని గాని చెప్పవలసివచ్చినప్పుడు వేగవత్ + గతి = వేగవద్గతి అని వేగవత్ + ప్రవాహ = వేగవత్ప్రవాహ అనే సమాసం చేయాలి. వేగవంతగతి, వేగవంతప్రవాహం అని వాడరాదు. ఈ సమాసాన్ని విడదీసి వేగవంతమైన గతి వేగవంతమైన ప్రవాహం అని వాడవచ్చు. సమాసం చేయదలచినప్పుడు పూర్వపదాలుగా వాడే శబ్దాలను ప్రాతిపదిక రూపాలుగానే వాడాలి గాని విభక్తియుత శబ్దాలు వాడరాదు. కనుక వేగవంతగతి, వేగవంతప్రవాహం అనే సమాసాలు తప్పు. వేగవద్గతి, వేగవత్ప్రవాహం అనే సమాసాలు ఒప్పు.

మరి, బలవంతమాఘస్నానం. బలవంతం చేశాడు భోజనం చేయమని అనే ప్రయోగాల మాటేమిటి అంటారు గదూ. బలవంత అనే పదం సంస్కృతపదమయినా బలాత్కరించడం, నిర్బంధించడం అనే అర్థాలతో తెలుగు మాటయిపోయింది. సంస్కృతంలో ఈ పదాలకు ఈ అర్థాలు లేవు. కనుక వీటిని సంస్కృతమూలపదాలతో విభిన్నార్థచ్ఛాయలలో నిష్పన్నమయిన తెలుగు పదాలుగానే గుర్తించాలి. బలవంత మాఘస్నానం = తనకు ఇష్టం లేకపోయినా ఇతరుల నిర్బంధంతో, ఒత్తిడితో, చలితీవ్రంగా ఉన్న మాఘమానంలో నదులలో మునగడం బలవంతం చేయడం = నిర్బంధించడం, ఒత్తిడి చేయడం, బలాత్కారం చేయడం.

శోభాయమానాలకు, వేగవంతగతులకు బలగం చాలా కనిపిస్తుంది. దానిని తరచి చూచి వాడుకోండి.

*****

## విచక్షణా రాహిత్యం కాదు – విచక్షణతా రాహిత్యం

ఏయ్! ఏంటి విచక్షణ లేకుండా వాగుతున్నావ్? నీ విచక్షణారహితమైన వాగుడు తగ్గించు – అన్నాడు బస్ స్టాపులో పోట్లాడుతున్న ఇద్దరిలో ఒకడు. నేనూ బస్సుకోసం అక్కడే నిలబడి ఉన్నాను గనుక వాళ్ళ పోట్లాట చూడక తప్పింది కాదు.

సరిగా మాటలురానీ – విచక్షణా, గిచక్షణా లేంది నీకు–అన్నాడు రెండో పెద్దమనిషి.

కావలిస్తే ఈయన్నడుగు. ఖద్దరు వేసుకున్నాడు. ఎవరికి విచక్షణ లేదో చెబుతాడు అన్నాడు మొదటివాడు.

ఆర్‌టిసి బస్సులకోసం పడి గాపులు గాస్తున్న వారి కందరికీ ప్రణయకలహాలు మొదలు ప్రళయతాండవాల వరకూ సుపరిచితాలే. ఇటీవల మరీ ఎక్కువయింది, బస్సులు ఆలస్యంగా రావడం.

దురీశ్వరద్వార బహిర్వతర్దికా
దురాసికాయై రచితోయ మంజలి:
యదంజనాభం నిరపాయమస్తిమే
ధనంజయ స్పందన భూషణం దానమ్॥

ఆ పాడు రాజుల పాడు భవనాల ముంగిటి అరుగులపై పాడు పడిగాపులకు ఒక నమస్కారం. కాటుక కాంతులతో కమనీయంగా ఉన్న, ధనంజయుని రథానికి అలంకారమైన, ఎన్నటికీ తరగని ధనం, ఎవరూ దొంగిలించే ప్రమాదం లేని ధనం – నా ధనం ఎలాటి అపాయమూ లేకుండా ఉంది–అని ఆ నాడు వేదాంతదేశికుల వారు రాజుల ఇళ్ల ముంగిళ్లలో పడిగాపులు వద్దని సుఖపడ్డారు. కాని, మనకు బస్సులకోసం పడిగాపులు తప్పవు. పాడు బస్సులు పాడు పడిగాపులు అని పోగలమా? గమ్యాలను నడిచి చేరుకోగలమా?

ఇలా ఆలోచిస్తుండగా, వారి కేకలు మరీ పెరిగిపోయాయి. ఇద్దరికీ విచక్షణాజ్ఞానం లేదనిపించింది. వారి భాష చూస్తుంటే, పత్రికలు వాడే విచక్షణారాహిత్యం మొదలయిన మాటలు వింటూంటే. పత్రికల అపశబ్ద ప్రభావం ఎంతగా పడిందో అర్థమయింది. ఇంతకూ ఏమిటీ విచక్షణారాహిత్యం? ఎక్కడి నుంచి వచ్చింది?ఎవరు ప్రవేశ పెట్టారు? ప్రవేశ పెట్టినవారు సరిగా ఆలోచించే చేసి ఉంటారు.

తర్వాతివాళ్ళు సరిగా ప్రయోగించడం తెలియక పాడుచేసి ఉంటారనిపించింది.

విచక్షణ అనే పదం వి అనే ఉపసర్గతో ఉన్న చక్ష్ ధాతువునుంచి వచ్చింది. విచక్ష్ ధాతువుకు, గోచరించు, ప్రకాశించు, విడిగా, విశిష్టంగా చూచు, భావించు, నిదానంగా చూపు సారించి చూచు, గ్రహించు, గౌరవించు, ప్రకటించు, చూపించు, ఘోషించు, చెప్పు, ప్రత్యేకంగా చూచేట్టు చేయు, స్పష్టపరచు అనే అర్థాలున్నాయి.

మరి ఈ విచక్ష్ ధాతువునుంచి పుట్టిన క్షణ శబ్దం మూడు లింగాలలోను ఉంది. దీనికి స్పష్టమైన దృష్టి గోచరమైన, విశిష్టమైన, విఖ్యాతమైన, ప్రకాశవంతమైన, కాంతులు వెలిజిమ్ముతున్న, వైభవోపేతమైన, ప్రత్యేకమయిన, విడివడిగా ఉన్న, ఇంద్రియగోచరమయిన, స్పష్టదృష్టిగల, చురుకైన, చతురమయిన, వివేకవంతమయిన, జాణ అయిన, గట్టిఅయిన, సమర్థమైన, అనుభవమున్న, నిపుణమైన, పరిచితమైన మున్నగు అర్థాలున్నాయి.

ఇప్పుడు విచక్షణ రాహిత్యం అనే పదాన్ని తారతమ్యం తెలీక, వివేకం లేక, విభేదాలు తెలియక, విశేషదృష్టి లేక అనే అర్థాలలో ప్రయోగిస్తున్నారు. అమరసింహుడు –

ధీమాగ్ సూరిః కృతీ కృష్టిః

లబ్ధవర్ణోవిచక్షణః

దూరదరీ దీర్ఘదర్శీ–

అని విద్వాంసుడు అనే అర్థంలో విచక్షణాశబ్దానికి పర్యాయంగా ఇచ్చాడు. విచక్షణ శబ్దానికి వివేకవంతుడు, స్పష్టమైన దృష్టితో పరిశీలించేవాడు అనే అర్థాలు ఇది వరకే తెలిశాయి గనుక, ఆలోచనలేక అనే అర్థం నిరాధార మయినదేమీ కాదు. అతడు విచక్షణుడు, అన్నప్పుడు అతడు పండితుడు అని అర్థం గనుక విశేషణమవుతుంది. కేవలం విచక్షణ శబ్దం ప్రయోగిస్తే విద్వాంసుడు అని విశేష్యమవుతుంది. దీనికి స్త్రీలింగరూపం విచక్షణా ఆకారాంతం, విద్వాంసురాలు అని దీని అర్థం.

విచక్షణారహితంగా నేడు ప్రచురంగా ఉన్న ప్రయోగాన్ని పరిశీలిద్దాం. ఈ పదంలో వి+చక్ష్+అన+రహిత అనే నాలుగు భాగాలున్నాయి. విచక్షణ శబ్దానికి విద్వాంసుడు అని, విచక్షణా శబ్దానికి విదూషి అని అర్థాలున్నాయి. గనుక విద్వాంసులు లేని, విదుషీమణులు లేని అనే అర్థాలు ఏర్పడుతాయి. ఇవి ఏ విధంగాను ఆలోచనారహితంగా, అనాలోచితంగా అనే అర్థాలను ఈయవు. వక్త ఉద్దేశం అది కాదుగదా! విచక్ష్ ధాతువుకు భావార్థక ప్రత్యయమైన అనచేరితే వి+చక్ష్+అన = విచక్షణ అనే రూపం ఏర్పడుతుంది. విచక్షణ రహితంగా = సమ్యక్కథనరహితంగా, బాగా చెప్పడమనేది లేకుండా అని అర్థం. ఆలోచనకూ, బాగా చెప్పడానికీ భేదం ఉంది. మొదటిది పూర్వదశ. రెండవది ఉత్తర దశ. బాగా ఆలోచించినప్పుడే బాగాచెప్పడం సాధ్యమవుతుంది. వక్త ఉద్దేశం ఆలోచనారాహిత్యం కాని, సమ్మక్కథనరాహిత్యం కాదు. పోనీ, సమ్మక్కథనమే వక్త ఉద్దేశమని భావించినా, విచక్షణారాహిత్యం అనే ప్రయోగానికి ఆ అర్థం రాదు. ఎందుకంటే విచక్షణా అనే రూపం ఆ అర్థంలో వ్యాకరణ సంప్రదాయ విరుద్ధం.

మరి విచక్షణారాహిత్యం, విచక్షణ రాహిత్యం అన్న పదాలకు విచక్షణుడు = విద్వాంసుడు లేమి, విచక్షణా విదుషి లేమి అనే అర్థాలే కాని, ఆలోచన, వివేకం లేని అనే అర్థాలు రావు. అయితే ఎందుకీ అపప్రయోగం ఏర్పడింది?

నా దృష్టిలో దీనికొక చిన్న పొరపాటు కారణమయి ఉంటుంది. మొదట విచక్షణ+తా+రా+హిత్యం = విచక్షణ – వివేకం, నైపుణ్యం లేని అని విచక్షణతారాహిత్యం అనే మొదట ప్రయోగించి ఉంటారు. దాని అర్థం విచక్షణ రాహిత్యం అని వాడడం ప్రారంభించి ఉంటారు. భావార్థకమైన తా, త్వ అనే ప్రత్యయాలు చేరిస్తే ఈ సమస్యే ఉండదు. విచక్షణతారాహిత్యం, సచక్షణత్వరాహిత్యం అనే సాధురూపాలు మళ్ళీ వాడడం ప్రారంభిస్తే విచక్షణా రాహిత్యం అనే తప్పును సవరించుకొన్నట్టవుతుంది.

కనుక మిత్రులారా! విచక్షణతా రాహిత్యం అనే సాధుపదమే ప్రయోగించండి, విచక్షణ పదానికి త చేర్చండి, అంతే.

ఇలాటివే పర్యవేక్షణారాహిత్యం, పర్యటనాకార్యక్రమం మొదలయినవి.

పర్యవేక్షణ అనే పదంలో పరి+అవ+ఈక్ష+అన అనే నాలుగు భాగాలున్నాయి. పరి, అవ అనేవి ఉప సర్గలు, ధాతువుకు ముందుకు వచ్చేవి. ఈక్ష అనేది ధాతువు – అన –అణ అనే భావార్థక ప్రత్యయం చివరన వచ్చే పదాలు నపుంసకలింగాలుగానే ఉంటాయి. అందువల్ల పర్యవేక్షణ అనే ల్యూట్ – అన ప్రత్యయాంతమైన పదం నపుంసకలింగం గనుక అకారంత నపుంసక లింగంగానే ఉంటుంది. ఇది సమాసంలో మొదటి పదంగా చేరినప్పుడు పర్యవేక్షణ అని హ్రస్వ అకారంతంగానే ఉంటుంది కనుక పర్యవేక్షణ రాహిత్యం అని అవుతుందేగాని పర్యవేక్షణా రాహిత్యం అని ణ కారం దీర్ఘం కాదు.

అలాగే పర్యటనాకార్యక్రమం అనే సమీపంలోని పర్యటన కూడా పరి+అట – అట ధాతువుపై వచ్చిన అన అనే ప్రత్యయం చేరిన రూపం. పర్యటన అనేది హ్రస్వాంతమేగాని పర్యటనాఅని దీర్ఘాంతం కాదు. అందువల్ల పర్యటనాకార్యక్రమం అని అనరాదు.

మరి పరిశోధనారంగం, పరిపాలనారంగం అనే సమాసపదాలలో పరిశోధనా, పరిపాలనా అని దీర్ఘాంతాలుగా ఉన్నాయే, పర్యవేక్షణారాహిత్యం అని ఎందుకు అనరాదు? అని మీరు ప్రశ్నిస్తారు. మీ ప్రశ్నకు సమాధానం చెప్పడం అవసరం గదా!

సంస్కృతవ్యాకరణ అంటే పాణినీయవ్యాకరణ ప్రకారం భావార్థకరూపం కోసం ల్యుట్ అనే ప్రత్యయం విధిస్తే అది 'అన'గా మారుతుందని ఇంతకు ముందు విన్నారు గదా! అలాగే యుచ్ అనే ప్రత్యయం ఒకటి ఉంది. దీనిని కూడా భావార్థకం కోసం వాడుతారు. ఇదికూడ అన అని మారుతుంది. అయితే ఒక విశేషం. ల్యూట్ అనే ప్రత్యయం అన్న ధాతువులపై రాగా, యుచ్ ప్రత్యయం ణిజంత ధాతువులపైన మాత్రమే వస్తుంది. ల్యూట్ ప్రత్యయం చేరిన రూపాలు నపుంసక లింగాలవుతాయి. యుచ్ ప్రత్యయం చేరిన రూపాలు స్త్రీలింగాలవుతాయి.

ల్యూట్ ప్రత్యయం ధాతువులన్నిటిపైనా వస్తుంది గదా. కనుక ణిజంత ధాతువులపై కూడ వస్తుంది. అందువల్ల పరశోధన, పరిపాలన అనే రూపాలూ

ఏర్పడుతాయి. అంటే నపుంసకలింగ, స్త్రీలింగ రూపాలూ ఉంటాయి. ఇలాటి పదాలే భావనం- భావనా, ధారణం - ధారణా, ప్రేరణం - ప్రేరణా కాని, ఈ క్ష ధాతువు ణిజంత కాదు. అందువల్ల ల్యూట్ ప్రత్యయం మాత్రమే వస్తుంది. అందువల్ల ఈక్షణం, పర్యవేక్షణం అనే నపుంసక రూపం మాత్రమే ఏర్పడుతుంది. ఏది ణిజంత ధాతువు ఏదిణి కాదు అనే విషయం వ్యాకరణజ్ఞులవల్ల తెలుసుకోవాలి.

ఏతావతా, పర్యవేక్షణరాహిత్యం అని నపుంసలింగరూపంగా వాడాలేగాని, పర్యవేక్షణారాహిత్యం అనే స్త్రీ లింగరూపంగా వాడరాదు.

నెచ్చెలులారా! సాధుప్రయోగాలు జీవితాన్ని కూడ సాధుమార్గంపై నడుపుతాయని వైయాకరణులంటారు. ఒక విషయంలో సరైన మార్గం అవలంబించేవారు, తక్కిన విషయాలలోను సవ్యమార్గంలోనే ఉంటారని మనస్తత్త్వ వేత్తలంటారు. మన పూర్వస్మృతికారులూ ఇదే అన్నారు- ఒక విషయంలో సాధుమార్గంలో ఉండేవాడి మనస్సు అన్ని విషయాల్లోను సాధుమార్గ ప్రవణమవుతుందని.

*****

## 'హా! సోదరీ' నమోదితా!

ఇటీవల ఒక దినపత్రిక లోపలిపుటలలో తాటికాయలంత అక్షరాలతో కాదుగాని, వేరు సెనగ గింజలంత అక్షరాలతో 'నమోదితం' అనే శీర్షిక కనిపించింది. (వేరు సెనగ గింజలు పగడాల ముక్కలలాగ ఉంటాయి. హిందీవారు దానికి మూంగ్‌ఫల్ అని కవితామయమైన పేరు పెట్టుకున్నారు. ఇంటికొక మట్టిపొయ్యిలాగ- కాదు కాదు గ్యాస్‌స్టౌ లాగ ఇంటికొక కవి ఉన్న తెలుగు జాతికి హిందీ వాళ్లకున్నంత కవితాస్పృహ లేకపోయిందా? వే...రు...సె...న...గ అన్నారు. ఏమన్నా కవిత్వం ఉందా? వేళ్లతో పీకడం, కాయలు రాల్చుకోడం వంటి కార్మిక  హృదయం తప్ప?) నమోదితం అన్న శీర్షిక చదవగానే నాకు నాలుగు దశాబ్దాలనాటి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారి "మన వారసత్వం" అనే పుస్తకం జ్ఞాపకం వచ్చింది. అది జస్టిస్ పంచాపగేశయ్యర్ ఐ.సి.ఎస్ గారో, మరెవరో వ్రాసిన ఆంగ్లరచనకు అనువాదమనుకుంటాను. ఆ పేరుచూచి చాలామంది పండితులూ, పండితమ్మన్యులూ కూడ ముఖం చిట్లించారు. కాటూరి వారు భాష తెలియనివారు కాదుగదా! మహాకవి, ఆంధ్ర జాతీయ కళాశాల ప్రిన్సిపాలుగా ఉన్నవారు. సౌందరనంద మహాకావ్యం రచించిన జంటకవులలో ఒకరు.

నాకు దానిని అంగీకరించడానికి మనస్సు ఒప్పలేదు. కాటూరివారు మద్రాసు వచ్చినప్పుడు – ఏవో సభల సందర్భంలో అనుకుంటాను– వారిని దర్శించి “వారసత్వం ఏమిటిసార్?” అని నీళ్లు సమిలాను (నీళ్లు నమలడం అనడాన్ని నా మిత్రపుత్రుడు కప్పగంతుల కృష్ణమూర్తి చ్యూయింగ్ ది వాటర్ అని అనువాదం చేశాడు.)

వారు నోటిలో జ్వలిస్తున్న చుట్టను తీసి బూడిద దులిపి సమాధానం చెప్పడానికి పూనుకొనేలోగానే నేను ఉండబట్టలేక “వారస అనేది ఫార్సీ పదమైన వారిస్ నుంచి ఏర్పడిన తద్భవం కదా! దానికి సంస్కృతప్రత్యయం తగిలించడం నప్పుతుందా?” అని అడిగాను.

వారు “మనకు ముస్లింల సంబంధంతో ఫార్సీ, అరబ్బీ భాషల పదాలు ఎన్నో చేరాయి గదా! ఇదీ అలాటిదే. తక్కిన ఎన్నో ఫార్సీ పదాలలాగే ఇదీ వాడుకలో ఉంది. కనుక వాడేశాను.” అన్నారు.

నేను నా పాండిత్యం వారికి చూపుదామనే ఉత్కంఠ కొద్దీ “ఫార్సీ కూడ ఒక ప్రాకృతభేదమని నా నమ్మకం. ఔరస అనే సంస్కృతపదం ప్రాకృతంలో ఔకారం ఓకారమై ఓరసో అని అయింది. ఫార్సీలో ఓరసో–వారిస్ కావడం అంత దూరమేం కాదు. దానికి భావార్థకంలో త్వప్రత్యయం కలపడం అంత ఎబ్బెట్టుగా కనిపించదు. పుడమీశుడు, ధారుణీశుడు అనేవి ప్రాకృతరూపాలతో ఏర్పడిన సమాసాలు గదా! పృథివీ అనేది పుఢవీ అయి, పుడమి అయి సమానఘటితమయింది. ధరణీ – ధారణీ – ధారుణి అయింది గదా! అలాంటప్పుడు మన వారసత్వం అంత తప్పుకాదేమో!” అని మరొకమారు నీళ్లు నమిలాను.

కాటూరివారు మరొకమారు చుట్టబూడిద దులిపి నా కేదో చెప్పబోయారు. జర్దా వీటీ పతులకు చుట్ట భక్షకులకు (భక్షయేత్ దంత ధవనం – అని వాగ్భటుడన్నాడు. ధంతధావనం ఫలానా ఫలానా చెట్టుపుల్లలతో చిగుళ్లు నొవ్వకుండా చేసుకోవాలి అనడానికి భక్షయేత్ దంతధావనం – దంత ధవనం తినాలి అని అన్నాడు. కనుక నేను చుట్ట భక్షకులకు అని వాడాను. మన్నించండి.) జర్దా బీడాలు, చుట్టలూ ఎదుటివాడిని అంచనాకట్టి మంచి సమాధానాలు ఇయ్యడంలో చాల తోడ్పడుతాయి. నా మిత్రులు, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో కన్నడరీడరు డాక్టర్ ఆర్.శేషశాస్త్రి మహాశయులు నాతో ఇటీవలే ఒక సందర్భంలో అన్నారు. “చూడండి! ఎవరన్నా నా వద్దకు వచ్చి ఏదయినా అడిగినప్పుడు జర్దాబీడా బిగిస్తాను. వారు చెప్పే మాటలు శ్రద్ధగా వినడానికి, ఆలోచించి సమాధానం చెప్పడానికి,సమాధానం దాటవేయడానికి ఇది ఎంతో తోడ్పడుతుంది.

“ వైయాకరణుడు పదాల సాధుత్వాల నిర్ణయం కోసం ఆకాశం చూస్తూ ఖసూచి అనేపేరు తెచ్చుకున్నాడు. కాని, కవి లోకంలో వ్యవహారంలో ఉన్నపదం చెవికి ఇంపుగా ఉంటే ప్రయోగిస్తాడు. వారసత్వం ఏ భాషాపదమయినా, చెవికి ఇంపుగా ఉంది, వాడాను” అన్నారు కాటూరివారు.

ఇక నేనే మనగలను? విని ఊరుకున్నాను. నేను ఉద్దేశ్యపూర్వకంగా వాడాననే వారితో వాదమేముంది?

వారసత్వం వంటిదే బానిసత్వమూను. కాని, ఒక భేదం వారస అనేపదం ఫార్సీ ప్రాకృతం నుంచి రాగా, బానిస అనేపదం మహారాష్ట్రీ ప్రాకృతం నుంచి– భారతదేశ ప్రాకృతం నుంచి వచ్చింది. మహానసం అంటే సంస్కృతంలో వంటిల్లు. మహానసలోని హా ఆ అయి మలో చేరిపోయి–మహానస > మ ఆ న స > మానస > బాణస > బానిస అయింది. మాణసో అనేది ప్రాకృతరూపం గనుక కన్నడంలో బాణసు అయింది. తెలుగులో బానిసగా నిలిచింది. దీనిపైన భావార్థకానికి సంస్కృతంలో వాడే త్వ ప్రత్యయం చేరి బానిసత్వం అనే రూపం ఏర్పడింది. తెలుగుపదాలకు సంస్కృతప్రత్యాయాలు చేరవుకనుక బానిసత్వం అనేది తప్పు. ఒక్క మలయాళసాహిత్యంలోనే సంస్కృతేతరమయిన మలయాళపదాలకు సంస్కృతప్రత్యయాలన్నీ చేర్చి ప్రయోగించే సంప్రదాయముంది. ఆంధ్ర, కన్నడాలలో అలాటిది లేదు. పుడమీశుడు వంటి సమాసాలున్నప్పుడు బానిసత్వంలో తప్పేముంది? అని ప్రశ్న కలుగుతుంది. ప్రాచీనకవులెవరూ బానిసత్వం వాడలేదనే సమాధానంతో సంతృప్తిపడాలి.

బానిసత్వం అని పదం భావార్థకమైనది ఉండనే ఉంది. దానిని వాడవచ్చుగదా! బానిసము = దాస్యము, బానిసతనము. దీనిని నిఘంటుకారులందరూ గ్రహించారు. వరవుడం బన, పనుపన. బానిస మన దాస్యనామంబులైయుండు–అని ఆంధ్రభాషార్ణవమనే ఆధునిక పద్యాంధ్ర నిఘంటువూ చెప్పింది. బానసము = వంట. బానసమువాడు = వంటవాడు, బానసపు బాడబుడు = వంట బ్రాహ్మణుడు.

పూర్వం దాసులను, బందీలను వంట వాళ్లుగా పనిచేయించేవారు గనుక వంట వాళ్లు బానసలు, బానిసలయ్యారు. బానిస–బాసి = దాసులు, సేవకులు. బాసియొప్పు బానిస యనగ తొత్తనగ అని ఆంధ్రభాషార్ణవం చెబుతున్నది. కనుక బానిసత్వం అనే అపశబ్దానికి మారు బానసము, బానిసము అనే పాతమాటలు వాడవచ్చు.

కాని, నమోదితం అనేది ఏ విధంగానూ మింగుడుపడడంలేదు. పాపం! జర్నలిస్టు భాయి నమోదిత అనే పదం మోద ఆమోద ప్రమోద సమ్మోద వంటి సంస్కృతపదమనే భ్రాంతి పడ్డాడేమో! మోద శబ్దం ముద్ అనే సంస్కృతధాతువునుంచి ఏర్పడింది. దానికి ఆ.ప్ర.సం అనే ఉపసర్గలు మొదట్లో చేర్చడంవల్ల ఆమోద, ప్రమోద, సమ్మోద అనే రూపాలు ఏర్పడుతాయి. మోదనుంచి మోదించు, ఆమోదించు, సమ్మోదించు, ప్రమోదించు అనే క్రియారూపాలు ఏర్పడుతాయి.

కాని నమోది అనేపదం ఫార్సీ పదం. దానికి సంస్కృత తిజంతప్రత్యయం చేరదు. కనుక నమోదితం అనేది అపప్రయోగం. నమోదు చేసిన నమోదయిన అని వాడడం ఉచితం, దీనిని విడిగా ప్రయోగించడమే కనిపిస్తుంది గాని, నమోదించు, నమోదించబడిన అని, మోద శబ్దంతో మోదించు అనే రీతిగా ప్రయోగాలు లేవు,

ఇలాగే తయారు అనేది తైయార్ అనే అన్యభాషా పదం, దీనిని తయ్యారు, తయారు అని వాడుతున్నాము. తయారగు, తయారుచేయు, తయారుచేయబడిన అని వాడడమే కనిపిస్తుంది. కాని ఇటీవల తయారించబడిన అనేమాటను పత్రికల్లో చూచాను. కన్నడం వాళ్లు కూడ తయారిసు అని, అంతగా మడిగట్టుకున్న తమిళులు కూడ తయారిత్త(తయారించిన) అనే ప్రయోగాలు చేస్తున్నారు.

అన్యదేశ్యపదాలను మనం వాడేటప్పుడు, ఆ పదానికి సహాయకక్రియను చేర్చి వాడుతాము కాని, వాటినే క్రియలుగా చేసుకోము. సంస్కృతాన్ని మన భాష అనుకున్నాము గనుక గర్జించు, తర్జించు, పఠించు, భుజించు అని క్రియలుగా వాడుతాము. మేఘం థండరిస్తున్నది అని అనం. వాడు రీడిస్తున్నాడు అని అనం. నన్ను చూచి స్మైలించింది అని అనం. ఢిల్లీకి టిక్కెట్టు బుక్ చేశాను – అంటాముగాని, టిక్కెట్టు బుకించాను, బుక్కించాను అని అనం, టెండూల్కర్ రెండువందల పరుగులు స్కోర్ చేశాడు అని అంటాము గాని, ఇంగ్లీషులో లాగ స్కోరించాడు అని అనం.

అందువల్ల నమోదిత అనిగాని, నమోదించు అనిగాని ప్రయోగించడం భాషాసంప్రదాయసమ్మతం కాదు.

*****

# క్షవరం కాదు; క్షౌరం

ఇటీవల ఒక పత్రికలో "ప్రభుత్వానికి కొన్ని కోట్ల రూపాయలు క్షవరం" అనే శీర్షికతో ఒక వార్త వెలువడింది. కొన్ని సంవత్సరాలుగా హవాలాలు, స్కాములు మొదలయినవాటితో లక్షలకోట్ల రూపాయలు ప్రభుత్వం నష్ట పోతూనే ఉంది. కనుక, నేను ఆ వార్త చదివి అంతగా బాధపడలేదుగాని, క్షవరం అనే మాట చదివి బాధపడ్డాను. ప్రభుత్వానికి నష్టం కలిగితే దేశానికి నష్టమే కదా! దానికోసం నేను బాధపడలేదని అనుకోకండి. నేను వందపైసల అప్పటమైన దేశభక్తుణే. ఆ నష్టం విచారించడానికి, రాబట్టడానికి అహి మహిరావణుల వంటి నాయకులున్నారు గనుక, సామాన్యుణ్ణయిన నేను చేయదగిందేమీ లేదు గనుక అంతగా బాధపడలేదన్నాను. అంతే.

ఔ అవగాను, ఐ అయిగాను మారడం సకలభాషలలోను సహజం గనుక (ప్రజల ముఖయంత్రాలలో పడిన వర్ణాలు రకరకాలుగా మారడం చూస్తున్నాము గనుక) క్షౌర అనే పదం క్షవరంగా మారడం ఆశ్చర్యకరమేమీ కాదుగాని, భాషకు ప్రమాణమని ప్రజలు భావించే పత్రికలు, భాషావిషయంలోను ప్రజలకు పథప్రదర్శకాలయిన పత్రికలు ఇలాటి తప్పులు ప్రకటించవచ్చునా, అనే బాధ మాత్రం కలిగింది. ఎక్కువగానే.

మన రాష్ట్ర రాజధానిలోని నాపితుల్లోనూ భాషాజ్ఞానం గలవారు చాలమంది ఉన్నారనడానికి నేను చూచిన నామఫలకాలే సాక్షులు. ఒకచోట 'ఆయుష్కర్మశాల' అనే పేరు చూచాను. మరొకచోట 'క్షౌరశాల' అని నిర్దిష్టమైన పదప్రయోగం గల నామఫలకం చూచాను. చాలసంతోషించి రెండు క్షణాలు నిలుచున్నాను దాని ఎదుట. ఆ క్షౌరశాలాధికారి నన్ను చూచి "క్షౌరమా? లోపలికి రాండి" అన్నాడు. "అబ్బే! నేను క్షౌరానికి రాలేదయ్యా. నీ దుకాణం పేరున్న పలక చూచి ఇంత భాషాజ్ఞానంతో నామఫలకం వేలాడగట్టినందుకు సంతోషిస్తూ నిలుచున్నాను" అన్నాను. అతడు వెంటనే "నేను బి.ఎ. చదివాను సార్. నాకు మా తెలుగు పంతులుగారు "క్షౌరం తు భద్రాకరణం, ముండనం వపనం తథా" అనే అమరశ్లోకమూ చెప్పారు సార్ అన్నాడు.

ఆ మాటలకు నాకు లాహోర్‌లో ఒక క్షౌరశాల నడిపే రమేశ్ చంద్ర గుర్తుకువచ్చాడు. అతడు లాహోర్ విశ్వవిద్యాలయంలో బి.ఏ. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఉద్యోగం దొరకలేదు. కులవృత్తికి సాటిలేదు గువ్వల చెన్నా అని అనుకున్నాడు కాబోలు, క్షౌరశాల పెట్టాడు. ఆర్యసమాజి. సంస్కృతంతోను కొంత పరిచయం ఉంది. 'ముండన్ మందిర్ ప్రొప్రయిటర్: రమేశ్ చంద్ర, బి.ఏ" అని బోర్డు తగిలించాడు. విశ్వవిద్యాలయం విద్యార్థులు ఎగబడేవారు.

నేను అక్కడికే తరచుగా వెళ్లేవాణ్ణి. అతడు మంచి మాటకారి "ఏక్ హజామత్ సౌ నియామత్" ఒక క్షౌరం వంద తరాలు అంటూ హిందీ, ఉరుదూ, ఇంగ్లీషు సామెతలు కుమ్మరిస్తూ పనిచేస్తూ, చేయిస్తూ ఉండేవాడు. అతని క్షౌరశాలలో నలుగురైదుగురు పనివారు ఉండేవారు.

"మీ శాల బోర్డు మార్చండి ముండన్ మందిర్ బాగాలేదు. మందిర్ అనేదాన్ని దేవాలయం అనే అర్థంలో వాడుతున్నారు. మందిరపదం తీసివేసి భవన్, గృహ్ అని పెట్టండి' అన్నాను. అతడు నవ్వుతూ "అజీ పండిత్‌సాబ్! ముండనం మా పంజాబీలకు చాల అలవాటయినమాట. ముడియా ఉంటే మీకు తెలుసుగదా! పిల్లవాడని అర్థం. ఇక్కడ మతప్రసక్తి లేకుండా అందరూ పిల్లలకు చాల చిన్నతనంలోనే పుట్టువెంట్రుకలు తీయిస్తారు. వారిని ముడియా అంటారు. ఇది ముండిత అనే సంస్కృతపదం నుంచి పుట్టింది. ముండిత - ముండియ-ముడియా అయింది. ఈ ముండనం అనేది మనలో ప్రతి కర్మకూ ముఖ్యం = వడుగుకు అవసరం, పెళ్లికి అవసరం, మొక్కుబడులకు అవసరం.ఎవరైనా మరణించినా అవసరం, ఇలాటి పవిత్ర కర్మజరిగేచోటు, మందిరంలాగ పవిత్రం కదా! కనుక మందిర్ అన్నాను', అన్నాడు. నేను నోరు తెరచుకుని వింటూండిపోయాను. అతడు నాకు మంచిమిత్రుడయ్యాడనుకోండి తర్వాత. ఇది 1940 నాటి ముచ్చట.

నా సమ పత్రికారచయితలకు ఈ పాటి భాషాజ్ఞానం లేకపోయిందా? అని అనుకుంటూ నెమ్మదిగా రెండడుగులు వేశాను. ఆ నాపిత బి.ఏ. నన్ను ఆపి, "ఇంతకూ మా గురువుగారు చెప్పారుగదా అని నేను క్షౌరపదం వాడాను. మీరు ఇంతగా శ్రద్ధ తీసుకున్నారు గనుక క్షవరం అని ఎందుకు అనగూడదు? అందరూ క్షవరమనే అంటుంటారు గదా!" అని ప్రశ్నించాడు. అతని జిజ్ఞాసకు మురిసిపోయి వివరించడం మొదలు పెట్టాను.

క్షుర అంటే కత్తి. ఇది క్షుర్ అనే ధాతువు నుంచి పుట్టినమాట. క్షుర్ అనే ధాతువుకు కోయు అని అర్థం. క్షురతి = కోస్తున్నాడు, తెంపుతున్నాడు అని అర్థాలు. క్షుర అనేది అకారాంత పుంలింగపదం. కనుక క్షురః అని ప్రథ మైక వచనరూపం. క్షురస్యధారా నిశితాదురత్యయా, దుర్గం పథస్తత్ వయోవదంతి - అని ఉపనిషద్వాక్యం.

క్షుర అనే పదానికి పల్లేరు, గొలిమిడి, బొట్టుగు - తిలకవృక్షం అనే అర్థాలూ ఉన్నాయి. ఈ క్షుర శబ్దం పైన ఎన్నో పదాలు ఏర్పడ్డాయి. క్షుర+కరీ = కుమారస్వామి తల్లులలో ఒకతి. క్షుర + కర్మ = క్షౌరం. క్షురీ+కృత్యం అన్నా క్షౌరమే. క్షుర+కృప్త = క్షౌరం చేయబడినవాడు. క్షుర+కృత్యా = క్షౌరం. క్షుర+చతుష్టయం = క్షౌరానికి కావలసిన

నాలుగు వస్తువులు. క్షుర + ధారా కత్తి వాదర. క్షుర + ధారః = కత్తివాదరలాగ పదునైన. క్షుర + నక్షత్ర = క్షౌరానికి మంచి నక్షత్రం చూడడం. క్షుర + పత్ర, క్షుర + పత్రిక = ఈ పేరుతో ఉన్న మూలికలు. క్షుర + పని = పదునైన వాదరగల ఆయుధం. క్షురపు = పదునైన. క్షుర + భట్ట = ఒక వ్యక్తి పేరు. క్షుర + భాండ = అడపం. క్షుర+భృష్టి=పదునైన అంచులు గల ఆయుధం. క్షుర +మార్ది = నాపితుడు. క్షుర + భద్రక = ఒక మేఘం పేరు.

క్షురికా – కత్తి. క్షురికా + పత్ర = కత్తివాదర. క్షురికా + ఫల = కత్తిపార్శ్వం. క్షురికా + ఉపనిషత్ = అథర్వవేదానికి చెందిన ఒక ఉపనిషత్తు. క్షరిన్ – క్షురీ = నాపితుడు. క్షురిణీ = నాపిత స్త్రీ.

ఈ క్షుర శబ్దం నుంచి – క్షురానికి సంబంధించిన పని అనే అర్థంలో క్షౌరం అనే మాట ఏర్పడింది. క్షౌర+కరణం = క్షురంతో చేసే పని. క్షౌర + కర్మ = అన్నా ఇదే. క్షౌర + నక్షత్రం = క్షౌరానికీ మంచి నక్షత్రం చూడడం. పూర్వాచారపరాయణులు చేసేవారు. క్షౌర + నిర్ణయః = క్షౌర నిర్ణయః – ఒక మంచి పుస్తకం పేరు. క్షౌర + మంత్ర = క్షౌరసమయంలో చెప్పేమంత్రం. ఇది ఇప్పుడు లాంఛనంగా ఉపనయనాల్లో పురోహితుడు పఠిస్తాడు. క్షౌర + విధి = క్షౌరకర్మ. క్షౌరపవ్య = చాలా పదునైన ఆయుధం. క్షౌరికః = నాపితుడు. క్షోర = అనినా క్షౌరమే.

"కనుక నీవు పెట్టిన పేరు సరైంది. క్షవరం అనకుండా క్షౌర అనే సాధుపదం వాడినావు" అన్నాను. ఆ క్షౌరశాల యజమానుడు "సార్, మా క్షౌర అనే పదం వేదాలలో ఉపనిషత్తులలో ఉన్నదని తెలిసి చాలా సంతోషమయింది, సార్" అన్నాడు వినయంగా.

నేను రాబోతుంటే, "సార్ కొంచెం ఆగండి, మరొక చిన్న సందేహం. మా గురువుగారు చెప్పిన భద్రా అనే మాటక్కూడా మంచి అర్థం ఏదైనా ఉంటే చెప్పండి సార్" అనడిగాడు. పనసకాయ దొరికినప్పుడే తద్దినం పెడుదామన్న మొనగాడు.

"భద్రా + కరణం = అంటేనూ క్షౌరమని నీకు తెలుసు కదా. భద్రా అనే పదం సమాసంలోనే ఉంటుంది. భద్రా + కరణం = మనిషి కేశాలను తీర్చిదిద్ది అందంగా చేయడం అని దీని అర్థం. క్షౌరకళ అని కూడా దీనికి అర్థముంది. భద్రా + కృ = భద్రారోతి = క్షౌరం చేసి అలంకరిస్తున్నాడు; క్షౌరంతో అందంగా తీర్చిదిద్దుతున్నాడు. ఇది సంతోషం అనే అర్థమిచ్చే మద్ర అనే మాటకు సంబంధింతమై ఉంటుందని మోనియర్ విల్లియమ్స్ నిఘంటువు అభిప్రాయం. మద్ర + క = మద్రకారీ = సంతోషం కలిగించేవాడు."

అతడు చాలా సంతోషించి "సార్ మీరు వస్తూండండి సార్. నేను లేకపోయినా, మా వాళ్ళకు చెబుతాను. మీకు ఉచితంగా సేవ చేస్తాను సార్" అంటూండగా నేను కదిలాను.

క్షౌరశాలముందు శబ్దచర్చ ఏమిటని పాఠకులు ఆశ్చర్యపడతారు గదూ! నిద్ర సుఖమెరుగదు, ఆకలి రుచి ఎరుగదు, కామం సిగ్గెరుగదు అన్నట్టు పదాల పిచ్చివాళ్ళు ఎదుటివాళ్ళ అర్హతానర్హతలు చూడరు, పరిసరాలను చూడరు.

*****

# పర్యాయం అంటే....

"పర్యాయము అనే పదమునకు తడవ విడత అని అర్థము వ్రాయుచున్నారు. మలినము అనే పదమునకు కల్మషము. కశ్మలము అని అర్థము వ్రాయుచున్నారు. ఈ అర్థాలు రెండూ సరియైనవేనా? లేక వాటిలో ఏ పదములు ఒప్పో, యే పదములు తప్పో తెలియజేయగలరని యువతలో సవివరముగా వ్రాయగలరని కోరుతున్నాను" అని సూర్యాపేట నుంచి శ్రీ యామా జనార్దన్ అనే జిజ్ఞాసువు కోరారు. ఇది మంచిప్రశ్న. గహనమైన ప్రశ్న.

ప్రతిభాషలోను పర్యాయాలు ఏర్పడడం విచిత్రంగా జరిగింది. ఒకభాష మాట్లాడే వారు వృద్ధి పొంది ఇతరప్రాంతాలకు విస్తరించినప్పుడు అక్కడి స్థానికుల ప్రభావం వల్లనో, మరే కారణాల వల్లనో అర్థచ్ఛాయ గల పదాలు మొదట ఏర్పడి, అవి బహుళ ప్రయుక్తమయి, పాతపదాల స్థాయిని అందుకుని పర్యాయాలవుతాయి. సంస్కృతంలో పర్యాయపదాలు అంతగా ఏర్పడడానికి కారణం బహుళవిస్తృతి అని భావిస్తున్నాను. సంస్కృతంలో పాలు అనే అర్థమిచ్చే దుగ్ధ, క్షీర, పయః అనే పదాలు చూద్దాం. ఇవి కాలక్రమాన పర్యాయపదాలయి ఉంటాయని నా విశ్వాసం. నాకు తోచిన కారణం వివరిస్తాను. నేడు ఉత్తరాపథంలో పాలు అనే దానికి ఎక్కువ ప్రచారంలో ఉన్న మాట దుగ్ధశబ్దం నుంచిపుట్టిన దూధ్ అనే పదం. ఇది పంజాబీలో దుధ్. దుధ్ దుగ్ధకు చాలా దగ్గరిది. ఇదుద్ధం అనే ప్రాకృతపదానికి తర్వాతి రూపం. దుద్ధ ఉచ్చారణసౌలభ్యం కోసం ఆదివర్ణం దీర్ఘమై దూధ్ అయింది. కాని సింధ్‌లో (ప్రస్తుతం ఇది పాకిస్తాన్‌లో ఉంది) పాలను ఖీర్ అంటారు. పంజాబీలు సింధీలను హాస్యం చేస్తుంటారు. మూర్ఖులారా! పాలకూ, పరమాన్నానికీ భేదం తెలియని వాళ్ళురా మీరు అని. ఖీర్ అంటే ఉత్తరాపథ భాషలు చాలావాటిలో పరమాన్నం. పరమాన్నమంటే పాలతో వండినట్టిది గనుక, క్షీరం

నుంచే పుట్టింది గనుక ఖీర్ అయింది. ప్రాకృతాలలో క్ష ఖ, గా, చ్ఛగా, క్ఖగా, ఖు గా మారుతుంది. పరమాన్నం అనే అర్థం ఖీర్‌కు రావడం తర్వాతి దశ. మొదటి క్షీర శబ్దానికి పాలు అని మాత్రమే అర్థం ఉండి ఉంటుంది. తర్వాత తద్వికారవస్తువులకూ వ్యవహృతమై ఉంటుంది. కనుక క్షీర శబ్దం ప్రాచీనతమమని భావించవచ్చు. ఆవు పొదుగుల నుంచి స్రవిస్తున్న పాలను చూచి మనపూర్వులు క్షీర అని ఉంటారు. తర్వాత దానికి క్షరతీతి –కారేది గనుక క్షీరం అనే వ్యుత్పత్తి కల్పించి ఉంటారు. దుహ్యతే ఇతి పితుకబడుతున్నది గనుక దుగ్ధమయింది. ఇలా అర్థచ్ఛాయలతో పర్యాయపదాలు ఏర్పడుతాయి. మొదట ప్రాంతీయంగా వ్యవహారంలో ఉండి ప్రయోగబాహుళ్యం పొంది పర్యాయాలవుతాయి.

ప్రాకృతం సంస్కారం పొంది సంస్కృతమైనా సంస్కృతం కూడ ఒకప్పుడు వ్యవహారంలో ఉన్న భాషే. బుద్ధుని ఉపదేశాలన్నీ పాటలీపుత్ర పరిసరభాషలో ఉన్నాయి. ఆ భాషను పాలీ అన్నారు. పాటలీ – పాట్లీ – పాలీ అయిందని నా విశ్వాసం. తన ఉపదేశాలను సుదూరప్రాంతాలకు విస్తరింపజేయాలని బుద్ధుడు సంకల్పించినప్పుడు అతని శిష్యులు "భంతే! మీ ఉపదేశాలు పాలీభాషలో, పాటలీపుత్రపరిసర భాషలో ఉన్నాయి. గాంధార బాహ్యీక గంగా తీర ప్రాంతాలలో సంస్కృతం బహుళప్రచారంలో ఉంది గదా! ఎలా? అని ప్రశ్నించినప్పుడు బుద్ధుడు మనకు భాష ప్రధానం కాదు. అష్టాంగ మార్గం అందరికీ తెలియాలి. కనుక ఆయా ప్రాంతాల భాషలోనే ఉపదేశాలను వ్యాపింప జేయండి అన్నాడు. కనుక నేడు పాకిస్థాన్‌లో ఉన్న ప్రాంతాలలోను ఆఫ్ఘనిస్థానాది ప్రాంతాలలోను సంస్కృతం ఏదో రూపంలో వ్యవహారంలో ఉండి ఉంటుంది. అర్థచ్ఛాయల వల్ల పర్యాయపదాలు ఏర్పడుతాయనడానికి ఇంత దూరం వచ్చాము. ఇక పర్యాయం అనే సంస్కృతపదానికి తడవ విడత అనే అర్థాలు చెప్పవచ్చునా కూడదా అనే విషయానికి వద్దాం.

పర్యాయం అనే పదంలో పరీ అనేది ఉపసర్గ. ఆయాధాతువుపై వచ్చిన రూపం పరీ + ఆయః = పర్యాయః. దీనికి గుండ్రంగా తిరుగు చుట్టూ తిరుగు, క్రమం తప్పకుండా జరగడం, మరల సంభవించడం, పునఃకావడం, మారుగా, ఒకరి తర్వాత ఒకరుగా, ఒకపదానికి మరొకపదం, పద్ధతి, మార్గం పర్యాయమనే అలంకారం, సంభవం, అవకాశం తడవ, విడత తూరి అనే అర్థాలున్నాయి.

పర్యాయ + కర్మ = ఒకరి తర్వాత ఒకరు వచ్చే పద్ధతి. పర్యా + చ్యుత = అవకాశం పోగొట్టుకున్నవాడు. పర్యాయ + వచన = సమానవచనం. పర్యాయ + వాక్య = సమానవాక్యం. పర్యాయ + కృతి = సమానమైన మరొక కృతి. పర్యాయ + నయనం = మార్చిపడుకోడం, మార్చి మార్చి కాపలా కాయడం. పర్యాయ + సూక్తం = తడవ తడవకు చెప్పే సూక్తం. పర్యాయ శాస్త్ర అన్నా అదే అర్థం. పర్యా + సేవ =

మార్చి మార్చి చేసే సేవ. పర్యాయ + అన్న = మరొకరికి ఉద్దేశించిన అన్నం. పర్యాయ ముక్తావళీ = పర్యాయపదాలున్న పుస్తకం పేరు. పర్యాయ + పదమంజరీ = పర్యాయపదాలున్న ఒక పుస్తకం పేరు. పర్యాయ + అర్ణవ = పర్యాయపదాలున్న ఒక పెద్దనిఘంటువు పేరు. పర్యాయ + ఉక్తం = ఒక అలంకారం. దీని లక్షణం పర్యాయయోక్తం తు గమ్యస్య వచోభంగ్యంత రాశ్రయం. ఒక విషయాన్ని మరొకభంగిగా చెప్పడం. రాహువును సంహరించాడు అనడానికి రాహువు భార్య పయోధరాలను నిష్ప్రయోజనం చేసిన ఆ దేవునికి నమస్కరిస్తున్నాను అని అనడం. ఇలా వివిధార్థాలు పర్యాయశబ్దానికి ఉన్నవి. కనుక పర్యాయ శబ్దానికి తడవ, విడత అనే అర్థాలు సరైనవే, తప్పు కాదు అని అభిప్రాయపడుతున్నాను.

ద్వైత సంప్రదాయానుయాయులకు కర్ణాటకలోని ఉడిపి అనే క్షేత్రం చాలా ముఖ్యమయినది. మధ్వాచార్యుల వారు తమ సిద్ధాంతప్రచారం కోసం ఎనిమిది మఠాలు స్థాపించారు. ఈ మఠాధిపతులలో ఒకరు రెండేళ్ళకొకమారు ఆ ఎనిమిదింటిపైన అధికారం పొందుతారు. ఇలాంటి మఠాధిపతులను పర్యాయ మఠాధిపతి అంటారు. ఈ మఠాధిపతులలో పేజావర్ అనే మఠం అధిపతి గొప్ప దేశభక్తులు, గొప్ప సంస్కర్తలు. ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాల్లో ఈ పర్యాయపదం ఉంది. ఒక శాఖలోని ఆచార్యులకు పర్యాయక్రమంగా శాఖాధ్యక్షపదవి లభిస్తుంది.

ఇక మలినశబ్దార్థాలను గురించిమలిన శబ్దానికి కల్మష కశ్మలాలు అనేవి సరైన అర్థాలా అనేది ప్రశ్న. మలిన శబ్దానికి మరక అంటిన, కంపుకొట్టే, అపవిత్ర, మురికి అంటిన, నల్లని, మురికి బట్టలు కట్టుకున్న, పాశు పతశైవుడు, రజస్వల, చెడ్డవాడు, దుర్మార్గుడు, నీరు, మజ్జిగ అనే అర్థాలున్నాయి.

మలిన శబ్దంతో ఏర్పడిన పదాలు చాలా ఉన్నాయి. మలిన శబ్దం విశేషణంగా గల వానికితాత్వప్రత్యయాలు చేర్చితే మలి + తా మలినతా మలిన + త్వ = మలినత్వం, మలిన + ప్రభ = కాంతితగ్గిన. మసక మసక అయిన కాంతి. మలిన + మానస = మురికి మనస్సు గలవాడు. మలిన + ముఖక్రూరుడు, కొండముచ్చు, దయ్యం, కల్మష శబ్దం– కర్మ + పో = పుణ్యహారమైన అనే పదం నుంచి ఏర్పడిందంటాడు మోనియర్ విల్లియమ్స్. దీనికి మరక, మచ్చ, గుర్తు చీకటి, మణికట్టునుంచి కిందిభాగం, పాపం అనే అర్థాలున్నాయి. కల్మషమనే పేరుతో ఒక నరకమూ ఉంది. అపవిత్రమయిన, పాపిష్ఠమైన అనే అర్థాలూ ఉన్నాయి. సంస్కృతంలో విశిష్ట విశేషణాలు తారుమారవుతుంటాయి. నాయకుడు అనే పదం చూడండి. నాయకుడు విడిగా వాడినప్పుడు విశేష్యం. రాముడు కథానాయకుడు అన్నప్పుడు విశేషణం.

ఇక కశ్మల శబ్దానికి కస్మల అనే పర్యాయమూ ఉంది. దీనికి మురికి, చెడ్డ, అపవిత్రత, మూర్ఛ, మోహం అనే అర్థాలున్నాయి.

ఇవన్నీ పరిశీలించిచూడగా, మలిన పదం సూచించే అర్థం సామాన్యమయినదిగాను, తేలికయినదిగాను, కల్మష, కశ్మల శబ్దాలు కనిపిస్తాయి. కనుక మలిన పదానికి కశ్మల, కల్మష శబ్దాలు పర్యాయాలుగా వాడడం అంత ఉచితం కాదనిపిస్తుంది. మలినం కేవలం మురికైనదేకాని కల్మషం, కశ్మలం, కసుమాల మంత భయంకరమైన పాపం కాదనిపిస్తుంది. మురికిని తొలగించుకోగలం కాని, పాపాన్ని తొలగించుకోవడం కష్టం. ఇది కేవలం నా అభిప్రాయం.

*****

# యథారీతి చిక్కులు

శ్రీరామడుగు వెంకటేశ్వరశర్మగారు, శ్రీ కె.వి.శేషాచార్యులుగారు. సెప్టెంబర్ 19, 1995యువతలో ప్రచురించిన లేఖలు చూచాను. వారి సలహాలకు కృతజ్ఞుణ్ని.

నా వ్యాసంలోని ముద్రా రాక్షసాలవల్ల. నావల్ల జరిగిన అస్పష్టత వల్ల వారికి సందేహాలు రావడం సహజం. వాటిని నివారించడం నా విధి గనుక మనవి చేస్తున్నాను.

నా వివక్ష యథాలాభంగా అనడానికి మారు చాలామంది లాభఅలాపాల భేదం తెలియక యథాలాభంగా చెప్పాను. యథాలాభంగా విన్నాను. యథాలాభంగా చూచాను. అని సందర్భశుద్ధి లేకుండా ప్రయోగించడమేకాక, యదాలాభంగా అని, యథాలాబంగా అని యాదాలాబంగా అని పదాలను ఊపిరితీసేసి లాగుతూ పలుకుతున్నారు అది ఉచితం కాదు– అని చెప్పడమే. దీనిని నేను వివరించడంలో కృతార్థుడు కాలేకపోయానేమో! కనుక చాలామందికి సందేహాలు కలిగాయి.

యదా అనేది కాలద్యోతకం. యథాఅనేది ప్రకార ద్యోతకం. యదా ఎప్పుడు (తదాతో సంబంధించి యదాకదా = ఎప్పుడైనా, యదాతదా = అప్పుడప్పుడు యదా నికామం = సంతోషించినప్పుడు, మన ప్రాచీనశిలా, తామ్రశాసనాలలో వక్కణం చివర ఒక శ్లోకం ఉంటుంది, శాసనాన్ని పాటించండని

బహు భిర్వ సుధా దత్తా / బహు భిశ్యాను పాలితా / యస్య యస్య యదా భూమిః తస్య తస్య తదా ఫలమ్ / స్వదత్తాం పరదత్తాం వా / యోహరేత వసుంధరామ్ / గవాం కోటి సహస్రస్య / హంతు ర్గచ్ఛతి కల్బిషమ్.

ఇది వరకు చాలామంది భూమినిదానం చేశారు. ఆ దానాన్ని తర్వాత వచ్చిన చాలామంది పాలకులు నడిపారు. ఎవరికి ఎప్పుడు భూమి లభించిందో వారికి అప్పుడు ఫలం కలిగింది. తాను దానం చేసిన దానిని గాని, ఇతరులు దానం చేసిన దానిని గాని లాక్కునేవాడు వేయికోటిగోవులను చంపినవాడి పాపం పొందుతాడు అని దీనిఅర్థం. చివరి పాదానికి పాఠాంతరాలు ఉంటాయి వాటిలో ఒకటి.

షష్టి ర్వర్ష సహస్రాశి / విషాయాం జాయతే కృమిః

భూమిని హరించేవాడు అరవైవేల సంవత్సరాలపాటు అమేధ్యంలో పురుగైపుడతాడు అని దీని అర్థం.

రాజులు భూమిని దానం చేయడంలో మాగాణి, మెట్టఅని చూచి ఇచ్చేవారు కాదు. తమకు తోచినట్టు దానం చేసేవారు. పొందినవాడి అదృష్టం. అది బాగా పండవచ్చు. కొద్దిగా పండవచ్చు. అందుకోసమే చివరన

యస్య యస్య యదా భూమిః / తస్య తస్య తదా ఫలమ్

అనేమాట. దీనివల్ల ఎవరూ గింజుకో నక్కరలేదు. నాకు ఇలాటిది లభించింది. మీకు మంచిది లభించింది అని ప్రసక్తాను ప్రసక్తంగా ఈ శాసన శ్లోకాలు ఉదాహరించాను.

ఇక యథాప్రకారద్యోతకం. యోగ్యతా విప్సా సాదృశ్యా ద్వర్థాలలో యథా శబ్దాన్ని వాడవచ్చుననటం నిజమే. యథార్తు, యథార్తుకం = ఋతువును అనుసరించి ఋతువు ప్రకారం యథాకథితం = చెప్పిన ప్రకారం యథాకర్తవ్యం = కర్తవ్యాన్ని అనుసరించి, యథాకనిష్ఠం = చిన్నవాడినుంచి పెద్దవాడి వరకు, యథాకృతం = చేసినట్టు యథాకల్పం = కల్పం ప్రకారం, యథాకారం = పద్ధతిప్రకారం, యథాక్రమం = క్రమం, ప్రకారం, యథాక్షిప్రం = సాధ్యమయినంత తొందరగా, యథాప్రతిజ్ఞం = ప్రతిజ్ఞను అనుసరించి, యథాయోగ్యం = అర్హతను బట్టి, యథారబ్ధం = ఆరంభించిన రీతిలో, యథాలిఖితం = వ్రాతనుబట్టి, యథా వయస్కం = వయస్సును బట్టి, యథాతథం = ఎట్లా ఉందో అట్లా, యథారీతి = ఉన్న రీతిని అనుసరించి, భారతదేశం స్వాతంత్ర్యం రాగానే స్వదేశ సంస్థానాధీశులతో భారత ప్రభుత్వం ఒడంబడికలు చేసుకోవలసి వచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వంతో ఏ ఒడంబడికలు ఉన్నాయో వాటిని మన్నిస్తూ ఒప్పందాలు కుదిరాయి. అప్పుడు మేము ఆంధ్రప్రభలో యథారీతి ఒడంబడిక, యథారీతిసంధి, యథారీతి ఒప్పందం అనే మాటలు కొత్తగా వాడాము.

యదా కాలసూచకమని యథా ప్రకార సూచకమని చెప్పడానికి ఇంతగా ప్రయోగాలు చూపాను.

యథాలాభ అనే ప్రయోగం లేకపోయినా దానికి సమానార్థకమైన యథాప్రాప్తఅనే ప్రయోగాన్ని మోనియర్ విల్లియమ్స్ ఇచ్చాడు.

ఇంతకూ యదాలాపం అనే దాన్ని ఆలపించినప్పుడు, ఆలపించిన సందర్భంలో మాటల సందర్భంలో ప్రసంగవశాత్తు అనే అర్థాల్లో వాడడంలో ఎలాంటి విప్రతిపత్తి లేదు.

యథాలాప–యథాలాభ, యదాలాభ–యదా లాపాలను తారుమారు చేస్తూ ప్రయోగించినప్పుడే ఉన్న చిక్కల్లా. ఈ రెండు పదాలూ తారుమారుగా పలువురు వక్తలు సభా కంపంతోనో పొరపాటుగా గ్రహించటం వల్లనో, పలకడంవల్ల, ఈ పొరపాటుకు కారణం ఏమై వుంటుందని ఆలోచించి ధదలు రెండూ ఒకే వర్గంలోనివి గనుక ఈ తారుమారు ఉచ్చారణకు వాడుకలోకి వచ్చి ఉంటుందని నేనన్నాను.

– ఇంతకూ నా వివక్ష మొదట్లోనే వివరించాను. యథాలాభం. యదాలాపం అనే మాటలు రెండూ స్వతంత్రమైనవి. ఒకటి ప్రకారవాచి, రెండవది కాలవాచి. వీటిని తారుమారు చేయడం కాని, యథాలాభం, యదాలాబం, యదాలాబం, యాదాలాపం అని వాడడం గాని, యదాలాపంగా లభించింది అనిగాని, యదాలాభంగా అన్నాడు అనిగాని ప్రయోగించడం ఉచితం కాదని స్పష్టపరుస్తున్నాను. మనరాష్ట్ర రాజధానిలో దినమూ జరిగే సభలు, సమావేశాలలో ఇలాటివి విని విని విసుగెత్తి ఇంతగా చెప్పవలసి వచ్చింది.

వతౌవా యథా తథా ఇవ ఏవం అనే అవ్యయాలు సాదృశ్యవాచకాలని అమరకారుని వాక్కు.

నా వివక్షను స్పష్టీకరించడానికి అవకాశం కలిగించిన శ్రీ రామడుగు వెంకటేశ్వర శర్మగారికి, శ్రీ కె.వి. శేషాచార్యులుగారికి మరొకమారు కృతజ్ఞతాపూర్వక వందనాలు.

*****

# తిరుమల రామచంద్ర జీవిత – సాహిత్య విశేషాలు

అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా రాఘవం పల్లెలో 17 జూన్, 1913 న (ప్రమాది జ్యేష్ఠ శుద్ధ చతుర్దశి జ్యేష్ఠ నక్షత్రం) తిరుమల శేషాచార్యులు, శ్రీమతి జానకమ్మలకు తిరుమల రామచంద్ర జన్మించారు.

## విద్యార్హతలు

ఆలిగఢ్ ఆయుర్వేద విద్యాపీఠం నుండి ఆయుర్వేదభూషణ (1933), మద్రాసు విశ్వవిద్యాలయం నుండి తెలుగు – సంస్కృతంలలో విద్వాన్ (1936), పంజాబ్ విశ్వవిద్యాలయం నుండి హిందీ ప్రభాకర (1941) పూర్తి చేసిన వీరు లాహోర్‌లో బి.ఏ., చదువుకు వెళ్లారు కాని పూర్తి చేయలేకపోయారు. సంస్కృత, ప్రాకృత, తెలుగు, కన్నడ, హిందీ, తమిళ, ఆంగ్లభాషల్లో గాఢమైన ప్రవేశం ఉంది.

## స్వాతంత్ర్య సమరయోధుడు

ఉప్పు సత్యాగ్రహంలోను, వైయక్తిక సత్యాగ్రహంలోను పాల్గొని 12 నెలల కఠిన కారాగారశిక్షణు అనుభవించారు (1930–32). స్వాతంత్ర్య సేనానిగా సమ్మానం అందుకున్నారు. హైదరాబాద్. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, భారతి, పరిశోధన, ఆంధ్రభూమి, హిందూస్థాన్ సమాచార్ మొ॥ పత్రికల్లో వివిధ హోదాలలో పనిచేశారు.

## నిర్వహించిన శీర్షికలు

ఆంధ్రప్రభ వారపత్రికలో నుడి–నానుడి, తెలుగుతల్లి, మరపురాని మనీషి, శీర్షికలను, ఆంధ్రసచిత్ర వారపత్రికలో హైదరాబాద్ నోట్‌బుక్, తెలుగు వెలుగులు శీర్షికలను, భారతిలో సాహితీ సుగతుని స్వగతం, మనవిమాటలు; ప్రజాతంత్రలో ఇదీ మన హైదరాబాద్, ఆంధ్రప్రదేశ్‌లో రాజధాని విశేషాలు; పల్లకిలో ప్రాచీనాంధ్ర గాథలు; పరిశోధనలో చరిత్రకెక్కని చరితార్థులు, తెలుగు తోబుట్టువులు; ఉదయం దినపత్రికలో మరో ప్రపంచం; ఆంధ్రప్రభ దినపత్రికలో మాండలికాలు, పలుకుబడి అన్న శీర్షికలను నిర్వహించారు.

## ప్రచురణలు

సంస్కృతంలో సత్యాగ్రహ విజయః, నాటకం (1930), సుమతిశతకమ్ (1932), హిందీలో ఆంధ్ర కే కుఛ్ త్యోహార్ రచనల చేశారు. తెలుగులో: రూట్ మార్చ్ (సైన్యం కథలు) (1945), వీరగాథలు (1952), దక్షిణాంధ్రవీరులు (1953), లాల్‌బహదూర్‌శాస్త్రి (1953), కాటమరాజు (1955), హిందువుల పండుగలు – పర్వాలు (1957), మన లిపి – పుట్టుపూర్వోత్తరాలు (1957), ధర్మదీక్ష (1958), శశాంకవతి (బృహత్కథ ఆధారంగా నవల) (1960), తెలుగు వెలుగులు (1962), నుడి నానుడి (1963), సాహితీ సుగతుని

స్వగతం (1970), నూరేళ్ళ తెలుగు వ్యాసం (1975), మరపురాని మనీషి (లేఖినీ చిత్రాలు) (1975), నాగలాపురం – దాని పరిసరాలు (చరిత్ర పరిశోధనం) (1975), గాథాసప్తశతిలో తెలుగు పదాలు (1980), మూడు వాఙ్మయ శిఖరాలు (1988), తెలుగు పత్రికల సాహిత్యసే (1989), ప్రాకృత వాఙ్మయంలో రామకథ (1992), మనవి మాటలు (1992), బుద్ధుణ్ణి బళ్లో వేసిన కథ (1993), బృహదారణ్యకం (1993), అహం భో అభివాదయే (లేఖినీ చిత్రాలు) (1995), హాలుని గాథలు – తెలుగు కథలు, నాలుగు చరిత్ర స్తంభాలు, హంపీ నుంచి హరప్పాదాక. మనోరమా వాచకాలు, వివేకానంద వాచకాలు, ఆనంద వాచకాలు (1954–1956), వేయికి పైగా వ్యాసాలు, వందలలో పుస్తక సమీక్షలు చేశారు.
దాదాపు 17 కలం పేర్లతో పత్రికలలో రచనలు చేశారు.

### అనువాదాలు
అవధాన కల్పలత (1960), బృహత్కథామంజరి (1964), లలిత విస్తర మహాపురాణం (సం–ప్రా) (1969), హరమేఖల (ప్రా) (1989), లీలావయీ కహా (ప్రా) (1994–1995), శాంతల నవల (కె.వి.అయ్యర్ (సా.అ.ఢిల్లీ) (1960), మరల సేద్యానికి (నవల) – శివరామకారంత్ – (సా.అ.ఢిల్లీ), మరణానంతరం (నవల) శివరామకారంత్ (సా.అ.ఢిల్లీ), గ్రామాయణం (నవల) రావ్ బహాదుర్ – (నేషనల్ బుక్ ట్రస్ట్, ఢిల్లీ), కన్నడ వ్యాస సంకలనం (సా.అ.ఢిల్లీ), కొన్ని కన్నడ నాటికలు (సౌతిండియన్ బుక్ ట్రస్ట్, మద్రాసు), చిరస్మరణ (నవల) (విశాలాంధ్ర, హైదరాబాద్), కామరాజనాడార్ రష్యా పర్యటన–ఆంధ్రపత్రిక (1970), రాజాజీ కథలు (1970), గాంధీజీ కారావాస కథ – సుశీల నయ్యర్ – ఆంధ్రప్రభ (1905). కేవలం ఆంగ్లం నుంచి 30 గ్రంథాలు తెనిగించారు.

### కొన్ని బిరుదులు, సన్మానాలు :
సాహితీసుగతుని స్వగతానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్ (1970), పత్రకార్ శిరోమణి, కలకత్తా సర్వభాష పత్రకార్ సమ్మేళన్ (1976), "మహామహోపాధ్యాయ" బిరుదం, అఖిలభారత విద్వత్పరిషత్తు, వారాణాసి (1978), 'గాథాసప్తశతిలో తెలుగు పదాలు'కు రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు, హైదరాబాద్. (1980), గౌరవ డాక్టరేట్ బిరుదు, సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాద్ (1988), రాజా లక్ష్మి అవార్డు, మద్రాసు (1989), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం విశిష్ట పురస్కారం (1993), "హంపీ నుంచి హరప్పా"దాకా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు (1999), హంపీ నుంచి హరప్పాదాకా "కేంద్ర సాహిత్యా అకాడమీ" అవార్డు (2001), తన జీవితాన్ని సాహిత్య సృజనకే అంకితం చేసిన తిరుమల రామచంద్ర 12, అక్టోబరు 1997న హైదరాబాదులో పరమపదించారు.

# అక్షర సేద్యం

ఆరుపదుల వయసుదాటినా అలుపు సొలుపులేక ముప్పదేళ్ళ ప్రాయం ఉత్సాహంతో వయోధిక పాత్రికేయ సంఘ సభ్యులు ఉరకలెత్తుతున్నారు. వృత్తికి, ఉద్యోగానికి వ్యత్యాసం ఎంతో ఉంది. ఉద్యోగానికి కట్టుబాట్లు, పరిమితులు, వృత్తి ప్రవృత్తికి సంబంధించిన అంశం. ఒకవైద్యుడు, ఒక న్యాయవాది, ఒక ఉపాధ్యాయుడు, ఒక పాత్రికేయుడు ఊపిరున్నంత వరకూ అడుగులు వేస్తునే ఉంటారు. పాత్రికేయవృత్తిలో చేయితిరిగి, తల పండిన వ్యక్తులు తమ అనుభవం, నేర్చుకున్న విజ్ఞానం రంగరించి వృత్తి ప్రయోజనాలు, ధర్మాలు పరిరక్షించుకుంటూ వర్గ సంక్షేమం, పని మెలకువలను సానబెట్టే మహాయజ్ఞాన్ని చేపట్టారు. అందులో భాగమే ఎనిమిది పుస్తకాల ప్రచురణ. వీటిని సాధారణ అచ్చుపుస్తకాలు అనుకుంటే పొరబాటే. అనుభవాల సారాన్ని మథించి రూపొందించిన గ్రంథాలే ఇప్పటివరకూ వచ్చిన ఏడు ప్రచురణలు.

<u>మన పాత్రికేయ వెలుగులు</u> - <u>Our Legends of the Fourth Estate</u>

వయోధిక పాత్రికేయ సంఘం చేపట్టిన తొలియజ్ఞం "మనపాత్రికేయ వెలుగులు", "Our Legends of the Fourth Estate" ప్రచురణలు. పత్రికారంగమే ప్రాణపదంగా, ప్రపంచంగా భావించి వృత్తికి అంకితమైన మహామహుల నుంచి నేటితరం వరకు అందరినీ స్పృశించిన గ్రంథం "మన పాత్రికేయ వెలుగులు". కందుకూరి వీరేశలింగం నుంచి టి. లక్ష్మీపతివరకు (1818 నుంచి 2004 వరకు) పత్రికా రంగానికి సేవలందించి పరమపదించిన 300 వందలమంది వైతాళికులు, కీర్తిశేషుల సంక్షిప్త పరిచయం రెండు విభాగాలుగా తీర్చిదిద్దారు. అదే విధంగా మూడోభాగంలో 'ప్రముఖులు'గా పరిచయం చేస్తూ పాత్రికేయ రంగ వికాసానికి కృషి చేస్తున్న ఈతరం కలాలను వివరించారు. అదేమాదిరి రెండు దశాబ్దాల అనుభవంతో పత్రికా రచయితలుగా నిలదొక్కుకున్న వారి ఫొటోలను నాలుగో భాగంగా తీర్చిదిద్దారు. జర్నలిస్టుల విధి నిర్వహణలో ప్రముఖ ఘట్టాలతో 'చిరస్మరణీయ చిత్రాలు' పొందు పరచారు వీటిని తెలుగు, ఆంగ్లభాషల్లో ప్రచురించారు. తెలుగునాట వెలువడిన పురాతన పత్రికల ప్రతులను వండి వడ్డించారు కూడా. తెలుగు పత్రికా ప్రముఖులతో కూడిన పూర్తి సమాచారంతో రాష్ట్రంలో వెలువడిన గ్రంథాలుగా ఈ రెండింటిని పేర్కొనవచ్చు.

### మార్పుచూసిన కళ్ళు

తెలుగు పత్రికారంగంలో కాలుపెట్టి అచిర కాలంలో ఆకాశవాణి వార్తావిభాగంలో చేరి రాష్ట్ర, దేశ, ప్రపంచ వ్యాప్త వార్తా విశేషాలను శ్రోతలకు గుదిగుచ్చి సమర్పించిన భండారు శ్రీనివాసరావు "మాస్కో అనుభవాలు" వ.పా.సం. ప్రచురణే! 1987లో అప్పటి సోవియట్ యూనియన్ రాజధాని మాస్కోలో, రేడియోమాస్కో తెలుగున్యూస్ రీడర్‌గా నాలుగున్నరేళ్ల అనుభవం రంగరించి అందించిన "మార్పు చూసిన కళ్ళు", ఆదేశంలో గడిపిన కాలపు చరిత్ర. వృత్తిరీత్యా పదవీ విరమణ చేసినా ప్రవృత్తిరీత్యా అక్షర సన్యాసం చేయని విలక్షణ, హాస్య, చతుర సంభాషకుడు భండారును ఆవిష్కరించే పుస్తకం ఇది. 'చందమామ' కథలా సాఫీగా సాగుతాయి ఆ అనుభవాలు.

### జర్నలిజం ఇన్ ఆంధ్రప్రదేశ్ (Journalism in Andhra Pradesh)

1943లో హైదరాబాద్‌లో జన్మించి జర్నలిజంలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసి 'డైలీన్యూస్' ఆంగ్లపత్రికలో ఉపసంపాదకునిగా పత్రికారంగంలో కాలూని అప్రతిహతంగా 2005 వరకు ఆంగ్లపత్రికా రంగంలో మెట్లెక్కుతూ 'ద హిందూ' హైదరాబాద్ కేంద్రంలో డిప్యూటి ఎడిటర్ హోదాకు చేరి పదవీ విరమణ చేసిన దాసు కేశవరావు అందించిన విశేషాల సమాహారం 'జర్నలిజం ఇన్ ఆంధ్రప్రదేశ్' ఇంగ్లీషు పుస్తకరూపం. తెలుగునేలపై పత్రికాప్రపంచం ప్రసరింప జేసిన వెలుగు జిలుగులను. కాలానుగుణంగా వచ్చి మార్పులను, సాధించిన ప్రగతిని, వ్యక్తుల వికాసాన్ని, సంఘటనలు, చోటుచేసుకున్న మార్పులకు సాక్షీభూతంగా నిలుస్తుందీ పుస్తకం. ప్రతి పాత్రికేయుడూ తప్పక చదవవలసిన చరిత్ర ఇది.

### తెలుగు పత్రికలు – తీరు తెన్నులు

వయోధిక పాత్రికేయ సంఘం ప్రచురణల్లో మణిమకుటం ఈ గ్రంథం. తెలుగు పత్రికారంగంలో ఆచార్య స్థానం అలంకరించి జర్నలిజానికి కొత్త ఒరవడి తీర్చిదిద్ది, చరిత్రను, భాషను, పదప్రయోగాన్ని 'కరతలామలకం' చేసిన ప్రసిద్ధ పాత్రికేయులు డాక్టర్ జి.యస్.వరదాచారి. సంఘటనలు, సంచలనాలు, పరిణామాలు పాఠకులకు అందించే కర్తవ్య పరాయణులైన వార్తా రచయితలు పాటించవలసిన సూత్రాలు, ధర్మాలు, సత్యనిష్ఠను సునిశిత భాషలో వివరించిన క్రియారూపమే "తెలుగు పత్రికలు – తీరుతెన్నులు". విషయాన్ని నాలుగు భాగాలు చేసి అర్థం, పరమార్థం వివరించారు. గురుపీఠంపై కూర్చుని

పాఠాలు చెప్పినట్లు కాకుండా మిత్రవాక్యంగా తేటతెలుగులో అందించిన వ్యాసాల సమాహారం ఈ పుస్తకం, నైతిక సూత్రావళి, దిద్దుబాటుగా విభజించారుర రచయిత వరదాచారి ఇందులో!

## శత వసంతోత్సవం

వ.పా.సం. ప్రచురణల్లో మరొక కలికితురాయి ఈ విశేషపుస్తకం. ఆంధ్రోద్యమానికి పునాదులు వేసింది. వంద సంవత్సరాల కిందట 1913లో బాపట్ల అనే చిన్న పట్టణంలో. ఇది ఆ పట్టణ ప్రజల అదృష్టమని చెప్పి తీరాల్సిందే. బాపట్లలో ఆంధ్రోద్యమానికి ఊపిరిపోసింది "ప్రథమాంధ్ర మహాసభ". వంద సంవత్సరాల మధురస్మృతిని వేడుకగా చేసుకుంటూ పురప్రముఖులు 2013 మే నెలలో శతాబ్ది ఉత్సవాలు నిర్వహించిన సుమూహూర్తంలో వ.పా.సం. ఉద్యమ విశేషాలను, వరుసన కన్నులకు గట్టినట్లు చిత్రీకరించిన ఘట్టమే "శతవసంతోత్సవం". స్మృతిపథంలో నాటి ఉద్యమవార్తలు – వ్యాఖ్యాలు – సంపాదకీయాల ముత్యాలసరం ఈ విలువైన పుస్తకం. దేశంలోని వేర్వేరు నగరాల్లో జరిగిన ఆంధ్ర్యోద్యమం, ఆంధ్ర మహాసభ, సహదక్షిణాఫ్రికా ఆంధ్రమహాసభ వివరాలు పునర్ముద్రించి పునశ్చరణచేశారు. 40 పుటల సంక్షిప్త చరిత్ర ఈ ప్రచురణ. తప్పక దాచి ఉంచుకోవలసిన సంపద ఇది.

## పండిత పాత్రికేయులు – బహుభాషాకోవిదులు

సరళమైన, సలక్షణమైన, సహజమాధుర్యమైన తెలుగు భాషకు పట్టంకట్టి, భావితరాలకు ముఖ్యంగా పత్రికారచయితలకు మార్గదర్శకులుగా వెలుగొందిన తిరుమల రామచంద్రకు చంద్రునికో నూలుపోగులా సమర్పించిన చిరుపుస్తకం "పండితపాత్రికేయులు – బహుభాషాకోవిదులు – తిరుమల రామచంద్ర". ఆ మహనీయుని శతజయంతి సంవత్సర తరుణాన అక్షరనివాళి సమర్పించే రీతిలో ఆయనను కీర్తిస్తూ పలువురు ప్రముఖులు రాసిన వ్యాసాల సమ్మేళన మీపుస్తకం. రామచంద్ర వరిష్ఠ పత్రికా రచయిత మాత్రమే కాదు, పండితుడు, పరిశోధకుడు, విమర్శకుడు, బహుభాషావేత్త, బహుగ్రంథకర్త. ఎన్ని పురస్కారాలు లభించినా, "పత్రికార్ శిరోమణి" బిరుదును మాత్రమే పేరుముందు చెప్పుకోవడానికి ఇష్టపడిన భాషాసేవకుడామహనీయుడు. ఆయన వివరాలే ఈ పుస్తక విషయం.

*****


ఆకు పచ్చని ఆవరణం కోసం
పసిడి పచ్చని రాష్ట్రం కోసం
తెలంగాణకు హరితహారం
గౌరవ ముఖ్యమంత్రి
శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖర్ రావు గారు
ప్రారంభించెదరు
తేది: జూలై 3, 2015, సమయం: సా॥ 3.00 గంటలకు
స్థలం: చిలుకూరు, రంగారెడ్డి జిల్లా.
రాష్ట్రంలో అడవుల శాతాన్ని 24 నుండి 33 వరకు పెంచడం
వచ్చే మూడేళ్లలో రాష్ట్ర వ్యాప్తంగా 230 కోట్ల మొక్కలు పెంపకం
ప్రతి ఏడాది ఒక అసెంబ్లీ నియోజకవర్గంలో 40 లక్షల చెట్లు,
ప్రతి గ్రామంలో 40 వేల చెట్లు పెంచడమే లక్ష్యం
కోతులు వాపస్ పోవాలి-వానలు వాపస్ రావాలి
కరువు కాటకాలకు శాశ్వత పరిష్కారం-విరివిగా చెట్లు పెంచడం
పుట్టినప్పటి నుండి చివరి గడియల వరకు మనిషి
జీవితంలో విడదీయరాని బంధం చెట్టుతోనే
పండ్ల చెట్లు, ఔషధ చెట్లు, నీడనిచ్చే చెట్లు,
విరివిగా చెట్లతో పర్యావరణం పరిపుష్టం
చెరువు కట్టపై, రహదారుల వెంట, బహిరంగ ప్రదేశాల్లో
ఎక్కడ ఖాళీ జాగా ఉంటే అక్కడ చెట్లు పెంచడం
రండి మొక్కలు నాటండి... చెట్లను పెంచండి,
మన తెలంగాణ రాష్ట్రాన్ని హరిత నందనవనం చేద్దాం
హరిత ఉద్యమంలో ముందడుగు వేద్దాం
అటవీ శాఖ
తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం
వనాలు ఎక్కడుంటే, వానలు అక్కడే కురుస్తాయి